The one and only Magazine devoted to Humour & Music

16-31 మార్చి 2002

# హాసం

హాస్య-సంగీత పత్రిక

పేజీలు : 68+8

వెల : రూ.10

సెంటర్ స్ప్రెడ్‌లో పాటల పుస్తకాలు

బ్రహ్మచారి

సవ్యసాచి

ప్రత్యేక అనుబంధంగా

ఎమ్మెస్ రామకృష్ణ

62 కార్టూన్లు



హాసం

# నిక్షిప్త చిత్రం



ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఘంటసాల, పి.బి.శ్రీనివాస్

హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇదీ సంగతులు

## హాస్యం సంగీతం



**సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా**
**'బ్రహ్మచారి', 'సవ్వడి'**
**సినిమా పాటల పుస్తకాలు**
**'సెంటర్‌స్ప్రెడ్'లో**







ముఖచిత్రం: 'నువ్వు లేక నేను లేను..' సినిమా నుండి ఆర్తి అగర్వాల్

'హాసం' మొదటి సంచిక నుంచి చూస్తు న్నాను. కవరేజ్ బావుంది. పాఠకులను వేరే లోకంలో విహరింపజేసినట్టుగా ఈ మ్యాగజైన్ తయారవుతోంది. ఉదాహరణకి ఒకప్పుడు 'చందమామ' పిల్లల్ని, పెద్దల్ని అలా అలరించేది. చక్కని సంగీతం, చిక్కని హాస్యంతో ఇప్పుడు 'హాసం' హాస్య - సంగీత ప్రియులందరినీ అందమైన లోకాలలో విహరింపచేస్తోంది. ఈ 'హాసం' ద్వారా ఖచ్చితంగా నిజంగా, జరిగిన ఎంతో మంది అనుభవాలను ఇప్పటి మన అనుభూతులతో దాచుకోవచ్చు.

- యస్వీ కృష్ణారెడ్డి,
(దర్శకుడు - సంగీత దర్శకుడు)

ఏకాదశరుద్ర సంచిక
శివభక్తి గీతాల గుళుచ్ఛంతో
పవిత్రంగా వచ్చింది
పదకొండో 'హాసం'
పరమాద్భుతంగా

-మిరియాల రామకృష్ణ, కాకినాడ

1-15 మార్చి 'హాసం' ఎప్పటిలా ఎన్నో విభిన్న శీర్షికలతో, వ్యాసాలతో, పాటలతో మమ్మల్ని బాగా అలరించింది. 'హాసం' పత్రికను ఎంతో ఉత్సాహంతో ఇంట్రెస్ట్‌తో చదువుతున్నాము. ముఖ్యంగా ఈ సంచికలో అలనాటి సంగీత దర్శకుడు పెండ్యాల గూర్చిన వ్యాసాలు ఎంతో ఆసక్తితో కూడుకొని ఉన్నాయి. అర్థం చేసు కుందాం, ఆస్వాదిద్దాం శీర్షిక కూడా ఎంతో ప్రయోజనంతో కూడుకొని ఉన్నది.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్.

దేవులవల్లి కృష్ణశాస్త్రి గారి వర్ధంతి సందర్భంగా భరణిగారు రాసిన ఆర్టికల్‌ని




'హాసం' పత్రికలో చదవగా ఆనందంతో మనసు కేరింతలు కొట్టింది - అద్భుతమైన ఆ భావ ప్రకటనకి, భాష సొగసుకి! మన మనసుల్ని వూపి వూపి, పీకి పెకలించి గోదారి అలలపై పారేస్తే... ఆ అలలపై వెల్లికిలా పడుకుని.... తేలిపోతూ... కల్సిపోతూ.... కొండొకచో మునకలు వేస్తూ... పండు వెన్నెలతో కొబ్బరి ఆకుల సందుల నుండి నయ్యాట లాడస్తూ.... ఓహ్.... ఎంతటి అనుభూతిని అందించారు భరణి!? దేవులపల్లి వారి స్థాయికి తగ్గట్టుగా వుంది. వర్ధంతి సందర్భంగా ఆ మహాకవికి పట్టిన నీరాజనం! ధన్యులం.

-అగ్నిహోత్రం లక్ష్మణకుమార్, హైదరాబాదు

ఆ మధ్య రెండు మూడు సంవత్సరాల క్రితం 'పాతాళ భైరవి' చిత్రం చూసినప్పుడు 'ఇతిహాసం విన్నారా...' అంటూ అత్యద్భుతంగా నర్తించి పాడిన నటి ఆ చిత్ర కథా నాయిక మాలతి కంటే కూడా ఎక్కువగా ఆకర్షించింది. ఆమె పేరు టి.జి.కమలాదేవి అని తెలుసుకానీ ఇతర వివరాలు తెలియలేదు. ఇంతకాలానికి 'హాసం' (1-15 మార్చి) ద్వారా ఆవిడ వివరాలు తెలుసుకోగలిగాను. ఇంకో ఆశ్చర్యకరమైన విషయం కూడా ఈ పక్షపు "హాసం" తెలిపింది. 67 పేజీలో వేసిన శివుడి వేషంలో ఎ.ఎన్.ఆర్ గారి ఫోటో! అది ఏ చిత్రంలోదో తెలుపగలరు. శివరాత్రికి నివాళిగా శివునికి సంబంధించిన 24 పాటలు కూర్చి ప్రచురించి నందుకు సంతోషము. ఈ సంచికలో నన్నాకట్టుకొన్న మరొక అంశం 'నల్లగొండలో హాసం సమావేశం'! మీరు మొదటే చెప్పినట్లుగా 'హాసం'కు అన్ని రంగాలలో అభిమానులున్నారనటంలో ఏ మాత్రం సందేహం లేదు. కాని అలాంటి వివిధ రంగాల అభిమానులు పూనుకొని ఒక సమావేశం నిర్వహించడం అన్నది, అదీను ఆ పత్రికను అభినందిస్తూ అన్నది నిజంగా హర్షణీయం. ఇట్టి అరుదైన అవకాశం పొందిన 'హాసం' పత్రిక నిజంగా అభినందనకు అర్హురాలు. చిత్తరంజన్ గారు బాల మురళీకృష్ణగారి గురించి విపులంగా వ్రాశారు.

అలాగే పెండ్యాల గురించి శ్రీ పి.బి.శ్రీనివాసు గారు మరింత వివరంగా చెప్పారు.

-జి.ప్రభాకర్, హైదరాబాద్

నాగేశ్వరరావు శివుడిఫోటో 'మూగమనసులు' సినిమాలోనిది. - సం॥

సంపుటి :1 సంచిక: 12

**16 - 31 మార్చి 2002**

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూధన శర్మ**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక 12

**ఈ** సంచికలో ఘంటసాల క్విజ్ ఫలితాలు లోపల పేజీలలో చూడవచ్చు. ఘంటసాలను ఆరాధించే తెలుగుదేశంలో హాసం పాఠకులకు సంబంధించినంతవరకు సరైన జవాబులు చెప్పగలిగినవారు ఇద్దరే వున్నారంటే ఆశ్చర్యం కలిగించినా దానితోబాటు మనం గమనించవలసిన విషయం మరొకటి కూడా వుందని అనిపిస్తుంది.

పాటలను విని ఆనందిస్తున్నాం సరే, పాతపాటలను రీమిక్స్‌ల రూపంలో సజీవంగా ఉంచుకుంటున్నాం సరే, ఆ పాటలను కావలసినంత లోతుగా, అధ్యయనం చేస్తున్నామా, విశ్లేషణాత్మకంగా పరికిస్తున్నామా, అన్న ప్రశ్న ఉదయిస్తుంది. పాట గురించి నలుగురితో కలిసి చర్చించుకుంటే దాని అర్థం, సందర్భం అంత త్వరగా మన స్మృతిపథం నుండి చెరిగిపోదు. మంచిపాటల గురించి విపులంగా విశ్లేషిస్తూ 'హాసం' వాటిని నిత్య నూతనంగా ఉంచేందుకు కృషి చేస్తోంది.

పోటీలో పాల్గొన్న పాఠకులు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆసక్తికరంగా వున్నాయి. 'సమాధానాలకోసం అన్వేషించేక్రమంలో మేం ఎన్నో మధురగీతాలను నెమరు వేసుకునే అవకాశం ఇచ్చారని' అభినందించారు కొందరు... కొందరికైతే ఈ పాటల క్యాసెట్ల ప్రయత్నంలో ఎన్నాళ్ళనుండో వెతుకుతున్న పాత క్యాసెట్లు లభ్యమయ్యాయట. తమకు తెలిసిన, తెలుసునని అనుకుంటున్న, జ్ఞాపకాల దొంతరలలో నుండి వెలికివచ్చిన, వెలికిరాకుండా దోబూచులాడిన అనేక పాటలు మనోవీధిలో మెరిసి, కవ్వించి, ఉల్లాసపరిచి వెళ్ళాయట. 'కనీసం రెండు, మూడు రోజులు చింతలు మరిచి గానవీధిలో విహరించే అవకాశం కలిగింది మీ పజిల్ పుణ్యమాని' అని ధన్యవాదాలు తెలిపారు కొందరు.

నిజమేకదా, ఫోటో ఆల్బమ్ తిరగేసి చూసుకున్నప్పుడు ఆయా వ్యక్తులు మన కట్టెదుట లేకపోవచ్చుగానీ, వాళ్ళ జ్ఞాపకాలు మనను ముప్పిరిగొంటాయి. పాటల సాహిత్యం చూసినా అంతే. ఆ పాట తొలిసారి ఎక్కడవిన్నామో, ఆ సినిమా ఎవరితో, ఎక్కడ చూసామో తలపుకు వచ్చి పులకిస్తుంది. అందుకే 'నోస్టాలిజియా'కు అంత ప్రాముఖ్యం.

'మీ పద సంపద' శీర్షిక పరంగా ఇంట్లో సభ్యులం అందరం కూర్చుని ఇప్పటికే చర్చించుకుంటున్నాం. ఈ పజిల్ కారణంగా ఇంట్లో అందరం కలిసి వాదోపవాదాలు (పాటల గురించే) చేసుకుంటూ మరింత చేరువయ్యాం' అని మరికొందరు అన్నప్పుడు మా సంతోషం వర్ణనాతీతం.

సంగీత సాహిత్యాలు నేత్రద్వయాలుగా భాసిల్లే సరస్వతీదేవి అర్చన 'హాసం' పాఠకుల ఇళ్ళల్లో ఆవిధంగా సాగుతుంటే మాకు కావలసినది ఇంకేముంది...?



# 'ఖామెడీ కథ'

- యం.వి.యస్. హరనాథరావు



ప్రతిఘటన, రాక్షసుడు, స్వాతి కిరణం, సూత్రధారులు, భారతనారి, రేపటి పౌరులు, అన్న, మా ఆయన బంగారం, ధర్మచక్రం, సగటుమనిషి, దేవాలయం, అమ్మాయికాపురం వంటి చిత్రాలతో పదునైన కలం ఉన్న రచయితగా ముద్రపడిన శ్రీ ఎం.వి.యస్. హరనాథరావు 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా రాసిన చిలిపి కథ ఇది.

ఈ కథపై మీ అభిప్రాయం పంపవలసిన చిరునామా:

ఎం.వి.యస్.హరనాథరావు,
ప్లాట్ నెం. 208, శ్రీనిలయ ఎస్టేట్స్,
బాటా షోరూమ్ ఎదురుగా, అమీర్‌పేట,
హైదరాబాద్

ఆ సిన్మా కంపెనీలో అందరూ తెగ నవ్వేస్తున్నారు. మలేరియా పట్టినట్లు అందరికి కామెడీ పట్టింది... కారణం ఏంటంటే - వో రైటర్ నవ్వించే సిన్మాకు కథ చెప్తానని ఆఫీసుకొచ్చాడు.

కామెడీ రైటరు... టీ పీల్చి, సిగరెట్టు చప్పరించాక, సిన్మా తాలూకూ దర్శక నిర్మాతలిద్దరూ కథ వినడానికి చెవులు శుభ్రం చేయించుకుని కూర్చున్నారు.

కామెడీ రైటరు నవ్వాడు. ఆయనగారి పళ్ళు కార్టూన్లలా కనిపించాయి.

'కథ చెప్పండి' దర్శక నిర్మాతలు నవ్వుతూ అడిగారు.

'నవ్వేకథ, కథే నవ్వు, నవ్వులేకుండా కథలేదు, కథలేకుండా నవ్వులేదు'... అంటూ తెగ నవ్వేస్తున్నాడు సదరు రైటరు.

'ఓహో నవ్వుకథా' అంటూ దర్శక నిర్మాతలిద్దరూ ఆఫీసంతా దొర్లి దొర్లి నవ్వుకున్నారు.

ఇలా రోజూ దొర్లి దొర్లి నవ్వితే ఆఫీసు చిమ్మేపని తప్పుతుందని అనుకున్నాడు - ఆఫీసుబాయ్

'కథ విన్నావట్రా'

అడిగారు ఆఫీసుబాయ్‌ని,

'ఆయనగారు చెప్తే కదండీ వినడానికి'

"నవ్వుకు కథేంట్రా... రైటరు నవ్వాడు. మేం నవ్వాం. వొచ్చినవాళ్ళు కామెడీ కథట కదా అని నవ్వుతున్నారు. కథ విన్న హీరోగారు... అవుట్‌డోర్ అన్న సంగతి మర్చిపోయి - తెగనవ్వేశాడు... నీవు నవ్వు నరం లేకుండా పుట్టావురా" అంటూ బూతులతో కొట్టాడు.

ఆఫీసుబాయ్‌కి అర్థం కాలేదు. ఆఫీసుకు ఎవరొచ్చినా... 'కథేంటి' - 'నవ్వుకథ' - 'కామెడీనా' - 'కాదు నవ్వుకథ' - "ఓహో అర్థమైంది... కామెడీని... తెలుగులో తీస్తున్నారన్నమాట"... అంటూ తెగనవ్వేస్తున్నారు.

కథ లేకుండా, తెలియకుండా అందరూ నవ్వేస్తున్నారు.

ఆఫీసుబాయ్‌కి పిచ్చెక్కుతోంది.



జుత్తుపీక్కున్నాడు. కేశవర్ధిని తైలం వాడటంవల్ల జుత్తు వూడి అతని బాధకు సింబాలిక్‌గా ఉపయోగపడలేదు. కథ చెప్పకుండా అందరిని నవ్విస్తున్న రైటరు చాలా దుర్మార్గంగా, దేవుళ్ళ సిన్మాల్లో బూతుజోకులా, కనిపించాడు.

ఆ రైటరు సంగతి తేల్చుకోవాలి.

ఆఫీసుబాయ్ ఆలోచించాడు.

లోపల నవ్వులు వినిపిస్తున్నాయి.

"మన కథకు విశ్రాంతి దగ్గర శుభం వేస్తాం. శుభం దగ్గర విశ్రాంతి వేస్తాం. ఇంతకంటే కథ ఏ సిన్మాకు వుంది?".

అందరూ మళ్ళీ కిందపడి దొర్లుతున్నారు.

ఈ దుర్మార్గం ఆపాలి. ఆఫీసుబాయ్‌లో ఆలోచనలు,

అందరికి టీలు ఇచ్చాడు.

అందరూ టీ కప్పులు చూచారు.

"ఇందులో టీ ఏదిరా"

"కథ వినకుండా నవ్వుతున్నపుడు, టీ లేకుండా కప్పును తాగలేరా"

"బావుంది. ఈ జోకు మనసిన్మాలో వాడుకుందాం, సెన్సారు సర్టిఫికెట్టు మీద పోస్టు చేద్దాం"

"సెన్సారు సర్టిఫికెట్టు మీదనా" అందరూ మళ్ళీ నవ్వారు.

ఆఫీసుబాయ్ కూడా నవ్వాడు.

"చూశారా! మన కథ మొదలైనప్పటినించి నవ్వని వాడు నవ్వాడంటే ఇంతకంటే సిన్మాలో కామెడీ ఏం కావాలి".

బాయ్ నవ్వింది ఎందుకో తెలియదు.

ఖాళీ కప్పుల్లో టీలు తాగిన అందరూ - "ఇలాంటి టీ ఎప్పుడూ తాగలేదు. రోజూ ఇలాంటిదే పట్రా - సిన్మా అయ్యేంతవరకూ" అన్నారు.

ఆఫీసు కుర్రాడికి పిచ్చెక్కింది...

"లాభం లేదు... ఏదో వొకటి చేస్తేగాని చిర్నవ్వు - అంతే.

ఆఫీసుకు టెలిగ్రాం వొచ్చింది.

ఆ టెలిగ్రాం ఇచ్చిన ఆఫీసుబాయ్ అందుకున్నాడు... రైటరుగారి దగ్గరకు వెళ్ళాడు. ఈ టెలిగ్రాం చూచయినా నవ్వులు ఆగిపోవాలి.

"సార్... ఇది ఏడుపు... దుఃఖం... బాధ - విషాదం... టెలిగ్రామ్ - మీ అమ్మగారు పోయారట"

అందరి నవ్వులు ఆగాయి.

రైటరు... టెలిగ్రాం అందుకున్నాడు, చూచాడు... గిలగిల... గలగల ఫెళ... ఫెళ... నవ్వాడు.

"విషాదంలో కూడా నవ్వా"

"కాదామరి, మా అమ్మ 15 ఏళ్ళక్రితం... నా కామెడీ కథ చదివి... నవ్వలేక గుండె ఆగిపోయింది. అప్పుడిచ్చిన టెలిగ్రాం ఇప్పుడొచ్చింది".

అందరూ మళ్ళీ నవ్వారు.

ఆఫీసు కుర్రాడి అయోమయం ఆఫ్ఘనిస్తాన్‌లో పడింది, ఆగని నవ్వులు...

పెరిగిన నవ్వులు - పెరగడం ఆగని నవ్వులు, సిన్మా ప్రయత్నాలు... సాగుతున్నాయి...

తెగనవ్వించే సిన్మా అని పత్రికలు రాస్తున్నాయి.

నిజమే - కథలేకుండా సిన్మా తీయడం నవ్వేకదా!

సినిమా తీశారు.

సెన్సారు వాళ్ళు చూచారు. కామెడీ కథ అని టైటిల్స్‌లో వున్నది, కట్ చెయ్యమన్నారు. కామెడీ అని చదివితే... 'కామం' అన్న పదం గుర్తుకొస్తోంది కాబట్టి దాన్ని 'ఖామెఢీ'గా మార్చమన్నారు.

జనం సినిమా మీద పడ్డారు. సినిమా జనం మీద పడింది.

సిన్మా చూచిన జనం ఇళ్ళకు వెళ్ళారు,

ఇంటికి రాగానే... వో భర్త... భార్య కాళ్ళమీద పడ్డాడు.

"ఇదేంటండీ - నవ్వు సిన్మాకు వెళ్ళొచ్చి నా కాళ్ళకు నమస్కారం చేస్తారా"

"అలా అనకు, నీలాటి పెళ్ళికాని భార్యను ఇంట్లో పెట్టుకుని... నలుగురు పిల్లలున్నారన్న సంగతి మర్చిపోయి., నీకు పెళ్ళి చెయ్యకుండా ఖామెఢీ సిన్మాలు చూస్తున్న దుర్మార్గుడ్ని... నీకు పెళ్ళి చేసి... నీకు తండ్రిలేని లోటు నీ బిడ్డలకు... భర్తలేని లోటు తీరుస్తా" అన్నాడు...

సిన్మాచూచిన వో స్టూడెంటు ఇంటికిరాగానే తండ్రి దగ్గరకు వెళ్ళాడు,

"డాడీ... నా కోర్కె తీర్చవూ"

"ఏంట్రా అది"

"టాంక్‌బండ్‌లో బుద్ధ విగ్రహం వుంది కదా"

"వుంటే-"

"ఆ విగ్రహానికి ఆ సైజులో పట్టుబట్టలు కట్టబెడతానని మొక్కు కున్నాను"

"అవును నాన్నగారూ ఖామెఢీ సిన్మాకు వెళ్ళి క్షేమంగా తిరిగివచ్చాను... నా మొక్కు తీర్చండి..."

ఆంధ్రదేశంలో సంచలనం,

కారణం - ఖామెఢీ సిన్మా ఆడుతున్న హాళ్ళన్నీ ఖాళీగా వున్నాయట, నిర్మాత, దర్శకుడు, రచయితలకు ఆంధ్ర ప్రేక్షకులు అర్థం కాలేదు.

ఖామెఢీ సిన్మాలకు కాలం చెల్లిపోయిందా!

ఇపుడు కలెక్షన్లు ఎలా పెంచాలి...

యాష్ ట్రే అనుకుని సిగరెట్టు బుర్రమీద రుద్దాడు రైటరు.

అంతే బుర్ర ఆలోచనను వాంతి చేసుకుంది.

మర్నాడు పేపర్లో -

నవ్వు సిన్మా చూసి కథ రాసిన వాళ్ళకు 'ఐదులక్షల బహుమానం'

అంతే... జనం విరగబడ్డారు - అనారోగ్యం గురించి ఆలోచించకుండా, కథలేని సినిమా కథ వూహించి, కథ రాసిన ప్రేక్షక దేవుళ్ళు పంపిన కథలతో ఆఫీసు నిండింది...

బహుమానం... నిర్ణయించే కమిటీలో ఆఫీసుబాయ్‌ని వేశారు, చివరకు ఓ కవరు దొరికింది... అందులోని కాగితాలు అందరూ చూచారు... సెభాష్ అనుకున్నారు, కథలేని సినిమాకు కథనురాసిన ఆ ప్రేక్షకుడికే 'ఐదులక్షల బహుమానం' అన్నారు.

ఆ కథ హక్కులు కొనడానికి ఇతర భాషలవాళ్ళు ఊళ్ళోకి దిగిపడ్డారు. కథ కోసం - ఎగబడ్డారు...

ఆ కాగితాలు... అందరికీ చూపించారు...

హాశ్చెరియం... ఖామెఢీ...

అవి తెల్ల కాగితాలు... వొట్టి తెల్లకాగితాలు...

శ్రీరామా అనికూడా రాయని తెల్ల కాగితాలు...

## ఘంటసాల క్విజ్ ఫలితాలు

1-15 ఫిబ్రవరి 2002లో ప్రకటించిన ఘంటసాల క్విజ్ గడువు తేది (15-2-2002) ఇంకా రెండు రోజులుండనగా అప్పటివరకు వచ్చిన రెస్పాన్స్ చూసి చాలా నిరుత్సాహ పడ్డాం. 'హాసం' పత్రికకి పజిల్స్, క్విజ్‌లు పనికి రావేమోనని, మా అంచనా తప్పేమోనని అనుకున్నమాట నిజం. ముగింపు తేదికల్లా పెరుగుతూ వచ్చిన ఉత్తరాల సంఖ్య చూస్తే చాలా ఆశ్చర్యం కలిగింది. కొంతమంది పాఠకులు ఆ ఆన్సర్లు ఫిలప్ చేయడానికి పడిన తాపత్రయాన్ని ఇచ్చిన వివరాలను చూస్తుంటే ఆనందం కలిగింది కూడా.

అయితే ఆల్ కరెక్ట్ రాసిన వారు ఇద్దరే కాగా ఒకే తప్పుతో రాసిన వారి సంఖ్య చాలానే ఉంది. నిజానికి ఆల్ కరెక్టుగా రాసిన వారికి మాత్రమే సంవత్సరం పాటు 'హాసం' పత్రికని పంపాలి. కానీ ఎక్కువమందికి 'హాసం' చేరాలని ఈ క్విజ్‌ని స్పాన్సర్ చేసిన శ్రీ చల్లా సుబ్బారాయుడు (కనిగిరి) కోరడంతో ఒక తప్పుతో రాసిన వారిలో లాటరీ తీసి ఓ ముగ్గుర్ని ఎంపిక చేయడం జరిగింది. వెరసి ఈ క్రింది 5గురికి 'హాసం' 1-4-2002 నుండి 31-3-2003 వరకు పంపడం జరుగుతుంది.

**1. జి.రాధాకృష్ణ -కాకినాడ (ఆల్‌కరెక్ట్) 2. దాసరి వెంకన్నబాబు -భీమవరం (ఆల్‌కరెక్ట్)**
**3. డి.రవ ు - విజయనగరం (లాటరీలో ఎన్నికైన వారు) 4. ఎన్.వి.రాంబాబు - అద్దంకి (లాటరీలో ఎన్నికైన వారు)**
**5. ఎమ్.శ్రీనివాస్ - హైదరాబాద్ (లాటరీలో ఎన్నికైన వారు)**



(1) ఘంటసాల - భానుమతి పాడిన చివరి యుగళ గీతం 'తాతమ్మకల'లో 'కోరమీసం సిన్నోడా'



(4) ఘంటసాల - బాలు కలిసి పాడిన పాటలలో పింగళి రాసిన పాట 'నీతి - నిజాయితి'లో 'భలేమజాలే భలే ఖుషీలే'

(2) ఘంటసాల - నాగయ్య కలిసి పాడిన మరో పాట 'పూలరంగడు'లో 'చిల్లర రాళ్ళకు మొక్కుతువుంటే చెడిపోదువురా ఒరే ఒరే'





(5) ఘంటసాల పాడిన పాటలలో 'హాసం' అనే మాట గల పల్లవి 'నర్తనశాల'లో 'ఎవ్వరికోసం ఈ మందహాసం' పాటలో ఉంది.



(3) ఘంటసాల పాడగా ఎయన్నార్, ఎన్‌టిఆర్ కలిసి పాడిన ఒక పాట 'గుండమ్మ కథ'లో 'కోలోకోలోయన్న కోలోనాసామి', పద్యం 'శ్రీకృష్ణార్జునయుద్ధం' లో సంవాద పద్యాలు



# స్వరకర్తల ఆవిష్కర్త... లత..!



72 సంవత్సరాల వయస్సులో ఆమె 16 ఏళ్ల అమ్మాయికి పాడటానికి కూడా సిద్ధమేనంటే ఆశ్చర్యపోవనసరం లేదు. ఇప్పటికి ఆరు తరాల సంగీత దర్శకులతో పనిచేసిన ఆమె ఇటీవలే 7వ తరానికి చెందిన రాహుల్‌శర్మతో పని చేసింది. ఆమె మరెవరో కాదు. గతపక్షం హైదరాబాదు విచ్చేసిన గానకోకిల లతా మంగేష్కర్. లతా మంగేష్కర్‌తో ఎక్కువ చిత్రాలకు పనిచేసిన కొందరు ప్రముఖ సంగీత దర్శకులతో ఆమె చిత్రానుబంధం....



లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ (695కు పైగా పాటలు)

వృత్తిపరంగా లత గానానికి పూర్తిగా అంకితమై పోయిన సంగీతకారద్వయం వీరు. లతతో వీరు ఎన్ని చిత్రాలకు పని చేసారన్నది పక్కన పెడితే, లతకు అద్భుతమైన పేరు సంపాదించి పెట్టిన సోలో సాంగ్స్, డ్యూయెట్‌లు వీరి నేతృత్వంలో రూపుదిద్దుకున్నవే కావటం విశేషం. హస్తాహు వా నూరానీ చెహ్‌రా (పారస్‌మణి), జీవన్ డోర్ తుమ్హీ సంగ్ (సతీసావిత్రి), గుడియా హమ్‌సే రూఠీ రహోగీ (దోస్తీ), చలో సజనా (మేరే హమ్‌దమ్ మేరోదోస్త్) ఆ జానే జాఁ.... (ఇంతకామ్), ఝిల్‌మిల్ సితారోంకా (జీవన్‌మృత్యు), మార్ దియా జాయే (మేరాగావ్ మేరాదేశ్), ఏక్ ప్యార్ కా నగ్మాహై (షోర్) హమ్‌తుమ్ ఏక్ కమరే మేఁ బంద్.... (బాబీ), సత్యం శివం సుందరం , మై తులసి తేరే అంగన్ మే టైటిల్ సాంగ్స్ ఇలా ఎన్నయినా చెప్పవచ్చు.

లత కంఠంలోని మాధుర్యాన్ని, ఆమెలోని గాయనిని పూర్తిగా ఉపయోగించుకున్నది లక్ష్మీకాంత్ - ప్యారేలాల్‌లు మాత్రమే. కాలానికి ఎదురొడ్డి నిలిచేలా వారు సృష్టించిన బాణీలు ఆదరణ పొందడమే కాదు. ఒ.పి.నయ్యర్ - ఆశా, ఆర్.డి.బర్మన్ - ఆశా కాంబినేషన్‌లో రూపుదిద్దుకున్న పాటలను మించి హిట్ అయ్యేలా ఎల్పీ - లతా కాంబినేషన్ అంటేనే హిట్ కాంబినేషన్ అని ప్రజలు అనుకునేలా చేసాయి. పారస్ మణి (1963)లో ప్రారంభమైన వీరి అనుబంధం ప్రేమ్‌గంథ్ (1996) చిత్రం వరకు నిర్విరామంగా కొనసాగింది.

---



శంకర్ జైకిషన్
(453 పాటలు)

ఒకే మూసలో కొట్టుకు పోతున్న సినీ సంగీతానికి 'బర్సాత్' చిత్రం ద్వారా శంకర్ - జైకిషన్‌లు ఒక దశ, దిశ చూపించగలిగేరంటే దానికి ప్రధాన కారణం లతా మంగేష్కర్ అనే అద్భుతమైన సాధనం వారి వెనుక ఉండడమే. అదే సమయంలో వీరి కౌశలం వృత్తిపరమైన సహకారం వల్ల లతకు మంచి పేరు వచ్చింది. 'ఘర్ ఆయా మేరా పరదేశి' (ఆవారా), కిసీనే అప్నా బనాకే.. (పతితా), ఈచక్ దానా (శ్రీ420), తుమ్హే యాద్‌కర్తేకర్తే (ఆమ్రపాలి) రుక్ జా రాత్ ఠహర్‌జా (దిల్ ఏక్ మందిర్) ఓ మేరే సనమ్ (సంగం), అజీబ్ దాస్తాఁ హై యే ... (దిల్ అప్నా ఔర్ ప్రీత్ పరాయీ), బేదర్దీ బాల్మా తుఝ్‌కో (అర్జూ) లాంటి అద్భుతమైన గీతాలు వీరి ముగ్గురి కాంబినేషన్‌లో రూపుదిద్దుకున్నవే కావడం విశేషం.

---



ఆర్.డి.బర్మన్
(331 పాటలు)

కొన్ని ప్రత్యేకమైన గీతాలను 'లత'తో మాత్రమే పాడించిన సంగీత దర్శకుడాయన. ఆర్.డి.బర్మన్ - ఆశాల కాంబినేషన్‌కు ఎక్కువ పేరు వచ్చినప్పటికీ 'లత'తో ఈయన చేసిన పాటలకు కూడా మంచి గుర్తింపే ఉంది. అతని కెరీర్ ప్రారంభమైన ఘర్ ఆజా ఘిర్ ఆయే (ఛోటే నవాబ్) మొదల్కొని భాయ్ బత్తూర్ ....(పడోసన్), ఆజాపియా, చునరీ సంభాల్ గోరీ, క్యా జానూఁ సజన్ (బహారోం కే సప్నే), యారీ హో గయీ (దో చోర్), రైనా బీత్ జాయేఁ (అమర్‌ప్రేమ్), దిల్‌బార్ దిల్ సే ప్యారే (కార్వాన్), పర్బత్ కే పీఛే(మెహబూబా) లాంటి ఎన్నో సూపర్‌హిట్ సాంగ్స్ 'లత' చేత పాడించారాయన. ఆర్.డి.బర్మన్ సంగీత కెరీర్‌లో 'లత'కున్న స్థానం అపూర్వమైనది.

---



కళ్యాణ్‌జీ - ఆనంద్‌జీ(302)పాటలు)

'లత'ను సరిగా వినియోగించుకోలేక పోయిన సంగీత ద్వయం వీరే. కానీ వీరి కాంబినేషన్‌లో ఆమె పాడిన చక్కటి మెలోడి పాటలు ప్రజాదరణ కూడా పొందాయి. యే సమా.... (జబ్ జబ్ ఫూల్ ఖిలే), చందన్ సా బదన్.., మైంతో ఛోడ్ చలీ బాబుల్ కా దేశ్.., ఛోడ్ దే సారీ దునియా (సరస్వతీ చంద్ర), వాదా కర్‌లే సాజనా (హాత్ కి సఫాయీ), దిన్-బ-దిన్ వో మేరే దిల్ సే (తృష్ణ), ఓ బాబుల్ ప్యారే (జానీ మేరా నామ్), హమ్ థే జిన్కే సహారే (సఫర్)లు వీరి కాంబినేషన్‌లో వచ్చిన మంచి గీతాలలో కొన్ని.

---



సి.రామచంద్ర
(298 గీతాలు)

ఓ చిన్న కారణం వల్ల 'లత'తో తనకు గల అనుబంధాన్ని విచ్ఛిన్నం చేసుకున్న సంగీత దర్శకుడు రామచంద్ర. అయితే అనార్కలి, అల్‌బేలా చిత్రాలలోని పాటలు వింటే మాత్రం వీరిద్దరూ కలిసి పనిచేస్తే ఇంకెన్ని అజరామరమైన గీతాలు వచ్చేవో కదా అన్పిస్తుంది. అలాగే మేరే మన్ కా బావ్‌రా పంఛీ.. (అమర్‌దీప్), రాధా నా బోలే (ఆజాద్), యేమేరే వతన్ కేలోగోఁ.. తదితర గీతాలు కూడా వీరికి మంచి పేరు తెచ్చాయి.



చిత్రగుప్త (240 పాటలు)

గాంధర్వ గానామృతాన్ని పంచిపెట్టే లత కంఠాన్ని అద్భుతంగా శ్రోతలను ఆకట్టుకునేలా మలిచిన సంగీత దర్శకులలో లక్ష్మీకాంత్ - ప్యారేలాల్, శంకర్ - జైకిషన్‌ల తర్వాత ర్యాంక్ చిత్రగుప్తదే. బల్మా మానే నా.. (ఒపేరా హౌస్) కృష్ణా వో కాలే కృష్ణా (మైఁ భీ లడ్కీ హూఁ), నాజూక్ నాజూక్ బదన్ మేరా (ఔలాద్), దీవానే తుమ్ దీవానే హమ్ (బేజుబాన్), దిల్ కా దియా జలాకే గయా (ఆకాష్ దీప్), ఆజా రే మేరే ప్యార్ కే (ఊంచే లోగ్), యే పంబతోం కే దాయెరే....., జీనే వాలే ఝూమ్ కే మస్తానా (వాస్నా), దగాబాజ్ హో (బర్మా రోడ్) ఇలా ఎన్నో గీతాలు వీరిద్దరి కాంబినేషన్ ఎంత గొప్పదో చాటిచెబుతాయి.

---



మదన్‌మోహన్

(210 పాటలు)

వృత్తిపరంగానే కాక వ్యక్తిగతంగా కూడా మదన్‌మోహన్‌తో లతకు అనుబంధం ఎక్కువ. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన హిట్ గీతాల సంఖ్య తక్కువే అయినా, మదన్‌భయ్యాగా ఆమె హృదయంలో మాత్రం ఇతనికున్న స్థానం ప్రత్యేకం. మాయి రీ మైఁ, కాశే కహూఁ (దస్తక్), ఆప్‌కే నజరోఁ మే సమ్‌ఝా (అన్ పఢ్) జో హమ్‌నే దాస్‌తాఁ (వో కౌన్ థీ?) నైనోం మేఁ బద్రా ఛాయే (మేరే సాయా) యూఁ హస్రతోం కే దాగ్ (అదాలత్)...లు మదన్, లతల కాంబినేషన్‌లో వచ్చిన కొన్ని మరుపురాని గీతాలు.

---



నౌషద్ (161 పాటలు)

రఫీ కాంబినేషన్‌లో నౌషద్ స్వరపరిచిన గీతాలతో పోల్చుకుంటే లతతో ఆయన పని చేసిన గీతాలకు వచ్చిన పేరు తక్కువే. అందుకు 50-60ల మధ్యకాలంలో దిలీప్‌కుమార్ చిత్రాలకు ఆయన ఎక్కువ పని చేయడం కూడా ఒక కారణం కావచ్చు. అయినప్పటికీ ఉఠాయే జా ఉన్కే సితమ్ (అందాజ్), మొహబ్బత్ కి ఝూఠీ కహానీ పే రోయేఁ (మొగల్-ఏ-అజమ్), యాద్‌మైఁ తేరీజాగ్‌జాగ్ కే హమ్ (మేరే మెహబూబ్) మోహే భూల్ గయే సావరియాఁ (బైజు బావ్రా ) తదితర గీతాల ద్వారా ఆమెలోని శాస్త్రీయ సంగీత నేపథ్యాన్ని వెలుగులోకి తీసుకురావటానికి ప్రయత్నించారాయన.

---



ఎస్.డి.బర్మన్

(182 పాటలు)

6 సం॥ల పాటు వీరిద్దరి మధ్య కలహం వచ్చి రావలసినన్ని పాటలు రాకపోయినా సచిన్ దేవ్ బర్మన్, లతా మంగేష్కర్‌ల కాంబినేషన్‌లో వచ్చిన గీతాలు అజరామరమైనవే. వీరి అనుబంధంలో మోసే ఛల్ కియే జాయే (గైడ్), తుమ్ ముఝ్‌సే దూర్ చలే జానా నా..; ఓ మేరే బైరాగి భవరేఁ (ఇష్క్ పర్ జోర్ నహీఁ) ఆజ్‌తో జుహిలీ రాత్‌మా (తలాష్) రంగీలా రే (ప్రేమ్‌పూజారి) హోఠోంఁ పే ఐసీ బాత్ (జ్యూవెల్ థీఫ్), బాగోఁ మేఁ బహార్ హై (ఆరాధన) మోరా గోరా అంగ్ లైలే (బందిని) రాత్ కా సమా (జిద్ది), చాంద్ ఫిర్ నిక్‌లా (పేయింగ్ గెస్ట్), ఠండి హవాయేఁ (నౌజవాన్) మైనే కహాఁ ఫూలోం సేఁ (మిలీ) ఇలా ఎన్నో మధురగీతాలు. ఓ సంగీత దర్శకుడు - గాయనిగా లత - ఎస్.డి.బర్మన్‌ల కాంబినేషన్‌లో వెలువడిన గీతాలు వాటికవే సాటి.



రోషన్ (146 పాటలు)

రోషన్ కంపోజింగ్స్‌ను లత ఎక్కువగా ఇష్టపడుతుండే వారు. అందుకే ఆమె స్వంత చిత్రం 'భైరవి' చిత్రానికి కంపోజర్‌గా అతన్ని ఎంపిక చేసారామె. (అది పూర్తి కాలేదు). పాంవ్ ఛూలేనే దో (తాజ్‌మహల్), బనే హో ఏక్ ఖాక్‌సే (అర్తి), సంసార్ సే భాగే ఫిర్తేహో (చిత్రలేఖ) రహేనా రహే హమ్...., రహా తే థే కభీ (మమత), కభీతో మిలేగీ (భీగీరాత్)లతో పాటు రత్నాలలాంటి పాటలు వీరి కాంబినేషన్‌లో రూపుదిద్దుకున్నవి ఎన్నో ఉన్నాయి.

---



హేమంత్‌కుమార్

(139 పాటలు)

లతతో పాడించకుండా ఈయన కంపోజ్ చేసిన చిత్రాలు బహుశా రెండే కావచ్చు. అవి ఒకటి జాగృతి, అయితే మరొకటి సాహిబ్ బీబీ ఔర్ గులామ్. కానీ లత కోసం ఆయన పనిచేస్తే మాత్రం వచ్చే గీతాలు అమృత గుళికలే. అలా రూపొందినవే సప్నే సుహానే... కహీఁ దీప్ జలే (బీస్ సాల్ బాద్) ఝూమ్ ఝూమ్ ఢల్‌తీ రాత్...., ఓ బేకరార్ దిల్ (కోహ్రా) మన్‌డోలే.. (నాగిన్) , ఎప్పటికీ మరువలేని ఐసే భీ బాతేఁ .. ధీరే ధీరే మచల్ (అనుపమ), ఖుషి భీ మిలి.. (బిన్ బాదల్ బర్సాత్) గీతాలు.

---



రాజేష్ రోషన్

( 132 ఫ్లస్)

లత గానంలో వెలువడిన యే రాతేఁ నయీ పురాని (జూలీ), దిల్ రుబా ఆ మేరి బాహో మే ఆ.. (యహీ హై జిందగి), పల్‌బర్‌మేఁ యహ్ క్యా హో గయా (స్వామి), ఆవో మనాయే జశ్న్ యే మొహబ్బత్..... (దూస్రా ఆద్మీ) తుమ్సే మిలా థా ప్యార్ (కర్మా-మీరా) ముఝే ఛూ రహీ హై (స్వయంవర్) అప్ కహేఁ ఔర్ హమ్ న ఆయేఁ ( దేశ్ పరదేశ్), తుఝ్ సంగ్ ప్రీత్ (కామ్‌చోర్) తడ్‌పత్ బీతీ (జాగ్ ఉఠా ఇన్‌సాన్) .... పాటలతో రాజేష్ కెరీర్ తొలినాళ్ళలో దేదీప్యమానంగా వెలిగిపోయింది. లత తనకు తాను పాడటం తగ్గించుకోవటం, రాజేష్ కొత్త సింగర్స్‌తో ప్రయోగాలు చేయటం వలన తర్వాత వీరి కాంబినేషన్‌లో వచ్చిన సాంగ్స్ తక్కువే. అయితే కరన్ - అర్జున్ చిత్రంలోని ఏక్ ముండా మేరే ఉమ్రదా.... పాట ద్వారా వీరిద్దరి కాంబినేషన్ ఎప్పటికీ విజయవంతమైనదేనని నిరూపించింది.

---



సలిల్‌చౌదరి

(128పాటలు)

సలిల్‌చౌదరి (128 పాటలు): పాటకు ఉన్న హద్దుల్ని కూడా దాటి అద్భుతమైన సంగీతాన్ని అందించిన సంగీత దర్శకుడు సలీల్ చౌదరి. లత కెరీర్‌లో అతి పెద్ద సవాళ్ళు అనుకోతగ్గ పాటల్ని స్వరపరచినది ఈయనే. లత కోసం ఆయన పాట కంపోజ్ చేస్తే మాత్రం అది ఎంతో టిపికల్‌గా ఉండేది. ఒక సాధారణ సింగర్ అయితే మాత్రం ఆ పాటకు గుక్కతిప్పుకోవడం కూడా కష్టమే. అయితే లత మాత్రం వాటిని అధిగమించి కలకాలం నిలిచిపోయేలా ఆ పాటల్ని రూపుదిద్దుకోవటానికి కృషి చేసారు. వాటిలో రాతోం కే సాయే (అన్నదాతా ), హరియాలా సావన్ ( దో బీఘా జమీన్), రోజ్ అకేలి ఆయే (మేరే అప్నే), రజనీగంధా ఫూల్ తుమ్హారే (రజనీగంధా) ప్యాస్ లియే మన్‌వా (మేరే భయ్యా), ఆజా రే పరదేశి .... బిఛువా ( మధుమతి) జాగో మోహన్ ప్యారే (జాగ్తేరహో), మిలాహై కిసికో జుమ్కా..., ఓ సజ్‌నా (పరఖ్) ముఖ్యమైనవి, ప్రసిద్ధమైనవి.

-పి.గిరి



# చుట్టాలున్నారు జాగ్రత్త!



-ఇలపావులూరి మురళీమోహనరావు

**"త్వరగా కానీ సుందూ. ట్రెయిన్‌కు టైమవుతున్నది. అసలే రిజర్వేషన్ కన్ఫర్మ్ కాలేదు" అరవయ్యోసారి అరిచాడు వెంకట్రావు.**

**"అబ్బబ్బ... వస్తున్నా ఉండండి. చీర, జాకెట్ కట్టుకుని మ్యాచింగ్ బొట్టు కోసం చూస్తే ఎక్కడా కనిపించలేదు. బొట్టుకు మ్యాచింగ్ కోసం మళ్ళీ చీర మార్చుకున్నాను. మళ్ళీ దానికి మ్యాచింగ్ గాజులు దొరకలేదు. మళ్ళీ ఆ గాజులు మ్యాచింగ్ కోసం చీర మార్చాల్సొచ్చింది. దీనికి మ్యాచింగ్ నెయిల్ పాలిష్ దొరకలేదు. అందుకని నెయిల్ పాలిష్‌కు మ్యాచింగ్ చీరకోసం అరగంట వెతకాల్సొచ్చింది. తీరా ఆ చీరకు మ్యాచింగ్ దొరకడానికి గంట... అన్నీ దొరికిన తరువాత మ్యాచింగ్ హెయిర్‌పిన్ దొరకలేదు... వెతుకుతున్నాను" బెడ్రూమ్‌లోంచి అరిచింది సుందరి.**

"ఓసి నీ మ్యాచింగ్ మంటబెట్టా.... నీ మ్యాచింగ్ పిచ్చి ముదిరి పోతున్నది. నీ వరస చూస్తుంటే నీ చీర మ్యాచింగ్ కలర్లో లేదని రైలు కూడా ఎక్కవో ఏవో? ముందుగానే చెబుతున్నాను. తీరా హోటల్లోకి వెళ్ళిన తరువాత నీ చీరకు మ్యాచింగ్ అయ్యే ఇడ్లీలు, దోసెలు కావాలని హోటలు వాణ్ణి అడిగేట్టున్నావు."

"చాల్లే ఆపండి కుళ్ళు మాటలు! వీధిన బోయే ఆడాళ్ళను కొరుక్కు తినేట్లు చూస్తారు. పెళ్ళాం అందంగా తయారైతే సహించలేరు".

"నేనెప్పుడైనా ఇలా మ్యాచింగ్ డ్రెస్‌లు వెయ్యడం చూశావా? దొరికిందేదో వేసుకోవాలి కాలం విలువ తెలిసిన వాళ్ళు".

"అందుకే మీ వంక అరవై ఏళ్ళ ముసలమ్మ కూడా కన్నెత్తి చూడదు."

"నీతో వాదించడం కంటే నోటికి తాళం వేసుకోవడం మంచిది. త్వరగా కానీ."

అనూహ్య, ప్రమోద్ ఆనందంతో గంతులేస్తున్నారు. రాకరాక వచ్చిన సెలవులు. పదిరోజుల పాటు అలాఅలా నాలుగైదు ప్రాంతాలు తిరగబోతుంటే ఎవరికైనా ఉత్సాహంగానే ఉంటుంది. వెంకట్రావుకు టూర్లంటే మహాసరదా. రెండు మూడు రోజులు సెలవులొస్తే చుట్టుపక్కలున్న ఏదో ఒక ప్రదేశానికి ప్రయాణం కడతాడు. కొత్తకొత్త ప్రదేశాల్లో తిరుగుతుంటే శరీరానికి, మనసుకు ఏదో తెలియని ఉత్తేజం కలుగుతుంది.

అరగంట తరువాత రెండు సూట్‌కేసులతో నలుగురూ బయటకొచ్చారు.

"పదండి ఏదన్నా ఆటో పట్టుకుందాం." అన్నది సుందరి.

"అంతశ్రమ అవసరం లేదు. మన బెంగుళూరు, మైసూరు, ఊటీల విహార యాత్ర నిర్విఘ్నంగా కొనసాగుతుందనడానికి సంకేతమా అన్నట్లు ఏదో ఆటో ఇటు వైపే వస్తున్నది. దూరంగా కనిపిస్తున్న ఆటోను చూసి అన్నాడు వెంకట్రావు."



"అదృష్టం అంటే అలా ఉంటుంది. అడుగు తీసి అడుగు వెయ్యక ముందే ఆటో. అన్నిచోట్లా బస్సులు, ఆటోలు ఈ విధంగా దొరికితే క్షణం వృథా కాకుండా కొడైకెనాల్, మధురై కూడా చూసి రావచ్చు" నవ్వింది సుందరి.

"అరె! ఆటో మనింటి వైపే వస్తున్నది. స్టాప్... స్టాప్...." ఉత్సాహంగా అరిచారు పిల్లలు.

"వాళ్ళను దింపేసిరా.... " స్లోగా నడుస్తున్న ఆటోను చూసి కేక వేశాడు వెంకట్రావు.

"వాళ్ళు దిగాల్సిన అడ్రసిదేనండి" ఆటోనాపి చెప్పాడు ఆటోవాలా.

ఆటోలోంచి రెండు భారీ శాల్తీలు దిగాయి. వారితోపాటు నాలుగు లెదర్ బ్యాగులు, రెండు బస్తాలు.

"ఆ.... మామయ్యా.... అత్తయ్యా.... మీరా? " ఆశ్చర్యంగా అన్నది సుందరి.

"అవునమ్మా... మేం వస్తున్నట్టు ఎలా తెలిసింది? అందరూ వాకిట్లో ఎదురు చూస్తున్నారు? బాగున్నారా?" కుశల ప్రశ్నలు

వేశాడు సుందరి మేనమామ సుగుణాకరం.

వెంకట్రావు ఉత్సాహం అంతా ఆవిరైపోయింది.

"ఆ(.... ఉన్నాం... మీరెలా వచ్చారు?" ముభావంగా అడిగాడు.

"ఇప్పుడే గోదావరికొచ్చాం. అన్నట్లు ఈ సూట్‌కేసులేంటి? మీరు ఎక్కడినుంచైనా ఇప్పుడే వస్తున్నారా?" అడిగింది సుందరి అత్తయ్య రాధమ్మ.

"లేదత్తయ్యా.... పిల్లలకు హాలిడేస్ గదా! అందుకని అలా ఊటీదాకా వెళ్దామని బయలుదేరాం" చెప్పింది సుందరి.

"అయ్యయ్యో.... అలాగా.... అయితే పానకంలో పుడకల్లా మధ్య మేము దేనికి? మీరు బయలుదేరండబ్బాయ్. మేమేదైనా చిన్నహోటల్లో.... " నసిగాడు సుగుణాకరం.

"ఛ.... భలేవాడివి మామయ్యా... మేనకోడలుండే ఊరికి వచ్చి హోటల్లో ఉంటారా.... మా అమ్మనాన్నలకు తెలిస్తే ఎంత బాధపడతారు! సెలవులు రెండు నెలలున్నాయి. తరువాత వెళ్తాంలే... రండి లోపలకు" తాళాలను తీసింది సుందరి.

"నీ మ్యాచింగ్ పిచ్చివల్లే ఇలా జరిగింది. లేకపోతే ఈ పాటికి రైల్లో ఉండే వాళ్ళం" సుందరి చెవిలో ఆక్రోశించాడు వెంకట్రావు మెల్లిగా.

"కానివ్వండి ఏం చేస్తాం? ఖర్మ.... స్టేషన్‌కు వెళ్ళి వచ్చేవారానికి టికెట్స్‌ను పోస్ట్‌పోన్ చేయించండి. వీళ్ళు రెండ్రోజుల్లో వెళ్తార్లే" మెల్లగా చెప్పింది సుందరి.

"ఏంటోనబ్బాయ్... విశాఖలో ఉంటున్నామనే కానీ బొత్తిగా పల్లెటూరి మనుషుల్లా హైదరాబాదు వెళ్ళడమంటే అమెరికా వెళ్ళినట్టుంటుంది మాకు. అదేదో ఫిల్మ్‌సిటీ... ఎన్టీయార్ గార్డెన్స్, అదేదో ఓషన్ పార్కూ లోషన్ పార్కూ..... అలాంటవేవో కట్టార్టగా ఈ మధ్య! వాటిని చూపించమని మీ పిన్ని ఒహటేపోరు! నాకసలు ఇలాంటి విష్టం ఉండవోయ్... కానీ మనదేశంలో చివరికి భార్య మాటేగదా నెగ్గాల్సింది! అందుకని ఇలా వచ్చాం" చెప్పాడు సుగుణాకరం భోజనాల దగ్గర.

వాళ్ళకవన్నీ చూడాలనుకున్నట్లు అర్థమైంది వెంకట్రావుకు.

"అవును మామయ్యా.... బ్రహ్మాండంగా ఉంటాయి. మేం చూపిస్తాంలే..." అన్నది సుందరి.

పేకాటలో నాలుగైదు జోకర్లు పడ్డవాడి ముఖంలో కనిపించే మెరుపు, వెలుగు తనవైపు బంధువులొస్తే స్త్రీలలో కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి.

మర్నాడు టాక్సీ మాట్లాడుకుని రామోజీ ఫిలిమ్‌సిటీ చూపించాడు వెంకట్రావు. ఖర్చంతా వెంకట్రావుదేనని వేరే చెప్పాలా?

ఎప్పుడైనా ఎక్కడైనా జేబులోంచి డబ్బు తీస్తాడని సుగుణాకరం వైపు చూసే వాడు వెంకట్రావు. ఎక్కడైనా కాఫీ తాగిన చోట, సోడాలు తాగిన చోట పది రూపాయలు బిల్లయితే వెయ్యి రూపాయల నోటు తీసేవాడు సుగుణాకరం. చిల్లర లేదని షాపు వాళ్ళు చెప్పగానే వెంకట్రావిచ్చేవాడు. ఫిల్మ్‌సిటీ దగ్గర ఎంట్రెన్స్ టికెట్స్ కొనే చోట మెల్లగా అందరికంటే చివర టాక్సీ దిగి మిగిలిన వారందరూ నడుస్తుంటే తాను మాత్రం ధోవతి సరి చేసుకుంటున్నట్లో, మరో విధంగానో నటిస్తూ ఆలస్యం చేసేవాడు. టికెట్లు తీసుకోండి అని సుందరి అమాయకంగా అంటే పళ్ళు కొరుక్కుంటూ టికెట్లు తీసుకునేవాడు వెంకట్రావు. వెంకట్రావు టికెట్లు తీసుకోగానే 'అయ్యయ్యో... నే వస్తున్నా.. తీసుకుంటా' అని దూరం నుంచి

కథను పోస్టు చేసిన నాల్గవ రోజు ఒక వివాహానికి అర్ధంకి వెళ్ళి క్షేమంగా చేరానని చెప్ప డానికి ఇంటికి ఫోనుచేశాను. "హాసం" నుంచి ఎవరో రాజా అనే ఆయన ఫోన్ చేశారు. ఫొటో, బయో డేటా పంప మన్నారు." చెప్పింది శ్రీమతి. నన్ను నేను గిల్లి చూచుకుని మనం కలియుగంలోనే ఉన్నామని రూఢి చేసుకున్నాను. పాతిక సంవత్సరాల సాహిత్య జీవితంలో కేవలం 80 కథలు రాసిన సామాన్య కథా రచయితకు సాక్షాత్తూ సంపాదకుని నుండి ఫోనా!?



కథకు పెద్దపీట వెయ్యడమంటే అదీ!

కథను గౌరవించడమంటే అదీ!!

తమకు కథ పంపించిన విషయం రచయిత మర్చిపోయిన తరువాత, ప్రచురించామనే విషయం కూడా తెల్పని, తమ పత్రికలో రచనను ప్రచురించ డమే రచయితకిచ్చే అవార్డని విర్రవీగే పత్రికల వారు నేర్చుకోవలసింది చాలా ఉందనిపిస్తోంది కదూ!

ఆది విష్ణు నాటికలూ, జంధ్యాల సంభాషణలు స్ఫూర్తిగా హాస్య కథలు రాయడం మొదలు పెట్టాను. రాష్ట్రంలోని ప్రముఖ దినవార, పక్ష మాస పత్రికలన్నీ నా కథలు ప్రచురించి ప్రోత్సహించాయి. ఆంధ్రభూమి 1997లో నిర్వహించిన కామెడీ కథల పోటీలో నా కథ 'చింగూర సిరిటటూవకాయ'కు ద్వితీయ బహుమతి లభించింది. కథా పోటీలలో నా కథలు చాలా ఎన్నికయ్యాయి. నేను ఏ హాస్య కథ వ్రాసినా నా ఇల్లాలు శారద ప్రమేయం ఎంతైనా ఉంటుంది. ఒక రకంగా నా ఇంట్లో ఆడ ఆదివిష్ణు!

సినారె, శేషేంద్ర, ఆచార్య తిరుమల, జంధ్యాల, ఇ.వి.వి., జనార్ధన మహర్షి వంటి ప్రసిద్ధుల సాంగత్యం మధురానుభూతి! తనికెళ్ళ భరణి నటన, డైలాగ్ డెలివరీ అంటే ప్రాణం!

కథ బాగుంటే చాలు, రచయితకు పెద్ద పేరుండాల్సిన అవసరం లేదని నిరూపించిన 'హాసం' సంపాదక వర్గానికి వేనవేల కృతజ్ఞతలు.


ఇలపావులూరి మురళీమోహనరావు
ప్లాట్ నెం. 109,
ఇంటి నెం. 11-12-53/2,
రోడ్ నెం.2,
శ్రీరామకృష్ణాపురం
హైదరాబాద్ - 500 035




అరిచేవాడు సుగుణాకరం. 'వెయ్యి నోటుకు చిల్లరనేనిస్తా' అందామనుకున్నాడు వెంకట్రావు. కానీ మొగమాటం వల్ల అనలేక పోయాడు.

పైగా టిఫిన్ చేస్తున్నప్పుడు "అబ్బా.... దోసె ఇరవై రూపాయలా? మా ఊళ్ళో మూడడుగుల దోసె మూడుంబావలా.... పార్కులోకి వెళ్ళడానికి నూటయాభై రూపాయలా.... ఆ డబ్బుతో మా ఊరే వెళ్ళచ్చునే... ఏంటీ... ఈ ఉయ్యాల ఊగడానికి నలభై రూపాయలా? హాయిగా ఆ డబ్బుతో ఒక చేంతాడు కొనుక్కుని చెట్టుకొమ్మకు కట్టుకుని జీవితాంతం ఉయ్యాల ఊగచ్చు" లాంటి నసమాటలు మాట్లాడుతుంటే పుండు మీద కొరివి కారం అద్దినట్లుంది వెంకట్రావుకు.

సాయంత్రం అలిసిసొలసి ఇంటికి చేరారందరూ. "ఎంతైనా నీ బంధుప్రేమ చాలాగొప్పదబ్బాయ్. నువ్వే గనుక లేకపోతే ఈ హైదరాబాదులో వెయ్యో వంతు కూడా చూడగలిగే వాళ్ళం కాదు." మెచ్చుకున్నాడు సుగుణాకరం.

మరో నాలుగురోజుల పాటు మరికొన్ని ప్రదేశాలతో పాటు యాదగిరిగుట్ట, వరంగల్లు కూడా చూపించాడు వెంకట్రావు.

స్వగ్రామానికి పయనమయ్యారు సుగుణాకరం, రాధమ్మ. "అప్పుడేనా? మరో నాలుగు రోజులుండండి" మాటవరసకన్నాడు వెంకట్రావు.

"నీ బంధు ప్రేమ చూస్తుంటే ముచ్చటేస్తుందబ్బాయ్. ఆడపిల్ల తరపు వాళ్ళం. నీ మాట కాదంటే నీకు కోపం వస్తుంది. విష్ణుమూర్తి ఆజ్ఞనైనా ధిక్కరించవచ్చుగానీ మీ మాట జవదాటకూడదు. ఏవే... విన్నావా... అబ్బాయి మాట!" భార్య వంక చూస్తూ అన్నాడు సుగుణాకరం.

"కానివ్వండి... వాళ్ళెప్పుడైనా మన ఊరికి వస్తారా పెడతారా? మళ్ళీ ఎప్పుడు చూస్తామో ఏమో! అలాగే కానివ్వండి" అన్నది రాధమ్మ.

వెంకట్రావు గుండెల్లో రాయి పడింది. తన నోటి దురుసుతనానికి తనను తానే నిందించుకున్నాడు.

వాకిట్లో ఆటో ఆగిన శబ్దం వినిపించింది.

"డాడీ... పెద్దనాన్న, పెద్దమ్మ, అన్నయ్య, అక్కయ్య వచ్చారు" సంతోషంగా చెప్పాడు ప్రమోద్.

వెంకట్రావు, సుందరి బయటకెళ్ళారు. కామేశం, సుజాత, ముగ్గురు పిల్లలు సామాన్లతో లోపలికొస్తున్నారు.

వెంకట్రావు ముఖంలో ఆనందం! సుందరి ముఖంలో పులుముకున్న నవ్వు!

"సెలవులిచ్చారు గదరా! బాబాయ్ గారింటికి వెళ్దామని పిల్లలు ఒకటే గోల! ఊళ్ళో వ్యవసాయం చేసుకుని బతికే వాళ్ళం. మాకీ పట్టణం గాలి, దోమలు... ఇరుకుగదులు... అసలు పడవు. పిల్లలకు అన్నీ చూడాలని..." అన్నాడు కామేశం.

"పోనీలే అన్నయ్యా.... కనీసం పిల్లల కోసమైనా వచ్చావు. పిల్లలకు నేను అన్నీ చూపిస్తా. మీరు స్నానాలు చెయ్యండి" అన్నాడు వెంకట్రావు.

కాఫీలు, టిఫిన్లు అయ్యాయి.

"బాబాయ్! మాకు ఫిల్ముసిటీ.... ఎస్సెల్ వరల్డ్ చూపించవా?" గారంగా అడిగారు పిల్లలు.

"అరె! మొన్ననే చూశాం రా.... టాంక్‌బండ్ చూపిస్తాలే" అన్నాడు వెంకట్రావు.

"ఎప్పుడ్రా?" ప్రశ్నించాడు కామేశం.

"నిన్నగాక మొన్నే.... పిన్ని బాబాయిలను తీసికెళ్ళి చూపించా" అన్నాడు వెంకట్రావు.

"ఓహో! వాళ్ళకు చూపించినవి మాకు చూపించగూడదా! టిక్కెట్లు కొని వెళ్ళేవి వాళ్ళకు, కాణీ ఖర్చులేకుండా జులాయిలంతా తిరిగేవి మాకా! అంతేలేరా... ఎంతైనా ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులు" నిష్టూరంగా అన్నాడు కామేశం.

"అబ్బెబ్బె.... నా ఉద్దేశ్యం అది కాదురా..." సర్దిచెప్పబోయాడు వెంకట్రావు.

"సరే పోనీయండి. ఇంత చిన్న విషయానికి తమ్ముడితో మాట తూలడం దేనికి? మన పిల్లలు ఒట్టి దరిద్రులు. కోరుకున్నవి చూసే గీత వాళ్ళముఖాన లేదు" అన్నది సుజాత.

"భలేదానివి వదినా... అంతంత మాట లెందుకు? అలాగే వాళ్ళడిగినవే చూద్దాం." వదిన కోపాన్ని చూసి నవ్వుతూ అన్నాడు వెంకట్రావు.

వెంకట్రావుకు నాలుగైదు సంవత్సరాల వయసు నుంచీ, తల్లి ఉన్నా, అన్నం పెట్టడం, బట్టలు తొడగడం, స్కూలుకు పంపడం అన్నీ సుజాతే చేసేది. తల్లిదండ్రులకన్నా వదినె దగ్గరే చనువెక్కువ వెంకట్రావుకు.

"సుందూ.... రేపు మనం రామోజీ ఫిల్మ్‌సిటీ, ఎల్లుండి ఓషన్ పార్కు చూడబోతున్నాం" అని డిక్లేర్ చేశాడు.

కామేశం, సుజాతల ముఖాలు ప్రసన్న మయ్యాయి.

"అయ్యో... రేపు బాసర వెళ్దామనుకున్నామే..." బాధగా మూలిగాడు సుగుణాకరం.

సుందరికి కూడా మళ్ళీ అవే చూడటం ఇష్టం లేదు. ఇంతకు ముందైన ఖర్చుతోనే దిమ్మ తిరిగింది ఆమెకు.

"పోనీ ఒక పని చేద్దామండీ... రేపు మనమందరం బాసర వెళ్దాం.... అక్కయ్యగారు కూడా చూడలేదు కదా... ఎల్లుండి మామయ్యను అత్తయ్యను రైలెక్కించి అందరం ఫిల్మ్‌సిటీకి వెళ్దాం. ఏమంటారు?" అన్నది.

"చూశావటయ్యా మరిదీ, తోటికోడలి వాక్చాతుర్యం! మేనమామ కోరిక ముందుగా తీర్చాలని ఎంత తాపత్రయంగా ఉందో!" వ్యంగ్యంగా అన్నది సుజాత.

"అంతేలేవే. మన బంగారం మంచిదైతే కంసాలిని అనుకోవడం దేనికి? ఎంతైనా ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులు" నసిగాడు కామేశం.

"అబ్బే... అదికాదురా...." చెప్పబోయాడు వెంకట్రావు.

****

ఆ రాత్రి పడకగదిలో....

"మీరు మా వాళ్ళను ఇంత అవమానిస్తారనుకోలేదు. వెళ్ళిపోతున్న వారిని ఉండమన్నారు. తీరా మీ మాట మీద గౌరవంతో ఉండి పోతే ఇలా చేశారు." కోపంగా అన్నది సుందరి.

"ఇందులో అవమానం ఏముంది? పిల్లలు ముచ్చట పడ్డారు కదాని..."

"వృద్ధులు కూడా పిల్లల్లాంటి వారని మీకు తెలీదా?"

"పిల్లలనైతే నాలుగుతన్ని సర్ది చెప్పవచ్చు. వృద్ధులను అలా తన్నలేం గదా."

"అంటే... మా వాళ్ళను అలా తన్ని తగలెయ్యాలనుందన్నమాట! అంతేలెండి... ఎంతైనా మీరు మీరు ఒకటి... మేమేగా పరాయి వాళ్ళం" కళ్ళకుండలకు చిల్లులు పెట్టింది సుందరి.

"అబ్బబ్బ... గోరంతలు కొండంతలు చెయ్యమాకు. ఆలి తరపు వారు ఆత్మబంధువు లని వాళ్ళు, మేమే పరాయివాళ్ళమని నువ్వు కల్వంలో తాంబూలాన్ని దంచినట్లు దంచుతున్నారు"

"అయితే మనం రేపు బాసర వెళ్తున్నాం".

"మా అన్నయ్య బాధ పడతాడు."

"వెళ్ళకపోతే మా మామయ్య బాధపడతాడు. వయసులో పెద్దవాడు."

ఇద్దరూ బాధపడటంతోనే రాత్రంతా గడిచింది.

****

"ఒక పనిచేద్దాం సుందూ... మీ మామయ్యను, అత్తయ్యను తీసుకుని బాసర వెళ్ళు. నేను అన్నయ్య వదినె పిల్లలను తీసుకెళ్ళి సిటీ చూపిస్తాను." అన్నాడు వెంకట్రావు పరిష్కారంగా.

సుగుణాకరం గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. సుందరితో వెళ్తే ఖర్చంతా తామే భరించాలి. ఆడపిల్ల చేత ఖర్చు పెట్టించడం బాగుండదు. ఈ నాలుగురోజుల నుంచి నయా పైసా బయటకు తియ్యకుండా అన్నీ తిరిగారు.

"వద్దులే అబ్బాయ్. నాకు నువ్వొహటి మీ

అన్నయ్యేంపాటికాదు. ఇద్దరూ నా కొడుకుల్లాంటి వాళ్ళే. ఈ రోజుకు మేము విశ్రాంతి తీసుకుంటాం. నువ్వు అన్నయ్య వదినె పిల్లలను తీసుకుని వెళ్ళిరా... ఎంతైనా వాళ్ళు మాకంటే నీకు బాగా కావల్సిన వాళ్ళు కదా" చివరి వాక్యాన్ని నొక్కి పలికాడు సుగుణాకరం.

"ఆహా... ఏం చెప్పారు మామయ్యగారూ.... మీరు మాత్రం దంపతులిద్దరినీ తీసుకుని తిరగాలి.

మేము మాత్రం మరిది నొక్కడినే తీసుకెళ్ళాలి" వెటకారంగా అన్నది సుజాత.

"అబ్బే... అదికాదు వదినా.... మేము ఊరంతా చాలాసార్లు తిరిగాం. వాళ్ళకు ఇంట్లో తోడుగా ఉంటుందిలే" అన్నాడు వెంకట్రావు.

"అంటే... తన బంధువుల ముచ్చట తీర్చలేదని నీ భార్య మాతో రాదన్నమాట." కోపంగా అన్నది సుజాత.

"అంతేలేవే... ఎంతైనా ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులు." గొణిగాడు కామేశం.

సుగుణాకరానికి కోపం వచ్చింది.

"ఏంటయ్యా చీటికి మాటికి ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులు అని దెప్పుతావు. మీ తమ్ముడు మాకేదో సన్మానాలు చేసి శాలువాలు కప్పినట్లు!" అన్నాడు.

"ఆ.... ఆఁ... ఎంతకావరం! మేనకోడలి సొంతబావగారితో ఇలాగేనా మాట్లాడేది! నీ పెళ్ళాం తరపు వాళ్ళు నీ అన్నయ్యను అంతలేసి మాటలంటుంటే చూస్తు ఊర్కుంటావేమయ్యా వెంకయ్యా. ఈ చేతుల్తో నీకు ఉగ్గుపాలు పట్టాను. ఈ చేతుల్తో నీ బట్టలుతికాను. ఈ చేతుల్తో నీ నోట్లో అన్నం కుక్కాను. ఈ చేతుల్తో.... ఈ చేతుల్తో ....." అంది సుజాత.

"ఏవమ్మోవ్! ఈ చేతుల్తో ఈ చేతుల్తో అని అష్టవంకర్లు తిప్పుతున్నావు. మీ అమ్మ కూడా ఆ చేతుల్తోనే నీకవన్నీ చేసింది. చేతుల్తో కాక కాళ్ళతో ఎవరూ ఆ పని చెయ్యరు. ఎంతైనా పల్లెటూరి మనుషులు... పల్లెటూరి భాష!" ముఖాన్ని అసహ్యంగా పెట్టి అన్నది రాధమ్మ.

సుందరి, వెంకట్రావులకు వణుకుతో వళ్ళంతా చెమటలు పట్టాయి.

అరగంటసేపు వాగ్యుద్ధం నడిచింది.

"ఇంత జరిగాక ఇక ఒప్పుకునే పనేలేదు. మనం ఊళ్ళోనే తిరగాలి" స్థిరంగా అన్నది సుజాత.

"మేమేం అంత పనికి మాలిన వాళ్ళం కాదు. ఈ రోజు బాసర వెళ్ళాల్సిందే" అన్నది రాధమ్మ.

"వదినా... నా మాట విను."

"ఏందయ్యా... నీ మాట వినేది... పెళ్ళాం మాట జవదాటలేని వాడివి."

"అత్తయ్యా నా మాట విను. ఎక్కడికి వెళ్తే ఏం బోయింది? బాసర రేపు చూద్దాం."

"అంతేలేమ్మా... మీ ఆయనకు వాళ్ళను ఊళ్ళోనే తిప్పాలని ఉన్నట్లుంది. ఎంతైనా మేమేగా పరాయివాళ్ళం."

"అన్నయ్యా... బాసర మీరు కూడా చూళ్ళేదు కదా. పోనీ బాసర వెళ్ళి...."

"చాల్లేరా చెప్పొచ్చావ్.... పెళ్ళాం తరపు వాళ్ళ ముందు మమ్మల్ని అవమానించావు. వాళ్ళ మైకంలో పడి రక్త సంబంధాన్ని తృణీకరించావు. ఎంతైనా ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులని నిరూపించావు."

"ఎందుకొచ్చిన గోలలెండి. ఇంత చిన్న విషయానికి తమ్ముడితో తగాదా ఎందుకులెండి. ఎంతైనా అనుబంధాలు శాశ్వతాలు. మా తమ్ముడింటికి వెళ్దాం పదండి. వాడైతే నెత్తిన పెట్టుకుని మరీ అన్నీ చూపిస్తాడు." అన్నది సుజాత.

"అంతేలేవే... ఎంతైనా ఆలి తరపు బంధువులు ఆత్మబంధువులు.. పద." లేచాడు కామేశం.

పిల్లలను తీసుకుని వెళ్ళిపోయారు వాళ్ళు. వెంకట్రావు, సుందరి చాలా బాధపడ్డారు.

"బాబాయ్‌గారూ.... చూశారుగా మా వాళ్ళ వరస. మీరు వెంటనే టాక్సీస్టాండుకు వెళ్ళి డబ్బు కట్టేసి టాక్సీ మాట్లాడుకుని రండి. మనం బాసర వెళ్ళొద్దాం" అన్నాడు వెంకట్రావు.

డబ్బు మాటెత్తగానే గుండెలు జారిపోయాయి సుగుణాకరానికి.

"హ... హి... హ..... అహ... హ.... వద్దులేవోయ్.... మాకోసం ఎందుకు మీకు శ్రమ... మరోసారి చూద్దాంలే... మనసు బాగా లేదు. మేంకూడా వెళ్ళొస్తాం. ఊరిమీద గాలి మళ్ళింది." భార్యకు సైగ చేశాడు.

పది నిముషాల్లో ఇద్దరూ వెళ్ళిపోయారు. కాసేపు తలపట్టుకున్నారు భార్యాభర్తలిద్దరూ.

"పోతే పోనీ... ఇటువంటి బంధువులను చూస్తే భయం వేస్తోంది. సిటీల్లో పొద్దస్తమానం రెక్కలు ముక్కలు చేసుకుని చాలీ చాలకుండా బతుకుతుంటారు మధ్యతరగతి జీవులు. అటువంటివారికి సాయం చేయకపోతే మానె ఇలా ఇళ్ళమీద పడి అవి చూపించు ఇవి చూపించు. ఆఫీసుకు సెలవులు పెట్టు అని పీడిస్తే ఎలా? తమ కోరికలు తీరిస్తే మంచి వాళ్ళు లేకపోతే చెడ్డవాళ్ళు అని ముద్రలు వేసే బంధు జనానికి నమస్కారం పెడదాం.

ఎవరూ ఎవరికి సాయం చెయ్యరు. ఇటువంటి వారిని మనం లక్ష్యపెట్టద్దు. వారి గురించి మర్చిపో." చెప్పాడు వెంకట్రావు.

"ఏదో నాలుగు పూటలు అన్నం పెట్టగలమేమో కానీ ఇలా గౌరిగించే కార్యక్రమాలు పెడితే ఎలా భరించగలం? మొహమాటానికి పోతే అదేదో అయిందని... మా వాళ్ళేమైనా బాధ కలిగిస్తే క్షమించండి" వెంకట్రావును హత్తుకుంది సుందరి.




బొమ్మలు: ఎమ్మెస్ రామకృష్ణ

# వీణని నిలబెట్టీ - వర్షాన్ని నిలేసిన

# వీణ వెంకట రమణదాసు!!



**ఏడు తరాల నుంచీ వాళ్ళది సంగీత కుటుంబం!**

**వాళ్ళింట్లో సంగీత సరస్వతి బాసింపీట వేసుక్కూర్చుంది!!**

**అంచేతే ఆ యింట్లో అడుగుపెడ్తే చాలు తంబురనాదం వినిపిస్తుంది!!**

**ఆ పెరట్లో బట్టలారేసుకునే దండాలు కూడా గాలి వీచినప్పుడల్లా ఊగుతూ నాదం పుట్టిస్తాయి!!**

**వాళ్ల వేళ్ళు వీణమీటడానికే మొలిచినట్లుంటాయ్!**

**తెల్లారగట్ట... ముత్తాతగారు వీణమీద భూపాలం వాయిస్తుండగా అంతాలేస్తారు.... మళ్ళీ రాత్రి మునిమనవడు శ్రీరాగం వాయించాకే నిద్దర్లు....**

**అన్నప్రాశనప్పుడు... ఆ ఇంట్లో పుట్టిన ఏ పిల్లాడయినా పాకుతూ వెళ్ళి వీణముట్టుకోవాల్సిందే!....**

**వీణాపాణి... వాళ్ళతల్లి.... చెల్లి..... వాళ్ళ సర్వస్వమునూ.**

**అంచేత... ఆ యింటి పేరు ఎప్పుడో కరిగిపోయింది!**

**వీణ.... ఊపిరైపోయింది!!**

**వీణ.... బతుకైపోయింది!!**

**వీణ.... ఇంటిపేరైపోయింది!!**

వీణ పెదగురువాచార్యుల వారు విజయనగరం ఆస్థాన విద్వాంసులు

రాజావారిచేత ఎన్నో సన్మానాలు అవీ పొందినవారు..... అన్నింటికన్నా అద్భుతమైన విషయమేమిటంటే... ఆయన శ్రీ త్యాగరాజ స్వామి వారి సమకాలీకులు....

అప్పటి వరకు విజయనగరం ప్రాంతంలో వాసా సాంబయ్యగారి రచనలో శిష్టా సర్వశాస్త్రిగారి రచనలే ప్రచారంలో ఉండేవి. అలాంటిది త్యాగరాజస్వామి వారి కీర్తనలని ఆ ప్రాంతాలకి తెలియజేసిన ఘనత పెదగురురావాచార్యుల వారిదే!...

ఆ కాలంలో ఈయన విద్వత్తుకి... విజయనగరం మహారాజా శ్రీ నారాయణ గజపతులు వారు వీరికి ఛత్ర చామరాలిచ్చి గౌరవించారు!

పెదగురువాచార్యుల దత్తపుత్రుడు సీతారామప్పగారి కుమారులు చినగురువాచార్యులైతే... ఆయన కొడుకు మన కథా నాయకుడు వీణ వెంకట రమణదాసు!!

1864 మాఘ బహుళ అష్టమి నాడు విజయనగరంలో పుట్టాడు!!

సరే ఉగ్గుతో వీణ

పాలతో వీణ.... పాడేప్పుడు వీణ తప్పటడుగులప్పుడు వీణ....

తొలి పలుకు వీణ.... తొలి పాట వీణ.... తొలిమీటు వీణ

తన శరీరం వీణ....

నరాలు తీగలు...

అయితే అత్యంత విచిత్రమైన విషయం ఏమిటంటే ఈయనకి వీణ నేర్పిన గురువుగారు సాక్షాత్తు విజయనగరాధీశుడు ఆనందగజపతి మహారాజా!

ఒకప్పుడు... వీళ్ళ తాతగారు వాళ్ళ తాతగారికి గురుతుల్యులు

ఇప్పుడు ... వారు వీరికి గురువులు.

బండ్లు - ఓడలు... ఓడలు... వీణలు...

రాజావారు ... దాసుగారు సమవయస్కులు...

ఇద్దరూ అన్నదమ్ముల్లా ఉండేవారు...

ఆయన మహారాజు

ఈయన సంగీత చక్రవర్తి.

ఆయనది కరవాలం!

ఈయనది స్వరసంచారం

ఆయనది ధనుష్టంకారం...

ఈయనది వీణా ఝుంకారం....

ఆయన రాజచంద్రుడు ... ఈయన సంగీత మార్తాండుడు!!

ఆయన గజపతి - ఈయన సంగీత జగపతి!

ఇద్దరిదీ ఎంత స్నేహం అంటే

ఆయన గజపతి - ఈయన సంగీత జగపతి!

రాజావారి సింహాసనం ప్రక్కనే స్థానం కల్పించీ దాసుగారికీ ఆసనం వేయించిన రసజ్ఞుడు.

అలాగే.... తనతోబాటు ఎక్కడికైనా వెళ్ళినప్పుడు తానేరకం దుస్తులు ధరించేవారో అవే ఆయనచేత కూడా తొడిగించి....

రెండు గుర్రాలు పూన్చిన గుర్ర బ్బగ్గీలు... వెనకాల వీణల్ని... పక్కనే దాసుగార్నీ వెంట తీసుకెళ్ళే వారు....

దాసుగారితో ఉన్నంత సేపూ రాచవ్యవహారాలు మానేసి సంగీత చర్చే!!

దాసుగారు వీణవాయిస్తుంటే...

రాజా వారు ఆనందంగా తాళం వేస్తూ ఉండేవారు!!

వీణ వెంకట రమణ దాసుగారు కూడా... రాజాగారిచ్చిన చనువుని సద్వినియోగపర్చుకునీ... నిరంతరం సాధన చేసేవారు....

ప్రతిరోజు పదిగంటలు పాటు త్రిస్థానాలలో - నాలుగు కాలాల్లో సాధన చేసేవారు!

1. అతి - అతి చౌకకాలం
2. అతి చౌకకాలం
3. చౌకం
4. మధ్యమకాలం
5. ధృతకాలం
6. అతిధృత కాలం...

వీటినే షట్కాలంటారు... ప్రసిద్ధ వైణికురాలు వీణ ధనమ్మాళ్ ఈయన సాధన చూసి 'రాక్షస సాధకుడు' అని పిల్చేదట.... ఆకాలంలో అతి వేగంగా తానం వాయించేవారు మరిలేరు!!

వీణని నిలబెట్టి వాయించడం ఈయన ప్రత్యేకత!!

(అసలు ఆరంభంలో విద్వాంసులంతా వీణని నిలబెట్టే వాయించేవారనీ సుకుమారులైన స్త్రీలు వీణావాదన మొదలెట్టాక - వీణని

పడుకోబెట్టి వాయించడం మొదలైందనీ ఎక్కడో చదివా - ఈ సంగతి పండితులు తేల్చాలి!)

ఆంధ్రదేశమంతా వెంకటరమణగారి వీణ మారు మ్రోగిపోయింది!!

ఇక ఆ తంత్రీ స్వనాలు... చెన్నపట్టణం గూడా వ్యాపించాయ్!!

మద్రాసులో... వీణాగానసభ!!

విద్వాంసులు... రసజ్ఞులు... అభిమానులు... ఓ... కిటకిటలాడిపోతోంది హాలు....!

వేదికమీద సంగీత సరస్వతి మల్లే వీణ వెంకటరమణదాసు.

అన్నట్టు పక్కవాయిద్యాలు కూడాలేవు...!

సరిగ్గా.... దాసుగారు.... వీణమీటారో లేదో

బైట ఉరుములు... మెరుపులు...

కుంభవృష్టి మొదలైంది!!

ఆ హోరు ముందు... వీణేం వినిపిస్తుంది!?

నిరుత్సాహపడ్డారు నిర్వాహకులు...

నీరుకారిపోయారు... శ్రోతలు...

'తలువులు వేసీ కార్యక్రమం జరిపించేద్దాం...' అన్న నిర్ణయానికొచ్చారంతా. తలుపులు వేసేస్తున్నారు.

రమణదాసు గారు... "మరేం ఫర్వాలేదు... తలుపులు బార్లా తెరవండి" అన్నారు.



తనికెళ్ళ భరణి

నిర్వాహకులు ఆశ్చర్యపోయారు!!

ప్రేక్షకులు అయోమయంలో పడ్డారు...

వీణ వెంటకరమణదాసుగారు.... ఒక్కసారి 'వరవీణా మృదుపాణికి'

మనస్సులోనే పాదాభివందనం చేసీ

వీణ మీటడం ప్రారంభించారు!

అటు హోరు!

ఇటు జోరు!

అటు వర్షం!

ఇటు హర్షం...!

అటు ఉరుములు మెరుపులు... ఇటు వీణా నిక్వణాలు

అటు వాన...

ఇటు వీణ...

అటు వడగళ్ళు.... ఇటు చప్పట్లు....

వాన అలిసిపోయి వెలిసి పోయింది!!

వీణ మెరిసిపోయి మురిసిపోయింది. మూర్ఛనలు పోయింది!

వీణానాదం ముందు వాన శబ్దం వినపళ్ళేదు!!

ఇదెలా సాధ్యం! వర్షఘోషను అధిగమించే ధ్వని వీణలోంచి ఎలా వచ్చింది!?

బ్రహ్మ రహస్యం ఏమిటంటే... వీణతుంబల్లో గడియారం స్ప్రింగుల్లాంటి స్ప్రింగులు బిగించేవారట దాసుగారు... ఆ తుంబను ఒక్కసారి కొట్టీ వీణకు శ్రుతిపెట్టేవారట.... ఈ సంగతిని ప్రొఫెసర్ సాంబమూర్తిగారు ఓ వ్యాసంలో రాశారు!!

వీణతుంబల్లో ఆ స్ప్రింగులుండడం వల్లే సముద్ర గంభీర ధ్వనిలాగ ఇతర శబ్దాలకు అవకాశం ఇవ్వకుండా వీణే వినిపించేది.

ఈ నేర్పును చూసి.... మైసూరు మహరాజా ఆస్థాన పండితుడైన 'అబ్రహాం పండితార్' అనే ఆయన - దాసుగారి వీణ మీద వెండి సరస్వతీ దేవి పతకాన్ని తాపడం చేయించి గౌరవించారు.

దాసుగారు - వీణా రహస్య ప్రకాశిక అనే వీణ సంబంధమైన గ్రంథ మొకటి రాశారు. కానీ ప్రస్తుతం అది అలభ్యం. ఆయన వాయించిన వీణలని చూడాలనుకుంటే రెండు వీణలు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీలో ఉన్నాయ్! చూసి... మనసారా నమస్కారం చేసుకోవచ్చు!!

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

భిక్షమెత్తి బతికి అక్షరభిక్ష పెట్టిన 'సారంగపాణి' అన్న మీ రచన 'హాసం' 1-15 మార్చి సంచికలో విశేషంగా ఆకట్టుకొంది. మహానుభావుల గురించి తెలుసుకోవడంలో మీకు ఇబ్బంది లేకపోవచ్చు. కాని అలా తెలిసిన వారి విశేషాలను ఏమీ తెలియని సాధారణులకు మీదే అనిపించే శైలిలో వివరించడంలోనే మీ నేర్పు వున్నది. ఈ పక్షపు అతిథి సారంగపాణి గురించి మీరు వివరించిన రెండు సన్నివేశాలు (రాజు గారు పిలిపించినప్పుడు రామని చెప్పి రాణిగారు పిలిపించినప్పుడు గుండెకు పట్టేట్లు వేరెవరు చెప్పలేరు. (పొగడ్తకాదు) కలికాలంలో కళాకారుడు మరోసారి దరిద్రుడయ్యాడు అన్నవి అండర్‌లైన్ చేసుకోదగ్గవి. మరోసారి అనడంలోనే కళాకారుడు అనే వాడు అసలు మొదలే దరిద్రుడు అనే అంతర్‌భావన చెప్పకనే చెపుతుంది. ఇక ఆయన పదాలకు పోలికగా మీరు వివరించిన శృంగార, సామాజిక స్పృహ, వైరాగ్యం రెఫరెన్స్ దేనికవే అన్నట్లున్నాయి. పోతే సారంగపాణి గారి పదాలు (బొబ్బిలి ప్రాంతంలో బహుళ ప్రచారమంటున్నారు కాబట్టి) రుచి చూపిస్తే బాగుండేది. మీరన్నట్లుగా అసలు 'సారంగ' అన్న నామంలోనే దోషమున్నదేమో! ఇక ముందు కూడా ఇలాగే దేశం మరిచిపోయిన, పోతున్న జాతిరత్నాలను వెలికితీసి పరిచయం చేసే మీ రచనలను కొనసాగించాలని ఆశిస్తూ విన్నవిస్తూ.

-జి.ప్రభాకర్‌రావు,
మసాబ్‌టాంక్, హైదరాబాద్

భిక్షమెత్తినా, తెలుగుజాతికి అక్షరభిక్షపెట్టి సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన సారంగపాణిగారు గొప్ప కళాకారుడు, మహానుభావుడు. మీరు చదివి స్పందించిన అనేక విషయాలను 'హాసం'వంటి ఓ మంచి పత్రిక ద్వారా మమ్మల్ని చదివింపజేస్తున్నందుకు కృతజ్ఞతలు. సారంగపాణి వంటి కళాకారుడు గురించి తెలియజేసినందుకు శతకోటి నమస్కారాలు. ఇంకా మీరెన్నో విషయాలను, కళాకారులను గురించి 'హాసం' పత్రికలో మీ అభిమాన పాఠకులకు అందిస్తారని ఆశిస్తూ.....

-ఎం.మాల్యాద్రి
కావలి, నెల్లూరు జిల్లా.




నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత,
జర్నలిస్టు, నటుడు
**రావికొండలరావు**
రాసిన వ్యాసమిది



# 'అంజిగాడు' గా పేరు మోసిన బాల్డ్‌కృష్ణ







వల్లూరి బాలకృష్ణ "అంజిగాడు"గా పేరుబడ్డాడు. 'పాతాళభైరవి' సినిమాలో కొత్త కమేడియన్లు ఇద్దరు. ఈ బాలకృష్ణ పద్మనాభం. "కొత్తవాళ్ళయినా పాత వాళ్ళకంటె గొప్పగా చేసి నవ్వించారు" అన్న పేరు తెచ్చుకున్నారు. 'అంజి' - బాలకృష్ణ ధరించిన పాత్రపేరు. ఇతగాడు హీరోకి జతగాడు. 'పాతాళభైరవి'లో హీరోతోపాటు ఇతగాడుకూడా కథ నడిపించాడు.

ఐతే, బాలకృష్ణ జనానికి కొత్తగా కనిపించినా సినిమాలకి మాత్రం అతను కొత్తకాడు. ఎప్పుడో 1937లోనే - వేషం వేసేశాడు. 'విజయదశమి' అని ఒక సినిమా. అప్పట్లో కొన్ని సినిమాలకి రెండు, మూడు పేర్లున్నట్టుగానే ఈ సినిమాకీ రెండు పేర్లు. 'విజయదశమి' లేక 'కీచక వధ'. మాధవపెద్ది వెంకట్రామయ్య, స్థానం నరసింహారావు వంటి రంగస్థల నటులు ఈ చిత్రంలో నటించారు. ద్రౌపది వేషం సురభికమలాబాయి.



"వగలోయ్ వగలు"

"ఇవి నాకు గుర్తున్నాయి గాని, నేను వేసిన వేషానికి పేరేమిటో గుర్తులేదు, ఏదో వేషం వెయ్యమన్నారు - వేశాను" అని చెప్పిన బాలకృష్ణ, చదువు సంధ్యలకి గుడ్‌బై కొట్టి, నాటకాలకి గుడ్‌మార్నింగ్ కొట్టి, ఓ ఫైన్ మార్నింగ్ కలకత్తా పారిపోయాడు. ఎవరెవర్నోపట్టుకొని, అక్కడా అక్కడా వేషాలు వేశాడు. "ఒకటి, రెండు హిందీ సినిమాల్లో కూడా వేసేశాను - ఆ దెబ్బతో" అని చెప్పేవాడు అతను. పనిలో పని - హిందీ మాట్లాడ్డం, బెంగాలి అర్థం చేసుకోవడం వచ్చేశాయిట!

బాలకృష్ణ దగ్గర ఇంకో ప్రతిభ వుండేది. ఆ పరభాషల మాట ఎలా వున్నా, ఆంధ్రాలోని జిల్లాల భాషలన్నీ ఆయా యాసల్లో స్పష్టంగా మాట్లాడేవాడు. ఏ ప్రాంతపు భాష, యాసా మాట్లాడినా ఆ ప్రాంతపు మనిషే అనిపించే వాడు. అందులో గట్టివాడు. ఒట్టి ప్రాంతీయంగా మాట్లాడ్డమే కాదు - మాండలికాలతో సహా మాట్లాడేవాడు. "ఎలా వచ్చాయి!?'' అని అడిగితే - నేను నాటకాలాడుతూ వూళ్ళన్నీ తిరిగాను. తెలంగాణా, నెల్లూరు, ఉభయ గోదావరి,

శ్రీకాకుళం జిల్లాలన్నీ తిరిగిన వాణ్ణి గనక, ఊళ్ళో దిగగానే, అక్కడి వాడిలాగానే మాట్లాడేవాణ్ణి. ఓసారి శ్రీకాకుళంలోని చిన్న హోటల్లో భోంచేస్తున్నాను. "బాబూ! అయితే తమరిది ఈ ప్రాంతమేనేటి?'' అని అడిగాడు హోటలు పెద్ద. "మరేటనుకున్నావు?'' అన్నాను. "యా వూరు?'' అన్నాడు అతను. ఏ ఊరు పేరు చెప్పాలి? నాకు తెలీదే. "మీదేవూరు?'' అని అడిగాను. "దూసి దగ్గర బెలమాం' అన్నాడు. వెంటనే నేను "అదేవూరే నాదీనూ'' అన్నాను ఠపీమని. "మావూరా - ఎక్కడ?'' అని అతను ఇంకో ప్రశ్నవేసేసరికి, ఇంక నా పప్పు ఉడకదని, "చల్లపోసీ బాబూ, నా నెల్లాలి'' అని గబగబ బయటపడ్డాను''. అని ఇలాంటి చెబుతూ వుండేవాడు.

బాలకృష్ణ మిమిక్రీ చేసేవాడు. ఓసారి చక్రపాణిగారి ముందే, ఆయన్ని అనుకరించాట్ట: "బాగా చెప్పావు. ఫోన్లోమాత్రం నా గొంతుతో మాట్లాడక. ఇద్దరికీ డేంజరు" అన్నారట ఆయన.

కబుర్లు



మిమిక్రీతో, కమేడియన్ అయ్యాడు బాలకృష్ణ. రివటలాంటి మనిషి. శరీరాన్ని అష్ట వంకర్లూ తిప్పుతూ నటించేవాడు. కలకత్తాలో వున్నప్పుడు సరైన వేషాలు వచ్చే సూచనలు కనిపించక, నాటకాలబాట పట్టాడు - హాస్య పాత్రలు ధరిస్తూ. 'తారాశశాంకం' (మువ్వల నూరిబాబుగారి సమితి)లో లంబు, జంబుల్లో ఒకడు. ఓ పిచ్చినవ్వు నవ్వుతూ - ఆ పాత్ర నటించేవాడు. ఆ నాటకాన్ని కె.వి. రెడ్డిగారు చూశారు. ఆ నవ్వూ, ఆ నటన ఆయన్ని ఆకర్షించాయి.



విజయవాడ నెల జీతాలమీద కొందరు నటుల్ని తీసుకున్నప్పుడు, బాలకృష్ణకీ అవకాశం వచ్చింది. 'పాతాళభైరవి'లో ముఖ్యపాత్ర లభించింది - 'అంజిగాడు' అలా వెలిశాడు. "ఇది రాణీ గారి తమ్ములుంగారికి...'' అని గలగలగలమని నవ్విన నవ్వు 'తారాశశాంకం'లో అతను నవ్విన నవ్వే! "రెడ్డిగారు 'ఆ నవ్వు పెట్టు' అన్నారు. ఎక్కడెక్కడ అలానవ్వాలో చెప్పారు. మాకు రోజూ డైలాగ్ రిహార్సలుండేది. డైలాగులు, మూవ్‌మెంట్స్ అన్నీ చేయించేవారు. అలా చెయ్యబట్టే నేను 'అంజిగాడు'గా అందరికీ జ్ఞాపకం వున్నాను'' అని బాలకృష్ణ చెబుతూవుండేవాడు మాటల సందర్భంలో. అంతకుముందు 'షావుకారు'లో కనిపించాడు. 'పాతాళభైరవి' తర్వాత, బయటకూడా వేషాలు వెయ్యమన్నారు విజయవారు. సినిమాలమీద కనిపించేవారు. ఒక్కోసారి లేదు" అనేవాడు.

షూటింగుల్లో ఎప్పుడూ సందడిగా వుండేవాడు. ఎక్కడెక్కడ సరదాగా కబుర్లు చెబుతూ నవ్వించేవాడు. ఎంత బిజీగా వున్నా ప్రతిరోజూ షూటింగులు చేసినా, ఏదో టైములో విజయ-వాహిని స్టుడియోకి వచ్చేవాడు. రోజూ దర్శనం "దేవాలయం వంటిదయ్యాబాబూ. ఒక్కోసారి 'దేవుళ్ళు' చేసుకోకపోతే, కుదిరేదికాదు.

## 'మాయా బజార్'లో బాలకృష్ణ పాల్గొన్న ఓ హాస్య సన్నివేశం



లక్ష్మణ కుమారుడు (రేలంగి) తన మందిరంలో నిలువుటద్దంలో తన ముఖారవిందాన్ని చూసుకుని మురిసిపోతూ కర్ణాభరణాలను సరిచేసుకుంటూ, కూనిరాగంలో సంగీతాలాపన చేస్తూ, కళ్ళు తిప్పి ఈలవేసి "సారథీ" అని తన అనుచరుణ్ణి (బాలకృష్ణ) పిలిచాడు.

లక్ష్మణకుమారుడి వెర్రి వెంగళప్పాయి తనం తెలిసినవాళ్ళు గనక, జంట పండితులు శాస్త్రి (వంగర) శర్మ (అల్లురామలింగయ్య) వీలున్నప్పుడల్లా ప్రశంసిస్తూ, అతన్ని కీర్తిస్తూ మంచినో,మామూలునో సంపాయించు కుంటూ ఉంటారు. వారి పొగడ్తలకు ఆనంద సాగరంలో ఈదులాడుతూ ఉక్కిరిబిక్కిరి అవుతున్న లక్ష్మణకుమారుణ్ణి చూసి అతని అనుచరుడైన సారథి (బాలకృష్ణ) ఇలా అంటాడు.

"హే రాజన్! తానా అంటే, తందానా అని వీరు బహుమానాలు పుచ్చుకున్నారు. ఈ తాన శర్మ, తందాన శాస్త్రి మనముందు పనికిరారు. నా ముఖస్తుతి వినండి. ,

అటు ఇద్దరు ఇటు ఇద్దరు
అభిమన్యుని బాబాయిలు
అటు కూడిన, ఇటు కూడిన
నలుగురంటే నలుగురే...!
మరి తమకో...!?
నూటికి ఒక్కడె తక్కువ
వేటి వేటి బాబాయిలు
బాబో! ఏమని చెప్పుదు
బాబాయిల సేన తమది బ్రహ్మాండముగా..."

అని పద్యకవిత్వం చదివినట్టు చదివాడు - సారథి. "లెస్సాతి లెస్సగా బలికితివిరా సారథీ" అని అభినందించాడు లక్ష్మణకుమారుడు.

సినిమాలొచ్చాయి అతనికి.

ఓ ఇల్లు కట్టించుకున్నాడు. విఠలాచార్య, భావనారాయణ గారి సినిమాల్లో బాలకృష్ణ తప్పని సరి. డైలాగ్ టైమింగు, ఎక్స్‌ప్రెషనూ బాగా కలవాడు.

అతనికి పద్యాలు చదవడం, పాటలు పాడడం వచ్చు. "సినిమాల్లో మాత్రం నాచేత పాడించలేదు. పాడతానని నేను అడగలేదు. అడిగినా 'నోర్ముయ్యి, వేషం సరిగ్గా చెయ్యిచాలు' అంటారేమో నని భయం"అని చెప్పేవాడు.

మద్రాసు రోడ్లమీద తిరిగిన సైకిలు అమ్మేసి చిన్న పాతకారు కొని అందులో తిరిగేవాడు. "అది ఎక్కడ పడితే అక్కడ ఆగి పోతూవుండేది - కార్పోరేషన్ ఎద్దులబండిలా. పెట్రోలు అయి పోయినా ఆగిపోయేది! లాభం లేదని అమ్మేశాను" అని చెప్పేవాడు బాలకృష్ణ తన 'కారానుభవం' గురించి చెప్పినప్పుడు. ఆ తర్వాత నిరాకారుడయ్యాడు!

అతనికి ఏడుగురు ఆడపిల్లలు! "బాల-కృష్ణని కదా, 'బాల'నాగమ్మ వంశం మాది. ఈ ఏడుగురికీ ఎలా పెళ్ళిళ్లు చెయ్యాలో ఏమిటో'' అని దిగులు పడేవాడు.



'మాయాబజార్'లో సారథిగా పెద్దవేషం వేసినా, ద్వారకలో ఘటోత్కచుడు ప్రవేశించినప్పుడు ద్వార పాలకుడిగా ఇంకో వేషం వేశాడు. "ఆ వేషం అలా చెయ్యాలని డైరక్టరుగారి ఊహ. "పర్వాలేదు, బాలకృష్ణ చేతనే వేయిద్దాం" అని నాచేత వేయించారు'' అని అతను గర్వంగా చెప్పుకునేవాడు.



అలాగే నోరువివ్వకుండా, 'మిస్సమ్మ'లో వేసిన వేషం గురించీ చెప్పేవాడు.

'నర్తనశాల'లో వేసినప్పుడు''-ఇదిగో, ఆనాటి కీచకవధలో వేశాను - ఈనాడూ అదే సినిమాలో వేస్తున్నాను - హె॰'' అన్నాడు వంగర వెంకటసుబ్బయ్యగారితో. "రెండేసి సినిమాల్లో నేనూ వేశా(నా బాలిగా'' అని వంగరవారు అంటే, "మాయాబజార్' మళ్ళీ తీస్తే - నావేషం నాకిస్తారుగాని, మీరు వేసిన వేషం మీకివ్వరు". అని చమత్కరించి, వంగరవారు మళ్ళీ ఏదైనా అంటారేమోనని, పరుగెత్తి పారిపోయిన బాలకృష్ణ - సరదా అయినవాడు, సందడి చేసే వాడూ, జుట్టు ఊడిపోయిన తర్వాత 'బాల్డ్ కృష్ణ" అనిపించుకున్నవాడూ...!









ప్రసిద్ధ గాయకుడు మన్నాడే దగ్గరికి ఒక అమ్మాయి, రికమెండేషను లెటర్ కోసం వెళ్లింది. ఆ మాట తన మిత్రురాలికి చెప్పింది. అతన్ని కలిసి తిరిగొచ్చాక ఆ మిత్రురాలు అడిగింది:

"మన్నాడే ఏమన్నాడే?"

ఆ అమ్మాయి నిరాశగా చెప్పింది:

"మన్నాడే (మరునాడే) రమ్మన్నాడే"

-ఆర్కే



## లగాన్ ఆస్కార్ గెలిచేనా?

ఒక భారతీయ చిత్రానికి ఆస్కార్ అవార్డు గెలిచే అవకాశాలు తక్కువగా ఉంటాయి. కారణం - మన సినిమాలలో ఉండే పాటల సన్నివేశాలు! అవి మనకు ముఖ్య ఆకర్షణ. విదేశీయులు వాటిని చిత్రగమనాన్ని కుంటుబరిచే అవరోధాలుగా భావిస్తారు. లగాన్ విషయంలో కూడా ఇదే జరగబోతుందా? అసలే సినిమా పెద్దది. దానికి తోడు పాటలున్నాయి. అవార్డు నిర్ణేతలకు విసుగు పుడుతుందన్న సందేహం వస్తుంది. ఈ విషయమై లగాన్ దర్శకుడు అశుతోష్ గోవారికర్‌ను అడిగినప్పుడు 'వాళ్ళు మెచ్చే సత్యజిత్‌రాయ్ సినిమాల లాటిది కాదు 'లగాన్'. అకాడెమీ మెంబర్స్ కోసం ఏర్పాటు చేసిన ఫస్టు స్క్రీనింగ్‌కి 43 మంది వచ్చారు. రెండో దానికి 6గురే వచ్చారు. మూడో దానికి20. కాని నాలుగవ దానికి 197 మంది వచ్చారు. అంటే ముందు వచ్చిన వాళ్ళకి నచ్చి తక్కిన వాళ్లకు చెబితే అంతమంది వచ్చారన్నమాట. ఇక పాటల విషయానికొస్తే సీట్లలోంచి లేచి డాన్సు చేశారు. ముఖ్యంగా "మిత్‌వా..." పాటకు మంచి రెస్పాన్సు వచ్చింది" అన్నారు.

### హాస్యావధానికి మరో బిరుదు

'హాస్యావధానం' అనే ప్రక్రియతో అనేక చోట్ల అవధానాలు నిర్వహిస్తూ, తన వాక్చాతుర్యం, 'పన్' చేయగల నేర్పు, సమయస్ఫూర్తితో హైదరాబాదు వాసులను హాస్యప్రియులుగా మారుస్తున్న శ్రీ శంకరనారాయణను హైదరాబాదుకి చెందిన శ్రీరస్తు అనే సాంస్కృతిక సంస్థ 'అభినవ తెనాలి రామకృష్ణ' అనే బిరుదుతో సత్కరించింది.

## నలభై యేళ్ళ తర్వాత నగరంలో లతా గానం...

దీనానాధ్ చారిటబుల్ ట్రస్టుకు విరాళాలు సేకరించేందుకు లతామంగేష్కర్ హైదరాబాదులో ఇచ్చిన 'మేరీ ఆవాజ్‌హీ పహచాన్‌హై, (నా స్వరమే నా గుర్తు) కార్యక్రమం గత పక్షం మార్చి 9న జరిగింది.



పూణెలో తన తండ్రి పేర నెలకొల్పిన ఆసుపత్రికి నిధులు సమకూర్చడానికి లతా పాల్గొన్న ఈ కార్యక్రమాన్ని మ్యూజికక్రీ కంపెనీ నిర్వహించింది. నాలుగు దశాబ్దాల తర్వాత లతా గానాన్ని ప్రత్యక్షంగా వినగలిగారు హైదరాబాదు వాసులు. "మా అమ్మకు మా నాన్నగారు చార్మినార్ అచ్చులతో ఉన్న బంగారు దండను బహూకరించడం నాకు బాగా జ్ఞాపకం. అందుకే చార్మినార్‌ను, అక్కడ ప్రసిద్ధికెక్కిన చుడియా బజారు (గాజుల మార్కెట్)ను మర్చిపోలేను" అంటూ లతా 'మేరే హాతోంమే నౌనౌ చుడియాహై' పాట పాడి వినిపించారు. ఆమెతో బాటు ఉషా మంగేష్కర్, ఉదిత్‌నారాయణ్ కూడా ఈ సంగీత విభావరిలో పాల్గొన్నారు. ఎన్నో, ఎన్నో మధుర గీతాలతో హైదరాబాదీయులను అలరించారు.

## కుంచె ఝుళిపించి...



గత పక్షం మార్చి 10న ఆంధ్రప్రదేశ్ ప్రెస్ ఎకాడమి, ఫోరం ఫర్ పొలిటికల్ కార్టూనిస్ట్ సంయుక్తంగా 'కార్టూన్ ఉత్సవ్ - 2002' ఏర్పాటు చేశాయి. ఆ సందర్భంగా ప్రెస్‌కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఛైర్మన్ జస్టిస్ కె.జయచంద్రారెడ్డి తెలుగు కార్టూనిస్టుల కులపతి బాపును 'విశిష్ట పురస్కారం'తో సత్కరించారు. ఇదే సందర్భంగా ప్రముఖ కార్టూనిస్టులు చంద్ర, జయదేవ్, పాపా, షోయబ్, టీవీ, సత్యమూర్తిలను సన్మానించారు. ఈ సందర్భంగా కంప్యూటర్ యుగంలో కూడా కుంచెకు సాటిలేదని అన్నారు బాపు.

## రవిశంకర్‌కు మరోసారి గ్రామీ

సితార్ వాద్య నిపుణుడు రవిశంకర్ కూతురు అనూష్కాతో కలిసి చేసిన 'ఫుల్ సర్కిల్' ఆల్బమ్‌కి



గ్రామీ గెల్చుకున్నారు. ఫిబ్రవరి 28న వెలువడిన ఈ ప్రకటనతో రవిశంకర్ ఈ అవార్డు మూడవ సారి గెల్చుకున్నట్టయింది. 1968లో ఆయన యెహూదీ మెనూహిన్‌తో కలిసి చేసిన 'ఈస్ట్ మీట్స్ వెస్ట్' ఆల్బమ్‌కు గ్రామీ లభించడంతో ఆ అవార్డు గెల్చుకున్న తొలి భారతీయుడిగా ప్రశంసలు పొందారు. రెండవసారి 1972లో 'బంగ్లాదేశ్ కన్సర్ట్'కు లభించింది. ఈసారి వచ్చిన అవార్డు 'ఫుల్ సర్కిల్ కార్నిజీ హాల్ 2000' అనే లైవ్ రికార్డింగ్‌కి. "ఇంప్రూవైజేషన్ చేయడం నాకు బాగా అలవాటు. స్టూడియోలలో అయితే అది కుదురుతుంది కానీ లైవ్‌లో దానికి అవకాశం లేదు. కానీ ఎటువంటి ఇంప్రూవైజేషన్ లేకుండా చేసిన ఈ ఆల్బమ్‌కి అవార్డు రావడం చాలా సంతోషదాయకం" అన్నారు రవిశంకర్. ఏప్రిల్ 7న రవిశంకర్ జరుపుకోబోయే జన్మదినోత్సవ సందర్భంగా బర్త్‌డే గిఫ్ట్ కాస్త ముందుగానే వచ్చినట్టుంది.

## పేరు - రిపేరు



* "ఇది నాటు 'కోడి! రామకృష్ణా!' మాంఛిరుచిగా ఉంటుంది!"
* "కరెంట్ వచ్చిందిగా ఇంకెందుకా కొవ్వొత్తి? 'ఆర్పీ - పట్నాయక్!...'"
* అదిగో అదే ఎర్ర "కోట! శ్రీనివాసరావ్!...."
* "ఇంకెంత దూరం? చంద్ర 'గిరి-బాబూ!'"
* మా ఆవిడైతే సరే 'సరి-త'నూ చిన్నపిల్లలానే ప్రవర్తిస్తోంది!
* "ఒసే 'కాంతా! రావు' గారొచ్చే వేళయ్యింది... ఇల్లు సర్దు!!"

- తరిగొప్పుల విఎల్లెన్ మూర్తి, హైదరాబాద్

## ఈ రూటే వేరు

'మన్' డే : మనసు దినం!

అపార్ట్‌మెంట్ : ఏ పార్టు కా పార్టు సిమ్మెంట్‌తో కట్టబడినది

'న్యూ'స్ : కొత్తవి!!

-తరిగొప్పుల విఎల్లెన్ మూర్తి, హైదరాబాద్





## చిలిపి లిపి

**Fat Town =** కొవ్వూరు

-ఎన్.బి.దాస్, కొవ్వూరు

**E ర why A Do** = 27

**Fire King Buying** = నిప్పురాజుకొనుట

-జె.యస్.యన్.స్వామి, హైదరాబాద్




## డబుల్‌రోల్




ఆ 'కోడి'ని ఇం'కోడి' తో పంపకు... నువ్వే తీసుకురా....

-విశ్వ, చందానగర్

ఇంతకీ ఆ 'నట్టు' ఎక్కడ పడి'నట్టు'!?

ఆ 'ట్రస్టు' మీద ఎవరికీ అంత ఇం'ట్రస్టు' లేదు.

-పి.ప్రియాంక, చోడవరం.



## పేరడీ పేరేడ్

ఆగదూ.... ఆగదూ.... ఆగదూ...
ఆగదు ఏ బస్సూ నీ కోసమూ
ఆగినా నిలవదు నీ కోసము
ఎన్నడు నిలవదు నీ కోసము ॥ఆగదూ॥

బస్సులు ప్రజలవనీ
ప్రజలే ప్రభువులనీ
తెలిసినా ఏ బస్సూ
వచ్చి చావదు

రూటులు మారుననీ
ప్లేటులు మారవనీ
తెలిసినా ఏ ఒక్కరు
చెప్పజాలరు

టైముకు రానివనీ
స్టాపులో ఆగవనీ
తెలిసినా ఈ మనిషి
తపన ఆగదూ
ఈ నిలువు జీతమాగదూ

("ప్రేమాభిషేకం" చిత్రంలో "ఆగదూ" పాటకు అనుకరణ)

- శ్రేష్ఠ, హైదరాబాద్

## చిలిపి కవిత



జెలసీ ఓ డిసీజ్
అన్నదే ఓ మెసేజ్
తెలుసుకుంటే
పెరుగు తుంది
మైండ్ కుండే ఓల్టేజ్
లేకుంటే దాపురిస్తుంది
యంగేజ్ లోనే ఓల్డేజ్

-కీర్తన, హైదరాబాద్

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు

వి.మంజురాణి - హైదరాబాద్



ప్ర॥ పిల్లాజెల్లా అంటుంటారు.... ఎందుకని...!?

జ॥ 'భవిష్యత్తులో జెల్లకొట్టబోయేది వీరే సుమా' అని ఎప్పుడు గుర్తుచేస్తూ ఉండడానికి.

ప్ర॥ 'హాసం' ఓ ఆణిముత్యం అనే పేరుని ఇంత త్వరగా తెచ్చుకోగలగటానికి కారణం!?

జ॥ 'మోతీ'నగర్‌లో ఉంది కాబట్టి.

ప్ర॥ సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు అని అంటే అర్థం ఏమిటి?

జ॥ ఎండ దంచేస్తోంది అని....! దంచినతర్వాతేగా చెరిగేది...!




## నీ ప్రేమకై



నటునిగా సుధాకర్‌ది ప్రత్యేకమైన బాణీ. ముఖ్యంగా ఆయన చేసే హాస్యం ఎలాంటి వారినైనా గిలిగింతలు పెట్టిస్తుంది. 'నీ ప్రేమకై' సినిమాలో నవ్వులు కురిపించిన సుధాకర్ తన మనసు దోచుకున్న పాట గురించి ఇలా చెబుతున్నారు.

"నాకు మొదట్నుంచీ కూడా మెలోడి అంటే ప్రాణం. ఇప్పటికీ ఘంటసాల, మహమ్మద్ రఫీ, ముఖేష్‌ల పాటలే ఎక్కువ వింటుంటాను. ఈ మధ్య వచ్చే కొత్త పాటలు వినడం తక్కువ. 'నీ ప్రేమకై'లో 'వెండి మబ్బుల పల్లకిలో వెన్నెలమ్మా రావే' పాట నాకెందుకో బాగా నచ్చింది. ఆ పాట రోజూ పాడుకుంటున్నాను.".

## నువ్వు లేక నేను లేను



ప్రస్తుతం ఎక్కడ విన్నా 'నువ్వు లేక నేను లేను' పాటలే వినిపిస్తున్నాయి. సంగీత దర్శకుడు ఆర్.పి.పట్నాయక్‌ని హీరో రేంజ్‌కి పెంచాయి ఈ పాటలు. 'నిండు గోదారి' పాటను కులశేఖర్ రాసారు. ఈ విషయమై మాట్లాడుతూ - "ట్యూన్ ఇచ్చి, సందర్భం చెప్పి ఈ పాట లవ్‌కి ఓ డిక్షనరీలా వుండాలని చెప్పారు దర్శకులు. ఇరవై నిమిషాల్లోనే పాట పూర్తి చేసి ఇచ్చేశాను. రేపు పాట షూటింగ్ అనగా ముందురోజు ట్యూన్ ఇచ్చారు. తీరా నేను రాసిన పాట వాళ్ళకి బాగా నచ్చేసి, పాట షూటింగ్ కేన్సిల్ చేసేసి, తర్వాత షెడ్యూల్‌లో బాగా చేయాలని నిర్ణయించారు. ఈ సినిమాలో పాటలన్నీ బాగున్నాయి కానీ, 'నువ్వంటే నాకిష్టం' పాట మరీ నచ్చింది. ఆ పాటలోని 'నేనంటే నాకిష్టం, నాకన్నా నువ్విష్టం'' అన్న ఎక్స్‌ప్రెషన్స్ అద్భుతంగా వున్నాయి" అని చెప్పారు కులశేఖర్.

## కలుసుకోవాలని



కృష్ణవంశీ చిత్రాలకు ప్రొడక్షన్ మేనేజర్‌గా పని చేసిన ప్రవీణ్‌కు ఎప్పట్నుంచో మంచి సినిమా తీయాలనే అభిలాష వుంది. తన స్నేహితులైన రాజు, గిరిలతో కలిసి ఆర్‌పిజి ప్రొడక్షన్స్ సంస్థను స్థాపించి తొలి ప్రయత్నంగా ఉదయకిరణ్ హీరోగా 'కలుసుకోవాలని' చిత్రం నిర్మించారు. "ఈ సినిమాలో ఆఖరి పాట అయిన 'ఉదయించే సూర్యుడినడిగా' పాట అన్నిటికన్నా నాకు బాగా నచ్చింది. రెగ్యులర్ కాన్సెప్ట్‌లో కాకుండా డిఫరెంట్‌గా వుంది. మొనాటనీ అనేది పాటలో ఎక్కడా కనిపించదు. చివరకు సెట్స్‌లో కూడా కొత్తదనం కనిపిస్తుంది. చాలాకాలం తర్వాత ఓ కొత్త కాన్సెప్ట్‌లో వచ్చిన సాంగ్ ఇదని నేను ఫీలవుతున్నాను" అని తెలిపారు ప్రవీణ్.

## ఓ చినదాన



మొదట్లో అంతగా గుర్తింపులేని పాత్రలు చేసిన బ్రహ్మాజీ 'సిందూరం' తర్వాత తనలో ఓ మంచి ఆర్టిస్ట్ వున్నాడని నిరూపించుకున్నారు. ఒకే బ్రాండ్‌కి పరిమితమైపోకుండా వివిధ రకాల పాత్రలు పోషిస్తున్న బ్రహ్మాజీ 'ఓ చినదాన'లో చాలా సరదా పాత్ర పోషించారు. ఈ సినిమాలో టైటిల్ సాంగ్ తనకు బాగా నచ్చిందని ఆయన చెప్పారు. 'తన చిరునామా అడిగితే ప్రేమ' అంటూ మొదలయ్యే ఈ టైటిల్‌సాంగ్ వినడానికి, చూడటానికి బాగుంది. మంచి హుషారైన గీతం ఇది. ముఖ్యంగా అందరూ పాడుకునే విధంగా ట్యూన్, దానికి తగ్గట్టుగా సాహిత్యం క్యాచీగా వుంది. పిక్చరైజేషన్ ఆ పాట రేంజ్‌ని పెంచింది" అని వివరించారు బ్రహ్మాజీ.

## నీతో చెప్పాలని



'చిక్‌బమ్ చిక్‌బమ్' ప్రైవేట్ ఆడియోతో తెలంగాణా యాసకు పాటల్లో కొత్త వరవడి తీసుకొచ్చిన రచయిత సాహితి. తాజాగా విడుదలైన 'నీతో చెప్పాలని' చిత్రంలో 'అమ్మాయే ఓరకంట చూసిందంటే నాదిరి దిన్నా థిల్లానా' పాటను రాసారాయన. "షష్టిపూర్తి కార్యక్రమానికి వచ్చిన హీరోహీరోయిన్లు తమలో తాము ఊహించుకుంటూ పాడే పాట ఇది. యూత్‌కి ఎంకరేజింగ్‌గా వుండే ట్యూన్ ఇది. క్లైమాక్స్‌లో సరదాగా వుండాలని సంగీత దర్శకులు కోటిగారు ఈ ట్యూన్ చేసారు. పాట మధ్యలో మలయాళపు లైన్లు వస్తాయి. 'మిస్సమ్మ' సినిమాలోని 'బృందావనమది అందరిది' పాట స్టయిల్‌లో ఆ లైన్లు వుండి వినబుద్ధి వేస్తాయి" అని తెలిపారు సాహితి.

## అమృత



ఏదైనా ఒక సినిమాని డిఫరెంట్ స్టయిల్‌లో తియ్యాలంటే మనకు తట్టే పేర్లు మూడే... మెయిన్‌గా తమిళంలోనే తీసే మణిరత్నం, తెలుగునుంచి హిందీకి వెళ్ళిపోయిన రామ్‌గోపాల్ వర్మ, ఇప్పటి వరకు తెలుగువారికే పరిమితం అయిపోయిన కృష్ణవంశీ! వీళ్ళు ఏం చేసినా, ఏం తీసినా, ఏం చెప్పినా ప్రత్యేకంగా ఉంటుంది. 'అమృత' పాటల గురించి కృష్ణవంశీని అడిగినప్పుడు...." ఆడియో పరంగానా... వీడియో పరంగానా!?" అంటూ ఇంతవరకు ఎవరూ తిరిగి అడగని రీతిలో ఎదురు ప్రశ్నించారు.... "దటీజ్... కృష్ణవంశీ! రెండిటిని కలుపుకుంటూ చెప్పండి" అంది 'హాసం'.... ఆ క్షణంలో ఆశువుగా 'అమృత' పాటల గురించి ఆయన చెప్పిన విధానం, విశ్లేషణ.... యథాతథంగా రాయాలంటే ఈ శీర్షిక సరిపోదు.... ప్రత్యేకంగా ఒక పేజీనో అంతకన్నా ఎక్కువ కేటాయించాల్సిందే.... అందుకే ఆ అమూల్య సమాచారాన్ని ఉగాది స్పెషల్‌గా వచ్చే సంచిక కోసం దాచుకోవటం జరిగింది. వచ్చే సంచికలో చదివి చూడండి....

## లాహిరి లాహిరి లాహిరిలో



సంభాషణల రచయితగా తనకంటూ ఓ ప్రత్యేకమైన ముద్రను సంపాదించుకున్నారు చింతపల్లి రమణ. 'లాహిరి లాహిరి లాహిరి' సినిమా ద్వారా తన కలం మరింత పదునెక్కిందని ఆయన అంటున్నారు. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే - "మన వీర వెంకట సత్యనారాయణ స్వామి పెళ్ళి' పాటకే నేను అగ్ర తాంబూలం ఇస్తాను, అందుకు ప్రధాన కారణం ఆ పాటలోని స్వచ్ఛమైన తెలుగుదనం. ఈ సినిమా రిలీజయ్యాక పాట మరింత పాపులర్ అవుతుంది. ప్రతి పెళ్ళి పందిరిలోనూ ఈ పాట తప్పనిసరిగా వినబడినా ఆశ్చర్యపోనవసరం లేదు. పల్లవిలో వీరలో 'ర' దగ్గర సత్యన్నార్రాయణ స్వామి దగ్గర 'న' దగ్గర 'ర' దగ్గర కొద్దిగా వొత్తడంతో అందమొచ్చింది. పాట హుషారుగా వుంది. బీట్ కొత్తగావుంది. పైగా కీరవాణి పాడారేమో కమ్మని తెలుగు చెవికింపుగా అనిపించింది. పాట వింటుంటే ఒక్కసారిగా కోనసీమలోకి వెళ్ళినట్టుగా అనిపించింది" అని తన భావాల్ని ఆవిష్కరించారు చింతపల్లి రమణ.

## నీలాంబరి

ప్రతిభ ఉన్నవారికి పట్టం కడుతున్న రోజులివి. అలా తన ప్రతిభతో అతి తక్కువ కాలంలో సింగర్‌గా ప్రత్యేకమైన గుర్తింపు సంపాదించుకున్న గాయని కౌసల్య. 'చిత్రం' చిత్రంలోని 'ఏకాంతవేళ ఏకాంతసేవ....' పాట ద్వారా గాయనిగా కెరీర్ ప్రారంభించి, అతి తక్కువ కాలంలో 25కు పైగా చిత్రాలలో 50కు పైగా పాటలు పాడిన గాయని కౌసల్య. ఇటీవల విడుదలైన 'నువ్వు లేక నేను లేను' చిత్రంలోని 'నిండుగోదారి కదా ఈ ప్రేమ' పాట పాడింది కూడా ఈమె కావటం విశేషం. అలాగే 'నీలాంబరి' చిత్రంలోని 'బ్యూటీ వుంది మనముందే, డ్యూటీ నీదే పదమందే' పాట పాడిన ఆమెను ఆ చిత్రంలో ఆమెకు నచ్చిన పాట గురించి అడిగితే....



"ఈ జగమే ఈ జగమే ఈ జగమే ఆగెను ననుచూసి.....' పాట నాకు బాగా నచ్చింది. ఎందుకంటే 'చిత్ర' ఆ పాట పాడిన విధానం ఒకటైతే, లిరిక్ ఆ పాటకు చాలా బాగా సెట్ అయింది. జాగ్రత్తగా చూస్తే 'నీలాంబరి' టైటిల్ సాంగ్‌లా అన్పిస్తుంది. పాటలో చక్కటి మెలోడి, బీట్ వుంది. ముఖ్యంగా చెరగని సొగసిది తరగని వయసిది అన్న లైన్ దగ్గర ఛేంజ్ ఓవర్స్ పాటకు హైలెట్. ఒక్కసారి పాట వింటే చాలు ఇక మనల్ని ఆ పాట వెంటాడుతూనే ఉంటుంది. అంత అద్భుతమైన పాట ఇది. కొన్ని పాటలు చిత్రంలో చూస్తున్నంత సేపు బాగుంటాయి. బయటకు వస్తే దానిని మరిచిపోతాం. అలాంటిదే ఈ చిత్రంలో నేను పాడిన పాట. అయితే 'చిత్ర'గారు పాడిన ఈ పాట హైలెట్. చక్కటి ఫీల్ ఈ పాటలో వుంది" అన్నారు ఎంతో తన్మయత్వంతో.

## సవ్వడి

తెలుగులో తొలి డిజిటల్ ఫిలింగా రికార్డులు కెక్కనుంది 'సవ్వడి' చిత్రం. న్యూకాన్సెప్ట్‌తో, నూతన తారాగణంతో, నూతన సాంకేతిక వర్గంతో ఈ చిత్రం రూపొందింది. ఈ 'సవ్వడి' ఆల్బమ్‌లో తన మనసులో సవ్వడి చేసే పాట గురించి యువ సంగీత దర్శకులు చక్రి ఇలా వివరిస్తున్నారు.



"నాకు మొదట్నుంచీ నీలాంబరి రాగమంటే ఇష్టం. ఈ ఆల్బమ్‌లోని 'నిన్ను నాకు పరిచయం చేసినావు' పాటని ఆ రాగంలోనే చేయడంతో నాకు బాగా నచ్చేసింది. ఆ రాగంలో చేసారని నచ్చడం కాదు గానీ, ఉన్నికృష్ణన్ పాట పాడిన స్టయిల్ కూడా బాగా నచ్చింది. సాహిత్యం కూడా విభిన్నంగా వుంది. వ్యక్తిలోని వికాసాన్ని ఉత్తేజపరిచే విధంగానూ, ప్రేమలోని అందమైన కోణాన్ని ఆవిష్కరించే విధంగానూ వుంది. అందమైన ఫీలింగ్స్‌ని ఎక్స్‌ప్రెస్ చేయడం కోసం ఎన్నుకున్న కాన్సెప్ట్ బాగుంది" అన్నారు చక్రి - 'సవ్వడి' సంగీత దర్శకుడు రఘుకౌశిక్‌ని అభినందిస్తూ.

## రమణ



శివనాగేశ్వరరావు దర్శకత్వంలో ఇటీవల విడుదలైన 'రమణ' ద్వారా పరిచయం అయిన 'మహిరిషి' శాస్త్రపరంగా పరిజ్ఞానం ఉన్న సంగీత దర్శకుడు. తన సంగీత దర్శకత్వంలో తనకు అన్నివిధాలా నచ్చిన పాట ఏది అని అడిగినప్పుడు 'డోన్ట్ సే... నో.... రాజకుమారి' అనే పాటను పేర్కొన్నారాయన. "ఈ పాటలో అందర్నీ ఎట్రాక్ట్ చేసే ట్యూన్‌తో పాటు కోరస్ వాయిస్‌లు కూడా అట్రాక్టివ్‌గా జతపడ్డాయి. 'ధిగిడితాం ధిత్తోం' అంటూ కోరస్‌లు పల్లవితో కలవటం వల్ల పాటకు రిచ్‌నెస్ వచ్చింది. కోరస్ వాయిస్‌లకు చక్కని ప్లేస్‌మెంట్ ఉన్న పాటలు అతి అరుదుగా కుదురుతూ ఉంటాయి. అలా కుదిరిన పాటలన్నీ మంచిపేరు తెచ్చుకున్నవే. ఈ డోన్ట్ సే.... నో... రాజకుమారి పాట కూడా అటువంటి మంచిపేరుని తెచ్చుకుంటుందనే నా నమ్మకం" అని అన్నారాయన నమ్మకంగా.

**మార్చి 28న పట్టమ్మాళ్ 83వ జన్మదినం సందర్భంగా**

# కర్ణాటక సంగీత ప్రపంచానికే పట్టపురాణి డి.కె.పట్టమ్మాళ్



**'నాకు మీ భాషగానీ, సంగీతం కానీ అర్థం కావు. కానీ, మీ గానంలో ఉండే మాధుర్యం మనసులోతులను స్పృశించి ఆత్మను మేల్కొల్పి ఏవేవో కొత్త లోకాలకు తీసుకెళ్ళింది. ఇటువంటి అనుభూతి నాకెప్పడూ కలుగలేదు" అన్న ఓ జర్మన్ మహిళ మాటలు చాలు "డి.కె.పట్టమ్మాళ్" గాన వైశిష్ట్యాన్ని వేనోళ్ల కొనయాడేందుకు.**

**స్త్రీలు, అందునా ఉన్నత వర్గాల్లోని వారు పదుగురు పురుషులముందు మాట్లాడరాదు, ఆడరాదు, పాడరాదు అనే ఆంక్షలను సామాజిక కట్టుబాట్లను అధిగమించి శాస్త్రీయ సంగీత ప్రపంచంలో అత్యున్నత కళాకారిణిగా ఎదిగిన కళాకారిణి డి.కె.పట్టమ్మాళ్.**

అది 1924వ సంవత్సరం. అయిదేళ్ల పట్టమ్మాళ్ అప్పటికే తండ్రి వద్ద వందల కొద్ది శ్లోకాలను బాణీలతో సహా నేర్చుకుని ఉంది. ఈ ప్రతిభను గుర్తించిన పాఠశాల ప్రధానోపాధ్యాయులు పాఠశాల వార్షికోత్సవంలో జరిగిన ఒక గేయ నాటకంలో ఓ పాత్రను పోషింపజేశారు. ఆ నాటక ప్రదర్శనకు వచ్చిన ఒక వ్యాపారి పట్టమ్మాళ్ నటనకు ముగ్ధుడై స్వర్ణ పతకం బహూకరిస్తున్నట్లు ప్రకటించారు. ఈ విషయాన్ని ఫొటోతో సహా "హిందూ"పత్రిక మొదటి పేజీలో ప్రచురించారు. అయితే ఇది చూసిన పట్టమ్మాళ్ తండ్రి ఆందోళనతో పాఠశాలకు వెళ్లి హెడ్‌మాస్టర్‌తో "ఇది పెద్ద కళంకం. ఇప్పుడిక మా అమ్మాయిని ఎవరు పెళ్లిచేసుకుంటారు!? మా అమ్మాయి జీవితాన్ని శాశ్వతంగా నాశనం చేశారు!!"అంటూ చిందులు తొక్కారు. అయితే ఆ హెడ్ మాస్టర్ "మీ అమ్మాయి భవిష్యత్‌లో ఎన్నో విజయాలు సాధించే వరాల పంట" అంటూ పలికిన ఆ నాటి ఆ మాటలు నిజమవుతాయని ఆయన ఏ మాత్రం ఊహించి ఉండరు. ఆ తరువాత తన 75 వసంతాల సంగీత జీవితంలో ఆమె సాధించిన విజయాలు ఆ మాటలను అక్షర సత్యాలు చేశాయి.

1919 మార్చి 28న తమిళనాడు లోని కాంచీపురంలో జన్మించిన పట్టమ్మాళ్ పూర్తి పేరు "దామల్ కృష్ణస్వామి పట్టమ్మాళ్". తండ్రి కృష్ణస్వామి దీక్షితార్‌కి సంగీతమంటే మెండైన అభిమానముండేది. నారాయణ పిళ్లయ్ వంటి ప్రముఖ సంగీత విద్వాంసులెందరితోనే పరిచయాలుండేవాయనకు. "హిందూ" పత్రికలో వచ్చిన వార్త పట్టమ్మాళ్‌కు గొప్ప ప్రచారం తెచ్చిపెట్టింది. అప్పటికే ప్రతిభావంతుల కోసం అన్వేషిస్తున్న కొలంబియా సంస్థ తాముగా కాంచీపురానికి వచ్చి పట్టమ్మాళ్ గానాన్ని రికార్డు చేస్తామని అడిగారు. కానీ ఇలా రచ్చకెక్కడం ఇష్టం లేదని ఆమె తండ్రి పాఠశాల హెడ్మాస్టర్, కాంగ్రెస్ నాయకుడు పి.ఎస్.శ్రీనివాసన్‌తోను అంటే "నీ బెంగంతా మీ అమ్మాయి పెళ్లి గురించే కదా! అయితే మీ అమ్మాయికి పెళ్లీడు వచ్చినప్పుడు నేను నా మేనల్లుడు ఈశ్వరన్‌కిచ్చి వివాహం చేయిస్తాను సరేనా!? అని శ్రీనివాసన్ భరోసా ఇచ్చారు. నిజంగా ఆ తరువాత 1939లో ఈశ్వరన్‌తో డి.కె.పట్టమ్మాళ్ వివాహం జరిగింది. అప్పట్లో బ్రాహ్మణ కుటుంబంలో ఉన్న కట్టుబాట్లను కాదని ఆమె సంగీత సాధనకు సహకరించడమే గాక సంగీత జీవితానికి గైడ్‌గా మారేందుకు ఉద్యోగాన్ని కూడా వదులుకున్నారాయన.

పట్టమ్మాళ్ ప్రొఫెసర్ పి.సాంబమూర్తి, జస్టిస్ టి.ఎల్.వెంకటరామ అయ్యర్ వంటి సంగీతజ్ఞుల వద్ద శిష్యరికం చేసి శిక్షణ పొందారు. సంగీత పరీక్షలకు ఇన్విజిలేటర్‌గా వచ్చిన అంబిదీక్షితార్ పట్టమ్మాళ్ గానానికి ముగ్ధుడై తనంతట తానుగా ఆమెకు కీర్తనలను బోధిస్తానని శిష్యురాలుగా స్వీకరించారు. ఇది అందరికీ అందని అరుదైన అవకాశం. గురువుల వద్ద భేష్ అనిపించుకున్న పట్టమ్మాళ్ మద్రాస్ మ్యూజిక్ అకాడమీలో చేరి తన గానంతో సంగీత ప్రియులను మైమరిపించారు. ఇలా తొలినాట ఆమె గానమాధుర్యం ప్రపంచానికి తెలియజేయడానికి అంబి దీక్షితార్, అయ్యర్‌లు ఎంతైనా దోహద పడ్డారు. సంగీతంలో పరిపూర్ణత్వమనేది లేదని గ్రహించిన ఆమె అరశతాబ్దం పాటు సంగీత ప్రపంచాన్ని తన గానంతో చకచ్చకితం చేసిన అరియక్కుడి రామానుజ అయ్యర్ వద్దకెళ్లి శిష్యురాలిగా స్వీకరించామని కోరారు. ఆమె గానం విన్న ఆయన ఆనందంతో తన ప్రియ శిష్యుడు వైద్యనాధన్ చేత ప్రత్యేక శిక్షణ నిప్పించారు.

ఆ రోజుల్లో సంగీత కళారంగాలకు నిలయమైన మద్రాసు నగరంలోనే సంగీతాభ్యాసం చేసిన పట్టమ్మాళ్ కోసం ఆ తరువాత ఆమె కుటుంబం అంతా మద్రాసుకు మకాం మార్చారు. మద్రాసులో స్థిరపడటంతో ఆమెకు ఎందరో సంగీజ్ఞులతో పరిచయాలు ఏర్పడి వారితో గోష్టులు, చర్చలు కచేరీలు చేసి ఆముష్మిక సంగీత సాధన చేశారు. తన నిరంతర సంగీత కళాన్వేషణలో ఆమెకు సలహా, సహకారాలందించిన మహాను భావుల్లో విద్యల నరసింహనాయుడు, అప్పాదురై ఆచారి, ధనమ్మాళ్ కూతురు

రాజ్యలక్ష్మి, కృష్ణస్వామి అయ్యర్‌వంటి వారెందరో ఉన్నారు.

ప్రజలలో సంగీతాభిమానుల్లో పట్టమ్మాళ్ గానం పట్ల పెరిగిన అభిమానాన్ని రికార్డు కంపెనీలు, సినిమా రంగాలు, రేడియోలు వ్యాపారం చేసి లాభాలు గడించాయి. సినీ రంగంలో నేపథ్యగానం చేసిన తొలి శాస్త్రీయ గాయనీమణుల్లో ఈమె కూడా ఒకరు. పట్టమ్మాళ్ గానంలో విలక్షణత్వం గోచరిస్తుంది. ఆమె కంఠంలో గమకాలు, సంగతులు మనోహరంగా పలుకుతాయి. తన గానంలో ఒకానొక కొత్త విషయాన్ని ప్రవేశ పెట్టారామె. తన సమకాలికులు తమిళ కీర్తనలు ఆలపించినప్పటికీ చివరలో మాత్రం పాడేవారు కారు. దీంట్లో ఆమె మార్పును తీసుకొచ్చారు.

కర్ణాటక సంగీతానికి కేంద్ర బిందువుగా పేరుగాంచిన మద్రాస్ సంగీత అకాడమీ గతంలో పురుషాధిక్యత గలదిగా ఉండేది. కానీ ఎం.ఎస్. సుబ్బులక్ష్మి, డి.కె.పట్టమ్మాళ్, ఎం.ఎల్. వసంతకుమారి కర్ణాటక గాయనీ త్రయంగా పేరుగాంచిన నేపథ్యంలో అకాడమీ వారు వీరిని ఆహ్వానించి కచేరీలు ఏర్పాటుచేసి సముచిత రీతిన సత్కరించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆ రోజుల్లో మ్యూజిక్ అకాడమీ ఏటా ఇచ్చే సంగీత కళానిధి అవార్డును ఎం.ఎస్. డి.కె.లలో తొలుత ఎవరికి ముందుగా ఇవ్వాలనే చర్చ మొదలైంది. అయితే పట్టమ్మాళ్ వైపుకొందరు, ఎం.ఎస్.వైపు కొందరు వాదించినా, ఎమ్మెస్‌కే ఆ పురస్కారం దక్కింది. ఆ మరుసటి యేడు మధురై అయ్యంగార్ ఈ అవార్డు కోసం పరిశీలనకు రావడంతో ఆమెనే స్వయంగా పోటీ నుండి తప్పుకున్నారు. ఇలా వివాదాలకు అతీతంగా వ్యవహరించడంలో ఆమె నిరాడంబరత్వం, కీర్తి విముఖత్వం మనకు అవగతమవుతుంది. అయితే 1970లో పట్టమ్మాళ్‌కు సంగీత అకాడమీ "సంగీత కళానిధి" పురస్కారమిచ్చి తనను తాను గౌరవించుకుంది.

1933లో తొలి కచేరీతో మొదలు పట్టమ్మాళ్ గాత్ర కచేరీల నిమిత్తం ఆ తరువాత 50 ఏళ్లపాటు నెలలో మూడు



వారాల పాటు ప్రయాణాలు చేస్తూనే ఉండేవారు. కాని గత దశాబ్దంగా కచేరీలు తగ్గించారామె. ఆ మధ్య గణతంత్ర దినోత్సవం సందర్భంగా దూరదర్శన్ వారికి ఏ.ఆర్.రెహమాన్ స్వరపరిచిన "జాతీయ గీతం"ను ఆలపించారామె.

పట్టమ్మాళ్ సంగీతంలో మూడు ప్రధానాంశాలు గోచరిస్తాయి. క్రమశిక్షణ, పరిపూర్ణ పరిజ్ఞానం, హుందాతనం. తొలినాట దేశభక్తి గీతాలను పాడారామె. బ్రిటిష్ పాలన కాలంలో ధైర్యంగా తమిళకవి భారతియార్ రాసిన దేశభక్తి గీతాలు పాడి ప్రచారం చేశారు. ఖైదులో పెడతామనే హెచ్చరికలను ఖాతరు చేయని ధైర్యశాలి ఆమె. "శివేపాహిమామ్", "మానసగురుగుహ","అక్షయ లింగవిభో", "బ్రోవవమ్మ", "కామాక్షి లోకసాక్షి", "రామా నీపై తనకు ప్రేమ పోదు", "పరాత్పరా పరమేశ్వరా", "ఎన్నకు వరుమో శివకృప", "చెలినేనట్లు సైరింతునే", "శాంతి నిలువవేండుం" (భారతియార్‌గేయం) వంటి కీర్తనలు పట్టమ్మాళ్ స్వరంలో జీవం పోసుకున్నవి.

సంగీతాన్ని నిరంతర తపస్సుగా భావించి తన జీవితాన్ని సంగీత సాధనకు అంకితం చేసిన పట్టమ్మాళ్ సంగీతంలోని రహస్యాలను ఔపోసన పట్టారు. ఎన్నో క్లిష్టమైన రాగాలను కరతలామలకం చేసుకున్న ఆమె తనదైన విభిన్నశైలిని రూపొందించుకున్నారు. తన బాణీకి అనుగుణంగా వాగ్గేయకారుల కీర్తనలను మలుచుకున్నారు. సంగీతంలో అనితరసాధ్యమైన పల్లవి (వివిధ గతులలో ఒక పదాన్ని అనేకసార్లు పాడటం)ని సాధించారామె. భారతదేశ సాంస్కృతిక రాయబారిగా పశ్చిమజర్మనీలోని బెర్లిన్, బాన్ నగరాలు, ఫ్రాన్స్‌లోని రేనస్, స్విడ్జర్లాండ్, కెనడా యునైటెడ్ స్టేట్స్‌ల్లో పర్యటించి తన మధురగానామృతంను పాశ్చాత్యులకు పంచారు. బెర్లిన్ నగరంలో పట్టమ్మాళ్ కచేరీ విన్న తరువాత ఓ జర్మన్ వనిత అన్న ప్రశంసా వాక్యాలే ఈ వ్యాసారంభంలో వ్రాసినవి.

డి.కె.పట్టమ్మాళ్ తన సంగీత సేవలకు అందుకున్న పురస్కారాలు, సత్కారాలు అసంఖ్యాకం. 1962లోనే రాష్ట్రపతి పురస్కారం. 1971లో 'పద్మభూషణ్', 'గానసరస్వతి' బిరుదు, 1992లో కేంద్ర సంగీత నాటక అకాడమి అవార్డు 1999లో 'పద్మవిభూషణ్', మధ్యప్రదేశ్ ప్రభుత్వ 'కాళిదాస్ సమ్మాన్' పురస్కార్, వంటివి వాటిలో కొన్ని మాత్రమే.

అనుక్షణం కచేరీలు, సాధనలతో తీరిక లేకున్నా ఒక వైపు సంగీతాన్ని మరో వైపు సంసారాన్ని ఒంటి చేత్తో నడిపించిన గృహిణి పట్టమ్మాళ్. తన కుమారుడు శివకుమార్‌ను మృదంగంలో నిష్ణాతుడ్ని చేసారు. పాల్ఘాట్ మణి అయ్యర్ వంటి మృదంగ విద్వాంసుడికి వియ్యపురాలయ్యారు. ఆమె ఇల్లు ఓ సంగీత సరస్వతీనిలయం. ఉత్తమ శాస్త్రీయ సంగీతానికి రాగం దానికి తగ్గట్టుగా తాళంలో మేళవించడమే ప్రాథమిక సూత్రంగా భావించిన పట్టమ్మాళ్ 'సంగీతం, సాహిత్యాలను అర్థం చేసుకుని దానికి తగ్గ భావంతో, రాగయుక్తంతో పాడితేనే ఆ సంగీతానికి సార్థకత" అంటారు.

కర్ణాటక సంగీత ప్రపంచంలో దిగ్గంతులైన అరియకుడి రామానుజ అయ్యర్, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, ముసిరి సుబ్రమణ్యం అయ్యర్, ఎమ్మెస్ సుబ్బులక్ష్మి వంటి వారితో సరితూగ గలిగిన పట్టమ్మాళ్ చెన్నైలోని కొట్టూరుపురంలో ఉన్న తన నివాసంలో విద్యార్థులకు, మనవరాలు నిత్యశ్రీకి సంగీత పాఠాలు బోధిస్తూ గడుపుతున్నారు. నిబద్ధత గల శాస్త్రీయ సంగీత విద్వాంసురాలిగా జీవితాన్ని పండించుకున్న ఆమె పటాటోపం లేని నిరాడంబరత్వానికి నిలువెత్తు నిదర్శనం. "తుదిశ్వాస విడిచే వరకు పాడగలుగుతూ ఉండాలన్నా నా ఏకైక కోరిక. కాలం సమీపించినప్పుడు పెదవుల మీద పాటతోనే నేను వెళ్లిపోవాలి" అన్న మాటలు ఆమె కళాదాహాన్ని అభివ్యక్త పరుస్తాయి. ఇక ఆమెకు ఏదైనా అవార్డు ఇవ్వవలసి వస్తే అందుకు అర్హమైంది - "భారత రత్న" మాత్రమే.

-వి.మాలతి

సీరియల్ 4



-మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆ కంఠస్వరం వినగానే తన బామ్మ మొహం వివర్ణం కావడం గమనించింది అనన్య. జరగబోయేది తనకి తెలుసన్నట్లుగా అనన్య గబగబ పక్కగదిలోని అలమరలో వున్న అయిదారు మందు సీసాలని, టేబ్లెట్లని అందుకుని బామ్మ పడుకునే గదిలోకి వెళ్ళింది. అప్పటికే ఆవిడ తన మొహానికున్న ఫెయిర్ అండ్ లవ్‌లీని శుభ్రంగా తుడిచేసుకుని, జుట్టు రేపుకుని మంచంమీద పడుకుంది. అంతదాకా ఉత్సాహంతో ఎనర్జటిక్‌గా వున్న బామ్మ మొహంలో తెచ్చిపెట్టుకున్న నీరసం గమనించింది అనన్య.



### జరిగిన కథ

అణకువగా ఓ బామ్మ, వయసుతో సంబంధం లేని కుర్ర మనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పులలోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పని చేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజూ కట్ చేసిన ఫోటో భాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని, అతి త్వరలో అది తనకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. 'నీకు అక్క చెల్లెళ్ళు ఉన్నారా' అన్న అనన్య ప్రశ్నకు జవాబుగా జాంబవతి గురించి బామ్మ చెప్పడం మొదలు పెడుతుంది. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండటం వలన ఆమెకు వచ్చిన పెళ్ళిసంబంధాలన్నీ తప్పిపోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేక పోవటం జరుగుతూ ఉంటుంది. ఈ కథ అంతా బామ్మ చెబుతుండగా తలుపు చప్పుడవుతుంది.

"చచ్చినాడు మళ్ళీ వచ్చాడు." చెప్పింది బామ్మ. మళ్ళీడోర్ బెల్ మోగింది. కొద్దిక్షణాలాగాక మరోసారి మళ్ళీ డోర్‌బెల్ మోగి గట్టిగా వినపడిందా కంఠం.

"బామ్మగారూ. బావున్నారా?"

అనన్య వెళ్ళి తలుపు తెరిచింది. అవతల పక్క మాసిన తెల్ల లుంగీ, తెల్లజుబ్బాలో ఓ ఏభై అయిదేళ్ళతను నిలబడి వున్నాడు. బండ కళ్ళద్దాలు ధరించడం వల్ల వాటి వెనక వున్న కళ్ళు పెద్దగా కనిపిస్తున్నాయి. నుదుట గంధం బొట్టు నిలువుగా పెట్టి వుంది.

"మీరా లింగమయ్యగారూ రండి... రండి..." చిరునవ్వుతో ఆహ్వానించింది అనన్య.

"ఎలా వుంది మీ బామ్మ? బావుందా?" కుశల ప్రశ్న వేసాడు లింగమయ్య.

"అట్టే బాలేదండి. నిన్నటినించి ఒకటే దగ్గు".

"అలాగా పాపం!" టి.వి. అనౌన్సర్‌లా, వచ్చిన ఆనందంతో కూడిన చిరునవ్వుతో ఆ సింపథటిక్ డైలాగ్‌ని చెప్పాడు లింగమయ్య.

ఇద్దరూ లోపలికి దారి తీసారు.

"ఏమ్మా ఎలా వుందీ పూట?" అడిగాడు! లింగమయ్య బామ్మ దగ్గరికి వెళ్ళి.

"చావు వచ్చినా బావుండేదయ్యా. అదీ రాదాయె".

"కడుపు నొప్పి ఇంకా తగ్గలేదా?" అడిగాడు లింగమయ్య.

"లేదయ్యా. చంపేస్తోందా నెప్పి".

లింగమయ్య కాసేపు ఆవిడ కడుపు నొక్కి చూసాడు.

"రాత్రంతా దగ్గుటగా?" అడిగాడు.

అనన్య వంక మెచ్చుకోలుగా చూసి చెప్పింది బామ్మ-

"అవునయ్యా. కోరింత దగ్గులాంటి దగ్గు వచ్చిపడింది."

"బి.పి. ఎంతుంది?"

"ఒన్ సెవెంటీ బై ఒన్‌ట్వంటీ".

"చ్చొ... చ్చొ.... చ్చొ.... బ్లడ్ ప్రెషర్ ఎక్కువైన కొద్దీ హార్ట్ మీద ప్రెషర్ ఎక్కువై ప్రమాదం.... మందు వాడడం లేదా?" అడిగాడు.

ఆవిడ అనన్య వంక చూసి కన్ను గీటింది చెప్పమన్నట్లుగా.

"లేదండి. మందేం చేస్తుందే పిచ్చితల్లీ అని నూట ఎనిమిదిసార్లు లింగాష్టకం చదివింది" చెప్పింది అనన్య.

"అదేం పని బామ్మగారూ. లింగాష్టకం బి.పి.కి మందా ఏమిటి?" లింగమయ్య ఆనందంగా ప్రశ్నించాడు.

"కాదా? మందులు బొందకి. ఈ బొందని సృష్టించింది. దీన్ని తీసుకెళ్ళేది ఆ పరమశివుడేకదయ్యా. ఆయన్ని ప్రార్థిస్తే, అన్నీ సర్దుబాటు చేస్తాడు."

"చ్చొ.... చ్చొ... చ్చొ.... మీరు ఈ కాలానికి చెందిన వారు కాదు బామ్మగారూ, పద్యాలు శ్లోకాలు మందులా పని జేయవుగదండీ అంటే వినిపించుకోరే?"

"శివాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదంటారు కదా. కాబట్టి బి.పి. పెరిగినా, సుగర్ కౌంట్ హెచ్చినా, గ్లాండ్స్ సరిగ్గా పని చేయకపోయినా లింగాష్టకం చదువుకుంటే, అన్నీ బాగవుతాయి నాకు. ఈ మందులు ఊరికే అలంకారానికి కాని ఇవి వాడతానా పెడతానా".

"మీరు ఆరోగ్యాన్ని నెగ్లెక్ట్ చేయకూడదు బామ్మగారు. ఇప్పుడు మీ వయసెంత?"

".... సరిగ్గా చెప్పాలంటే ఎనభై ఏడు".

"ఇంకో పదమూడేళ్ళు గిర్రున తిరిగితే వంద పూర్తవుతాయి. నా మాట విని మీరు మందులు శ్రద్ధగా వాడుతుంటేనే అంతా సవ్యంగా వుండేది".

'ఆవిడ వందేళ్ళు బ్రతికితే' అనే బాధ ధ్వనించింది అతని మొహంలో, కంఠంలో కూడా!

"నా బొంద. అంత ఆయుర్దాయం నాకెందుకయ్యా? నీలాంటి పెళ్ళయిన వాళ్ళకి కావాలి గాని" నిరుత్సాహంగా చెప్పింది బామ్మ.

"దగ్గు తగ్గినట్లుందే?" ప్రశ్నించాడు లింగమయ్య.

"ఆహా. నిక్షేపంగా తగ్గింది" చెప్పిందావిడ.

"దగ్గాగక పోతే తెల్లారు ఝామున లేచి లలితా సహస్రనామం పదకొండు సార్లు చదివింది బామ్మ. దాంతో దగ్గు తగ్గింది." చెప్పింది అనన్య. చెప్పాక బామ్మ వంక చూసింది. అనన్య ఊహించి నట్లుగానే బామ్మ మెచ్చుకోలుగా చూసింది అనన్యవంక.

"ఏది ఏమైనా మీరు ఆరోగ్యం విషయంలో కాసింత జాగ్రత్తగా వుండాలి బామ్మగారు" చెప్పాడు లింగమయ్య ఆవిడ నాడి చూస్తూ.

"ఇప్పుడిప్పుడే ఆగదు లేవయ్యా ఈ పాడు నాడి. నాకేమో పోవాలనుంది. కాని ఆ పైవాడి పిలుపే ఇంకా రాలేదయ్యా".

"వస్తుందిలే బామ్మ" చెప్పింది అనన్య.

"ఎప్పుడు? ఎప్పుడని నా ప్రశ్న. ఇప్పటికి ఏభైఏళ్ళుగా 'ఇదిగో ఇవాళ, ఇదిగో ఇప్పుడే' అనుకుంటూనే వున్నానా? ఇంతదాకా వచ్చిందా? అది రావాలనే నా తపనంతా".

"మీరు ఊరికే ఇదవకండి. వస్తుందిలెండి, ఎప్పుడో ఏ క్షణం లోనో" చెప్పాడు లింగమయ్య ఆవిడ కళ్ళని కిందకి లాగి చూస్తూ.

"రోజూ నేను పడుకోబోయే ముందు ఆ సదాశివుడ్ని అడుగుతాను, రేపు బామ్మ లేవకుండా చేయవయ్యా అని. కాని బామ్మకి మర్నాడు మెలకువ వస్తూంటుంది" చెప్పింది అనన్య.

"రాగానే, ఓ మూడు కళ్ళవాడా, ఈ రోజు నన్నో కంటకనిపెట్టి రాత్రి నిద్రపోయేలోగా శాశ్వత నిద్ర ప్రసాదించవయ్యా' అని ప్రార్థించి మరీ మంచం దిగుతాను. ఊహు.... పై నించి పిలుపురాదు నాకు".

"వస్తుంది లెండి. మీరు ఊరికే ఇదవకండి." కొద్దిగా ఏడుపుగొంతుతో చెప్పాడు లింగమయ్య.

"అదేం ఖర్మో నాకు తెలిసిన వాళ్ళంతా నా కళ్ళ ముందే పోతున్నారు. నాకు వచ్చిచావదు ఆ దిక్కుమాలిన చావు".

"వెనక, ముందు అందరం ఏదో ఓ రోజు పోయే వాళ్ళమే గదా బామ్మా" చెప్పింది అనన్య బామ్మ నుదుటి మీద ఆప్యాయంగా నిమురుతూ.

"ఆ వెనక ముందులోనే తేడా వుందని ఊరికే ఇదవుతున్నానే. ఏం చేస్తాం? ఎవరికెంత ఆయుష్షుంటే అంత కాలం చచ్చినట్లు బ్రతకాల్సిందిగా".

"మంచిమాటన్నారు" చెప్పాడు లింగమయ్య.



"మీ అన్నయ్య పిల్లలు ఎలా వున్నారు?" టాపిక్ మార్చాలని అడిగింది బామ్మ.

"కులాసాగానే వున్నారు. ఈ మధ్యే వాళ్ళ ఇంటాయన ఇంటద్దె పెంచాడట".

"అలాగా? పాపం! మీ ఇంటద్దె కూడా క్రితం నెలే పెంచినట్లున్నారు?" ప్రశ్నించిందావిడ.

"అవును బామ్మగారు. నూట పదిహేడు రూపాయలు పెంచాడు. స్వంతిల్లు అనే భోగం కూడా ఓ రాత" చిన్నగా నిట్టూర్చాడు లింగమయ్య.

"ఊరికే ఇదవ్వకు లింగమయ్యా. త్వరలో మీరంతా మీ సొంతింట్లోకి ప్రవేశించాలని ఆ మల్లికార్జునుడ్ని నిత్యం వేడుకుంటున్నానంటే నమ్ము".

"అమ్మమ్మ! ఎంతమాట! నాకలాంటి వుద్దేశం లేదు సుమండీ".

"నీకున్నా లేకపోయినా నాకుంది కదా లింగమయ్యా".

"సరే వెళ్ళొస్తాను బామ్మ గారు. ఊరికే ఎలా వున్నారో చూసి పోదామని వచ్చాను" రెండు జామకాయలు గల ప్లాస్టిక్ కవర్ మందుల బల్ల మీద పెట్టి చెప్పాడు.

"మా దొడ్లో కాసాయ్ బామ్మగారు. దగ్గు తగ్గాక మీరు ఒకటి తినండి".

"కూర్చో లింగమయ్య. ఏమిసేతురాలింగా' పాడతాను విందువుగాని".

"అదేం! మళ్ళీ గుండె నొప్పిగా వుందా బామ్మ?" ప్రశ్నించింది అనన్య.

"అవునమ్మా" అని జవాబుచెప్పి లింగమయ్యతో.

"నిజంగా గుండాగిపోతుందా అన్నభయం కలిగించేంత నొప్పి, కాని అది గేస్ నొప్పని డాక్టర్ చెప్పాడు. గేస్ పైకి తన్ని గుండెని అదిమితే అలాంటి నొప్పి వస్తుందిట" అంది.

"నాకు మీ పాట వినాలనే వుంది. కాని వెళ్ళాలి బామ్మగారు. ఆఫీస్‌నించి ఇంటికి వెళుతూ చూసిపోదామని వచ్చాను".

"దారి కదానా? ఇవాల్టికి కుదురుగానే వుండేట్లుంది ఆరోగ్యం. మీ అన్నాయ్ పిల్లలిద్దర్ని ఓ సారి రమ్మని చెప్పు. వాళ్ళనెప్పుడో చూసాను".

"ఎలా వస్తారు బామ్మగారూ! మీరే చెప్పండి. రాకూడదు కదా" చెప్పాడూ లింగమయ్యా.

"అవునవును. మర్చేపోయాను".

"కాస్తంత జాగ్రత్తగా చూసుకోండి ఆరోగ్యం. మందులు వేసుకుంటూండండి. ఫెర్రంఫాస్ సిక్స్ ఎక్స్ పూటకి నాలుగైదు చొప్పున వేసుకుంటే, ఆ నీరసం తగ్గుతుంది. మీకేమో ఇంగ్లీషు మందులు తప్ప నా హోమియో వైద్యం పడదు"

"చెప్పద్దు. నువ్వు నక్స్‌వామికా అనే మందిచ్చిన ప్పట్నించి హోమియో మందంటేనే భయం లింగమయ్యా".

లింగమయ్య లేచి బయటికి నడిచాడు. అనన్య అతని వెనకే దారి తీసింది. అతను బయట వున్న సైకిల్ ఎక్కి వెళ్ళాక తలుపు మూసి బామ్మ గదిలోకి వచ్చింది.

"పీడ విరగడయ్యాడా?" అడిగింది బామ్మ.

"వెళ్ళాడు".

"థాంక్‌గాడ్" అని బామ్మ మంచం మీద లేచి కూర్చుని చెదిరిన జుట్టుని చేత్తో సరిచేసుకో సాగింది.

"ఇవాళైనా చెప్తావా బామ్మా నాకు ఈ లింగమయ్య కథ?" ఆసక్తిగా అడిగింది అనన్య.

"ఏముందే చెప్పడానికి? ఆ అద్దం దువ్వెన ఇటివ్వు".

"ఇవ్వను. ఈ లింగమయ్య రాగానే ఎందుకు నువ్విలా పేషెంటులా నటిస్తావు? నీ ఆరోగ్యం బావుండాలని నోటితో చెప్తూన్న అతనికి మనసులో నువ్వు చావాలని ఎందుకుంది? అతని అన్న పిల్లలెవరు? వాళ్ళు మనింటికి ఎందుకు రాకూడదు? ఈ బేతాళ ప్రశ్నలకి నాకింతదాకా జవాబులు తెలీవు. ఇవాళైనా చెప్పు బామ్మ".

"చెప్పొకదుటే, అవన్నీ చెప్పకూడదని".

"ఎందుకు చెప్పకూడదు?"

"సమ...."

"......యం వచ్చినప్పుడు చెప్తానంటే, కుదరదివాళ. నువ్వు చెప్పాల్సిందే, నేను వినాల్సిందే బామ్మా".

"ఇవాళ మూడ్ లేదు. ఇంకోసారి".

"అదేం కుదరదు. ఇప్పుడు నువ్వు నాకు చెప్పాలిందే. " మొండిగా చెప్పింది అనన్య.

"నాట్ నౌ అన్నానా?".

"పోనీ కొంచెం చెప్పు బామ్మ. డైలీ టీ.వి. సీరియల్‌లో లాగా" బతిమాలింది.

"అచ్చం టి.వి. డైలీ సీరియల్‌లో లానేనా?" నవ్వుతూ అడిగింది బామ్మ.

"అవును. ట్వంటీత్రీ మినిట్స్ దాకా చెప్పు".

బామ్మ కొద్ది క్షణాలు నవ్వుతూ కళ్ళు మూసుకుంది.

"ఎందుకు నవ్వుతున్నావు? చెప్పకుండా ఏదైనా ట్రిక్ వేస్తున్నావా?" అనుమానంగా అడిగింది అనన్య.

"లేదే. గుర్తు తెచ్చుకుంటున్నాను. నిన్నా? ఇవాళా? ఏభై ఏళ్ళక్రితం సంగతి కదా".

"చెప్పుబామ్మ. ప్లీజ్ ఎప్పటిలా దాటేయొద్దు" సిన్సియర్‌గా అర్థించింది అనన్య.

"సరే కొంచెమే చెప్తా నివాళ. అతని పేరు గ్రామం. అతనితో మొదలవుతుందీ కథ".

"గ్రామం? అదేం పేరతనికి?" అడిగింది అనన్య అడ్డుపడి.

"అతని అసలు పేరు జి.రామం. ఇంగ్లీష్‌లో రాస్తే, జి ఫుల్‌స్టాప్ ఆర్ ఏయం ఏయం.... అతని ఇనీషియల్ పక్కన వున్న చుక్కని కొట్టేసి అతన్నంతా గ్రామం అని పిలుస్తుండే వారు".

"ఓ.... అతను నీకేమవుతాడు బామ్మ?"

"సంగీతం మాస్టారు".

"సరే చెప్పు".

"ఇప్పుడు చిన్న బ్రేక్. రైల్వే స్టేషన్‌కి ఎదురుగా నగరానికి వంద కిలోమీటర్ల దూరంలో ఏభై చదరపు గజాల ఇల్లు అద్దెకివ్వబడును. బాత్ రూం రైల్వేస్టేషన్‌లో కలదు. టింగ్ టింగ్ టింగ్.... మా కేశ తైలం ఉపయోగించి మీ జుత్తును వంకీలుగా తిప్పుకోండి. అవి తిరగకపోతే, మా షాపు చుట్టూ తిరగండి. డింగ్ డాంగ్ డింగ్. చెవిటి మిషన్ పెట్టుకున్న యువతికి చత్వారం జోడు గల వరుడు కావలెను... డింగ్ డాంగ్ డింగ్".

"ఏయ్ బామ్మ. ఏమిటివి?" అడిగింది అనన్య.

"ప్రకటనలు. స్పాన్సరర్స్ ప్రకటనలు లేని టి.వి సీరియల్ వుండదు కదా... అలాగే నే చెప్పే



ఈ డైలీ సీరియల్‌ని స్పాన్సర్స్ వాళ్లు... వంద రూపాయల నగదు బహుమతి పొందండి. పోయిన మా ఏభై వేల చంద్రహారం వెదికి అప్పగించండి. వివరాలకు...."

"బామ్మా..."

"నువ్వేకదే. టీ.వీ. డెయిలీ సీరియల్‌లా చెప్పమంది. అలాగే చెప్తున్నాను... షార్ట్‌హాండ్ తెలిసిన మగ సెక్రటరీ కావలెను. యువకు(తు)లకి ఆ నిబంధన వర్తించదు. లేడీస్ హాస్టల్‌లో వారంలో మూడు రోజులు ఉతుకుటకు అనుభవజ్ఞులైన డ్రైక్లీనర్స్ కావలెను. వెంటనే సంప్రదించండి..."

"అబ్బబ్బ బామ్మ. స్టాపిట్ ఐసే. ప్రకటనలు ఆపి విషయంలోకి రా బామ్మ".

"ఏదీ. ప్రకటనల టైంకి ఇంకొకటి వుంది కదే. అన్నీ ఫిలప్ కాకపోతే, టి.వి.సీరియల్ గిట్టుబాటు కాక మధ్యలో ఆపేయాలి.... ఆల్సేషియన్ డాగ్ అమ్మకానికి ఉంది. భయపడక బిస్కెట్లతో రండి... అమ్మయ్య. ప్రకటనలు పూర్తయ్యాయి. ఇక సీరియల్ టైంలోకి వద్దాం. అతని పేరు గ్రామం. అతనితో మొదలవుతుందీ కథ. అసలు పేరు జి.రామం. ఇంగ్లీష్‌లో రాస్తే..."

"ఇదంతా ఇందాక చెప్పావు బామ్మ" అడ్డుపడింది అనన్య.

"ప్రకటనల తర్వాత ముందు జరిగింది రీవైండ్ చేస్తారు కదా, టీ.వీ. సీరియల్స్‌కి. ఆ పద్ధతిలో వచ్చానన్నమాట".

"ఎందుకు విసిగిస్తావ్ బామ్మా. అతను నీ సంగీతం మాస్టారు. తర్వాత?" చిరాగ్గా అడిగింది అనన్య.

"ఆయన అమూల్యమైన సలహానిచ్చారు నాకు"

అనన్య అసక్తిగా వింటోంది.

"...."

అనన్య తన బామ్మ చెప్పేదాని కోసం శ్రద్ధగా చూస్తోంది.

"....."

"మాట్లాడవే బామ్మా?"

"....."

"నిన్నే బామ్మా. చెప్పు".

"టీ.వీలో కరెంట్ పోతే ఏమౌతుంది? సీరియల్ మిస్ అవుతాం. అలాగే ఇప్పుడు ఇక్కడ కరెంట్ పోయిందన్న మాట. మళ్ళీ అది వచ్చేసరికి ఈ డైలీ సీరియల్ టైం అయిపోతుందన్నమాట".

"అంటే ఆ తర్వాతది చెప్పనంటావు!"

"మళ్ళీ రేపు ఈ టైంకే ఇక్కడే కలుసుకుందాం. మా చిరునామా...."

అనన్య దిగులుగా చూస్తూ అడిగింది.

"ఎందుకు బామ్మా. నానించి ఏదీ దాచని నువ్వు ఈ ఒక్క విషయం మాత్రం చెప్పకుండా దాటేస్తుంటావు?"

"సమ....యం వచ్చినప్పుడు చెప్తాలేవే పిల్లా"

"అదెప్పుడు వస్తుంది?"

"త్వరలోనే"

"...అని నమ్మమంటావు".

బామ్మ అనన్య జుట్టు నిమురుతూ చెప్పింది.

"పిచ్చిపిల్లా. నీకు చెప్పకపోతే ఎలా? అందరికన్నా ముందు నీకే తెలియాలది. నేనే చెప్పాలనుకుంటున్నాను. త్వరలో అంతా చెప్తాగా. ఇదవ్వకు"

"అప్పటిదాకా నాకు సస్పెన్సా?"

"అవును".

"ఆ లింగమయ్యని కూడా రెండు మూడుసార్లు అడిగాను. చెప్తేనా?"

"ఎందుకు చెప్తాడు? చెప్తే అతనే నష్టపోయేది. అందుకని చెప్పడు. తొందరపడకు. నింపాదిగా నేనే నీకు ఆ విషయమంతా చెప్తాను. అలా ఆబిడ్స్‌దాకా వెళ్ళొద్దాం పద"

"ఏం?"

"బాంబే పావ్‌భాజీ తినొద్దాం.... డింగ్ డాంగ్ డింగ్ ఉంగరం ఆర్డర్‌తోపాటు సైజ్‌కోసం మీ వేలుని కూడా పంపండి. డింగ్ డాంగ్ డింగ్".

****

లింగమయ్య బామ్మగారింటి నించి సరాసరి సైకిల్ మీద తన ఇంటికి చేరుకున్నాడు. సైకిల్‌ని గోడకి ఆనించి కిటికీకున్న ఇనుప చైన్‌ని సైకిల్ చక్రంలోంచి దూర్చి దానికి తాళం వేసి లోపలకి వెళ్ళాడు. లింగమయ్య భార్య అతన్ని చూసి టీ.వీ. సౌండ్ తగ్గించి మొటమొటలాడుతున్న భర్త మొహం వంక చూసి అడిగింది.

"ఏమిటలా వున్నారు?".

"ఏమిటా! నీ శ్రాద్ధం"

"అదేమిటండీ? నేనేం చేసాను. నా మీద అరుస్తారు?"

"నీ మీదెందుకు అరుస్తానే. నీ మూతి పళ్ళురాలగొట్టా. నా కోపం నీ మీదకాదే కొండముచ్చు మొహం దానా".

"బామ్మ గారింటికి వెళ్ళి వస్తున్నారా?" అడిగింది వెంటనే.

"అవునే అప్రాచ్యపు పీనుగా".

"అదీ సంగతి. నాకు చటుక్కున గుర్తు రాలేదు. బామ్మగారు బావున్నారా?"

"గుండ్రాయిలా వుందే నీ మొహం ఈడ్చా".

"నిన్నో మొన్నో ఆవిడ కండిషన్ సీరియస్‌గా వుందన్నారు?"

"శ్రీ వెంకటేశ్వర గోవింద నామావళి నూట పదహారు సార్లు చదివిందిట. దాంతో యముడు తన భటులని వెనక్కి పిలిపించేసాడు".

"ఇవ్వాళ ఎలా వుంది ఆవిడ ఆరోగ్యం?"

"ఇవాళే కాదు. నేను చచ్చేదాకా పోదు. అసలు ఆవిడ పోనే పోదే..." భార్యని తిట్టడానికి తిట్లకోసం వెదుకుతూ ఆగిపోయాడు లింగమయ్య. అతను స్వతహాగా సాత్వికుడు. బయట ఎవరిముందూ నోరు పారేసుకోడు. ఎవరి మీదైనా కోపం వస్తే దాన్ని భార్యముందు ప్రదర్శించి నార్మల్‌కి వస్తూంటాడు. వారి ఇరవై ఎనిమిదేళ్ళ వైవాహిక జీవితంలో అది సర్వసాధారణం కాబట్టి ఆవిడ కూడా భర్త తనని కారణం లేకుండా తిడితే పట్టించుకోదు. కారణం వుంటే, లింగమయ్య ఆవిడని బాహాటంగా చస్తే తిట్టడు. గోడవతలకి వెళ్ళి గోడనే తిడతాడు. డైరెక్ట్‌గా ఆవిడ్నే తిడితే కొడుతుంది.

-(ఇంకావుంది)



# లలిత సంగీతం

## ఒక పిలుపులో పిలిచితే పలుకుతావట....



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప । ఒక పిలుపులో పిలిచితే పలుకుతావట నా
పలుకులో కులుకుతావట
ఆపద మ్రొక్కుల సామీ
నీ సన్నిధె నా పెన్నిధి

1. చ. । కొండంత దేవుడవని కొండంత ఆశతో నీ
కొండ చేరవచ్చితిని అండ చేర్చికాపాడరా ॥ఒక పిలుపులో॥

2. చ. । అభయహస్తమున్నదట అభయమూర్తినీవెయట
అభయదానమిచ్చినాకు భవతరణ పథమ్ముచూపు
॥ఒక పిలుపులో॥

3. చ. । వడ్డికాసువాడవట వడ్డివడ్డి గుంజుదువట
అసలు లేనివారమయ్య వెతలు బాపి కావవయ్య
॥ఒక పిలుపులో॥

రచన : కీ॥శే॥ ఏడిద కామేశ్వరరావు
గానం : కీ॥శే॥కుమారి శ్రీరంగం గోపాలరత్నం

| | | |
|---|---|---|
| రాగం : | మోహన<br>28వ మేళకర్త హరికాంభోజి<br>రాగం యొక్క జన్యరాగం | రాగ్: భూపాలి<br>- హిందుస్తాని సంగీతం |
| తాళం : | త్రిశ్రగతి<br>(కర్ణాటక సంగీతం) | - దాద్రా<br>(హిందుస్తాని సంగీతం) |

ఆరోహణ : స రి గ ప ద స
అవరోహణ : స ద ప గ రి స

షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, పంచమం, చతుశృతి దైవతం - యీ రాగంలోని స్వరాలు.

ప్రాచీనమైన యీ మోహనరాగం ఎక్కువగా వాడుకలోనున్న ప్రసిద్ధ రాగాలలో ఒకటి.

అన్యస్వరమైన కాకలినిషాదం యీ రాగంలో చేర్చబడి బాణీ కూర్చడం జరిగింది. ఈ గీతానికి నేపథ్య సంగీతంలో (Interlude music)లో శుద్ధ మధ్యమం కూడా ఉపయోగించబడింది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు సుమారు 30 సంవత్సరాల క్రితం నిర్మించిన డాక్యుమెంటరీ చిత్రం "శ్రీ వేంకటేశ్వర వైభవమ్"లో యీ పాటను గోపాలరత్నం మృదుమధురంగా గానం చేశారు. గీత రచయిత కామేశ్వరరావు గారు తిరుమలేశుని మనసారా స్తుతించిన యీ గేయం అంతకు ముందే ఆకాశవాణిలో చాలాసార్లు ప్రసారమై జనాదరణ పొందింది.

హిందుస్తాని సంగీతంలో కూడా యీ రాగం చాలా ప్రసిద్ధమైనదే. ప్రఖ్యాత హిందీ సినిమా దర్శకుడు వి.శాంతారాం 1950 ప్రాంతంలో "అమర్ భూపాలి" అనే మరాఠీ చిత్రాన్ని నిర్మించారు. అందులో భూపాలి అని పిలువబడే యీ రాగంలో "ఘన శ్యామసుందరా శ్రీధరా" అనే గీతానికి మహారాష్ట్రలో గల ప్రాముఖ్యతను, విశిష్టతనూ అద్భుతమైన విధంగా తెలిపారు. గానకోకిల లతా మంగేష్కర్, పండిత్‌రావ్‌నాగర్‌కర్‌ల గాత్రాలలో ఆ పాట "థీమ్‌సాంగ్" (Theme Song) గా ప్రదర్శితమౌతూ ఎంతటి వారినైనా సమ్మోహితులను గావించే రీతిలో స్వరకర్త

వసంత్‌దేశాయి చేత తీర్చిదిద్దబడింది. మరాఠీ భాషా చిత్రమైనా భారతదేశమంతటా దిగ్విజయంగా ఆడి జనాలను ఉర్రూతలూగించిందంటే ఏ మాత్రం అతిశయం కాదు. అజరామరంగా నిలిచిపోయే యీ పాటకు ఎంతో ప్రభావితులై హిందీ, తెలుగు, తమిళ భాషా చిత్రాలలో సైతం అనేక సుమధుర గీతాలను సృష్టించారు స్వరకర్తలు.

## కుమారి శ్రీరంగం గోపాలరత్నం





మధురగాయని, గంధర్వ కళానిధి, సంగీత సామ్రాజ్ఞి, యిత్యాది అన్వర్థమైన అనేక బిరుదులు, అపారమైన కీర్తి ఆర్జించుకున్న కుమారి గోపాలరత్నం గడచిన శతాబ్దిలో తెలుగుదేశంలోని కర్ణాటక సంగీత విదుషీమణులలో మేలుబంతి అని చెప్పవచ్చు.

విజయనగరం జిల్లా పుష్పగిరిలో 1939లో జన్మించిన గోపాలరత్నం తన సంగీత అక్షరాభ్యాసం కవిరాయని జోగారావు గారి వద్ద ప్రారంభించారు. 9వ ఏటనే పాడటం ప్రారంభించిన యీమె ఆ తరువాత ప్రముఖ విద్వాంసులు డా॥ శ్రీపాద పినాకపాణి గారి వద్ద సంగీత శాస్త్రసారం ఆకళింపు చేసుకున్నారు. అద్భుతమైన గాత్రం, అసమాన ప్రతిభతోడైన యీ గాయని తనదైనశైలితో ఆంధ్రదేశంలోనే కాక, దేశ విదేశాలలో సైతం కచేరీలు చేసి మెప్పుపొందారు. ఈమె సోదరుడు శ్రీ గోవిందాచారి కూడా సుప్రసిద్ధ శాస్త్రీయ, లలిత సంగీత గాయకుడు. ఆకాశవాణిలో ఆస్థాన విద్వాంసుడుగా పని చేశారు.

విజయవాడ ఆకాశవాణిలో దాదాపు రెండు దశాబ్దాలు నిలయ విద్వాంసురాలుగా ఉద్యోగం చేశారు. లలిత గీతాలు, లలిత శాస్త్రీయ గీతాలు, అన్నమాచార్యకీర్తనలు స్వరపరచిగానం చేశారు. అనేకమంది స్వరకర్తల బాణీలను శ్రావ్యంగా గానం చేశారు. ఎన్నో సంగీత రూపకాలకు, యక్షగానాలకు తమ గళంతో రక్తిగూర్చారు. కూచిపూడి వారి "భామాకలాపం", కృష్ణశాస్త్రి గారి యక్ష గానాలు మున్నగు వాటిని, "ఓయి తుమ్మెదా", "మురళీధరుని మోహనగానము", "మనప్రేమ", "కనిపించునా గతము', మొదలగు లలిత గీతాలను, నండూరి సుబ్బారావు గారి ఎంకి పాటలను, "కస్తూరి రంగయ్య" వంటి లలిత శాస్త్రీయ రచనలను కమనీయంగా పాడారు. బి.గోపాలం సంగీత దర్శకత్వంలో "బికారి రాముడు" చిత్రంలో "నిదురమ్మా కదలీ వేగమె రావమ్మా" అనే పాటను గోపాలరత్నం పాడగా ఆ గీతం చాలా పాప్యులర్ అయింది.

1977 నుండి హైదరాబాదు ప్రభుత్వ సంగీత, నృత్యకళాశాల ప్రిన్సిపాల్‌గా పని చేశారు. 1989లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలోని మహిళా కార్యక్రమ విభాగానికి డా॥ ఎం. పద్మినీదేవి రచించిన "యక్షగృహిణి" సంగీత రూపకంలో నా స్వరరచనలను ఆమె అత్యంత శ్రావ్యంగా పాడారు. భారత ప్రభుత్వం వారు ఆమెను "పద్మశ్రీ" బిరుదుతో సత్కరించారు.

1992లో స్థానిక ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియంలో ఆహూతుల సమక్షంలో హైదరాబాదు ఆకాశవాణి నిర్వహించిన లలిత సంగీత కార్యక్రమంలో గోపాలరత్నం కొన్ని పాటలు పాడారు. ఆకాశవాణిలో టాప్‌గ్రేడ్ సంగీత విదుషిగా పేరొందిన కుమారి గోపాలరత్నం 1993లో 54వ ఏట దివంగతులైనారు. ఆమె అకాల మరణం సంగీతలోకాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. సంగీత 'రత్న' మైన గోపాలరత్నం జీవితం యింత అర్థాంతరంగా ముగియడం అత్యంత విచారకరం.

# ఏడిద కామేశ్వరరావు

తూర్పుగోదావరి జిల్లా, రామచంద్రాపురం తాలూకా ఏడిద గ్రామం శ్రీ కామేశ్వరరావుగారి జన్మస్థలం. వేంకట రాజ్యలక్ష్మి, కొండల రాయుడుగార్లకు 1914 సం॥ సెప్టెంబరు 12వ తేదీ జన్మించారు.



పదేళ్ళ వయస్సునుండే పాటలు రాసి పాడటం, నాటకాలు రాసి ఆడించడం చేస్తుండేవారు.

1930 సం॥లో స్వతంత్రోద్యమంలో పాల్గొని లాఠీ దెబ్బలు, జైలు శిక్ష అనుభవించారు. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారికి కార్యదర్శిగా పని చేశారు. ప్రకాశం పంతులుగారు నడిపిన 'స్వరాజ్య' పత్రికకు సహాయ సంపాదకుడిగా పత్రికా రంగంలో అడుగుపెట్టారు. ఆ తరువాత గృహలక్ష్మి మాసపత్రికలో, ప్రజామిత్ర వార పత్రికలో ప్రధాన సంపాదకుడిగా పని చేశారు.

1936నుండి అప్పుడప్పుడు మద్రాసు కేంద్రం నుండి పిల్లల కార్యక్రమాలు సమర్పించేవారు. 1949లో విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పిల్లల కార్యక్రమ ప్రయోక్తగా ఉద్యోగంలో చేరారు. వారం వారం పిల్లల కార్యక్రమాలు నిర్వహిస్తూ రేడియో అన్నయ్యగా వందల కొలది పాటలు, నాటికలు, రూపకాలు ఇంకా ఎన్నోరచనలు చేశారు. "ఒక పిలుపులో పిలిచితే" అనే వేంకటేశ్వరుని ఉద్దేశించి ఈ పాటను రాశారు.

కామేశ్వరరావుగారు పిల్లల వికాసం కోసం బాల సంఘాలు స్థాపించారు. బాలభారతీ విద్యాలయం అనే స్కూలు నడిపారు. ఈయన రచనలు బాలభారతి, పాలవెల్లి (బాలల గేయాలు) రంగబాల (బాలల నాటికలు) ఒప్పులకుప్ప (నృత్యనాటికలు) బొమ్మల కొలువు (కథాకదంబం) అల్లూరి సీతారామరాజు చరిత్ర ప్రచురితమైనాయి. ఆకాశవాణిలో పదవీ విరమణ చేసిన తరువాత హైదరాబాదు బాలల అకాడమీలో 'బాల చంద్రిక'కు ఎడిటర్‌గా పనిచేశారు. బాలల అకాడమీ తరపున ఎన్నో పుస్తకాలు ప్రచురించారు. పిల్లల కోసం ఎన్నో ఆడియో కేసెట్లు వెలువరించారు.

'బాలకళాభారతి' లాంటి ఎన్నో బిరుదులు, ఎన్నో సంస్థలచే, ప్రభుత్వం చేత అనేక సన్మానాలు పొందిన శ్రీ ఏడిద కామేశ్వరరావు గారు తమ జీవితమంతా పిల్లల కోసమే వెచ్చించారంటే అతిశయోక్తి కాదు. బాలల అకాడమీలో కామేశ్వరరావుగారు పప్పెట్రీ (తోలు బొమ్మలాట)కి కూడా సముచిత స్థానం కల్పించి అభివృద్ధి చేశారు. బాలల అభ్యున్నతికోసమే తన జీవిత కాలాన్ని వెచ్చించి ఆదర్శప్రాయంగా నిలిచిన కామేశ్వరరావు గారు 1995లో దివంగతులైనారు.

## మోహనరాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఎవరివో ఎచటనుంటివో | చంద్రహారం | ఘంటసాల | ఘంటసాల |
| 2. | మధురమధురమీ చల్లనిరేయి | విప్రనారాయణ | ఎ.ఎం.రాజా, భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | ఈనాటి యీ హాయి | జయసింహ | ఘంటసాల, లీల | టి.వి.రాజు |
| 4. | ఎంతహాయి యీరేయి | గుండమ్మకథ | ఘంటసాల, సుశీల | ఘంటసాల |
| 5. | తెల్లవారవచ్చెతెలియగనాసామి | చిరంజీవులు | పి.లీల | ఘంటసాల |
| 6. | లాహిరిలాహిరిలాహిరిలో | మాయాబజార్ | ఘంటసాల, లీల | ఘంటసాల |
| 7. | మదిలో వీణలు మ్రోగె | ఆత్మీయులు | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 8. | తెలుసుకొనవె యువతీ | మిస్సమ్మ | ఎ.ఎం.రాజా | ఎస్.రాజేశ్వరరావు |
| 9. | పులకించనిమది పులకించు | పెళ్ళికానుక | జిక్కి | ఎ.ఎం.రాజా |
| 10. | తిరుమలమందిరసుందరా | మేనకోడలు | సుశీల/ఘంటసాల | ఘంటసాల |
| 11. | ఇదిచల్లనివేళైనా | పూజాఫలం | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 12. | మధురమీసుధాగానం | బృందావనం | బాలు, జానకి | మాధవపెద్ది సురేష్ |
| 13. | నిన్నుకోరి వర్ణం | ఘర్షణ | వాణీజయరాం | ఇళయరాజా |
| 14. | చిన్నదానా ఓసి చిన్నదానా | ప్రేమలేఖ | కృష్ణరాజ్, భువనచంద్ర | దేవా |
| 15. | తూనీగా తూనీగా | మనసంతానువ్వే | ఉష, సంజీవిని | ఆర్.పి.పట్నాయక్ |

**ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్ ఇది.**

# మటాష్

# M. A. T. A. S. H.

**-రాజా**



**మహేంద్రనాథ్ నిలబడి టేబుల్ మీద ఉన్న అయిటమ్స్‌తో ఏదో మాజిక్ చేస్తూ ఉంటాడు. వెనక మహేంద్రనాథ్ CIGAM అని రాసి ఉంటుంది.**

మహే: అబ్రకదబ్ర అబ్రకదబ్ర అబ్రకదబ్ర
(వెనకనుంచి పట్టార్కర్ చేతిలో కాలింగ్ బెల్ పట్టుకొని నొక్కుతాడు)

మహే: ఎవరది... ఈ టైమ్‌లో డిస్టర్బ్ చేస్తోందీ?
(బయటికి వెళ్ళి తలుపు దగ్గరకి వస్తాడు, తెరిచే ఉంటాయి)
అరె తలుపులు తెరిచే ఉన్నాయే... మరి బెల్లెవరు కొట్టారబ్బా?
(పక్కనుంచి పట్టార్కర్ వస్తాడు)

పట్టా: నేనేనండి

మహే: ఎవర్నువ్వు

పట్టా: పట్టార్కర్‌ని అండి

మహే: పట్టార్కరా...! అదేం పేరు?

పట్టా: దానికో చిన్న హిస్టరీ ఉందిలెండి...

మహే: హిస్టరీ సంగతి తర్వాత! ముందీ మిస్టరీ గురించి చెప్పు... లోపలకి ఎలావచ్చావు ...? ఎందుకొచ్చావు...? వచ్చినవాడివి నన్ను డైరెక్ట్‌గా కలవకుండా అక్కడెందుకెళ్ళి దొంగలా దాక్కున్నావు... దాక్కున్నవాడివి ఏదో ఒకటి పట్టుకుపోకుండా కాలింగ్ బెల్ ఎందుకు నొక్కావు... నన్ను డిస్టర్బ్ ఎందుకు చేశావ్ చెప్పు..?

పట్టా: ప్రతి ప్రశ్న సప్లిమెంట్ ప్రశ్నతో సహా ఎలా సమాధానం చెప్పాలి సార్...

మహే: సప్లిమెంటు జవాబుతోనే చెప్పాలి... ఊఁ చెప్పు...

పట్టా: చెప్తాగానీ ముందు... మీరు చెప్పండి సార్... మీరు మెజీషియన్ మహేంద్రనాథే కదూ?

మహే: ఏం... బోర్డు కనబడలేదా...? ఈ నా ఆర్భాటం చూసినా అర్థంకావటం లేదా...!

పట్టా: అర్థం అయింది సార్ అర్థం అయింది. కాకపోతే పక్కనున్న ఆ 'సిగామ్' అంటేనే ఏ డిగ్రీయో అర్థంకాక అడిగా...

మహే: ఓహ్ ఇదా... ఇట్నించి చదువుకో నీకే అర్థం అవుతుంది.

పట్టా: ఎమ్ఎజిఐసి... అంటే మాజిక్... అనే కద్సార్.

మహే: అక్షరాలా అంతే...

పట్టా: భలే మ్యాజిక్ చేశార్ సార్... అద్దిరిపోయింది.

మహే: థాంక్యూ థాంక్యూ

పట్టా: నో మెన్షన్ సార్

మహే: ఏయ్... పొగిడేసి చెక్కేద్దామనుకుంటున్నావా... చెప్పు... ఎవర్నువ్వు

పట్టా: పట్టార్కర్ అండీ...

మహే: పట్టార్కర్ ఏంటి... మళయాళ సినిమా విలన్ కొట్టార్కర్‌లాగ.

పట్టా: నాకు మంచి మెజీషియన్‌ని అవుదామని కోరికండి అందుకని సౌత్‌లో పట్టాభిరామ్, నార్త్‌లో పి.సి. సర్కార్ లాంటి మెజీషియన్‌ల పేర్లు కలిసొచ్చేలా పట్టార్కర్ అని పెట్టుకున్నా

మహే: శభాష్

పట్టా: థాంక్యూసార్... మంచి రోజు, తిథి, వారం, నక్షత్రం అన్నీచూసి మరీ పెట్టుకుంటే శభాష్ కాక ఛస్తుందా సార్

మహే: ఆహా... అంత సెంటిమెంటుందా బాబూ నీలో? ఒక్క తిథి వార నక్షత్రాలేనా... శకునం కూడా చూశావా

పట్టా: అయ్యబాబోయ్ శకునం చూడకుండా ఎలాగండి మా ఇంట్లో పట్టింపు విపరీతం...

మహే: సరే అర్థం అయిందిలే... ఇంతకీ నీకు మ్యాజిక్ అంటే ఇంట్రస్ట్ అన్నమాట

పట్టా: అన్నమాట కాదుసార్ ఉన్నమాటే

మహే: ఇప్పటిదాకా ఏదైనా మ్యాజిక్ ఐటమ్ చిన్నదైనా సరే ప్రాక్టీస్ చేశావా...

పట్టా: చేశాన్సార్... ఒకటి ఇప్పుడే ఇక్కడే మీ ముందే చూపిస్తా... చూడండి..? ఇదేంటి...?

మహే: ద్రాక్ష పండు

పట్టా: ఏదైనా వస్తువుల్ని మాయం చెయ్యాలంటే ప్రతి మెజీషియన్‌కి పక్కన నమ్మకస్తులైన అసిస్టెంట్ ఉండాలికదా...

మహే: కరెక్ట్...

పట్టా: కానీ దీన్ని మాయం చెయ్యడానికి ఏ అసిస్టెంట్ సహాయమూ అక్కర్లేదు. ఒక్క క్షణంలో కంటికి కనబడకుండా మాయం చెయ్యొచ్చు.

మహే: ఎలా...?

పట్టా: (నోట్లో వేసుకొని తినేస్తూ) ఇలా

మహే: హోరినీ అసాధ్యం కూలా... మ్యాజిక్ షోలలో ఇలాంటి చిన్న చిన్న ఎంటర్‌టైన్ మెంట్‌లు మధ్య మధ్య పెట్టుకోవచ్చు... అంతా బాగానే ఉంది గానీ... ఒక్కటే నాకు నచ్చలేదోయ్...

పట్టా: ఏంటన్సార్ అది...

మహే: పిచ్చి పిచ్చి నమ్మకాలు అవీ పెట్టుకుంటే నాదగ్గర కష్టంవోయ్ అలాంటివి నేను నమ్మను గాక నమ్మను...

పట్టా: ఏం ఎందుకు నమ్మకూడదు సార్... మనకు మంచి జరుగుతుందంటే ఎందుకు నమ్మకూడదు చెప్పండి

మహే: ఆ... ఆ... మంచి జరుగుతుందని, అదృష్టం కలిసొస్తుందని పిచ్చి పిచ్చి ఊహలతో జడ్డి డెసిషన్లు తీసేసుకొని వెర్రి వెర్రిగా బిహేవ్ చేసే కాండేట్లు... (నెత్తిమీద వెంట్రుకలు చూపిస్తూ) ఇదిగో ఇంతమంది తెలుస్నాకు.

పట్టా: సార్ సార్.. నన్ను మరీ అపార్థం చేసేసుకున్నార్సార్... ఏవో నమ్మకాలున్నమాట నిజమే గానీ మరీ అంత దారుణం లేదండి... దాన్నిబట్టి నా టాలెంట్‌ని అంచనా వెయ్యకండి సార్ ప్లీజ్...

మహే: అంటే నీకు చాలా టాలెంటుందంటావ్

పట్టా: కావాలంటే మరో మ్యాజిక్ చేసి చూపిస్తాన్సార్

మహే: చెయ్... చూద్దాం

పట్టా: ఇప్పుడు నేను మీకు ఓ ఐటమ్ ఇస్తా, దాన్ని ఎవరైనా సరే హ్యాపీగా తినచ్చు. కాకపోతే దాన్ని ఇంతకు ముందు ఈ భూ ప్రపంచంలో ఎవరూ చూడలేదు... ఇక ముందు కూడా ఎప్పుడూ చూడబోరు... ఆఖరికి ఆ బ్రహ్మదేవుడు కూడా

మహే: ఆ...! ఆశ్చర్యంగా ఉందే... ఏది ఇయ్యి చూద్దాం... (జేబులోంచి ఓ వేరుశనగ కాయ తీసి ఇస్తాడు పట్టార్కర్) ఇదేంటీ... వేరు శనక్కాయా!?

పట్టా: అవునూ

మహే: ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదన్నావే?

పట్టా: పగల కొట్టండి (మహేంద్రనాథ్ పగలకొట్టి, డిప్పలు రెండు విప్పి చూశాడు. పట్టార్కర్ ముట్టుకోకుండా అందులోని శనక్కాయిని చూపిస్తూ) దీన్ని ఇంతకు ముందు ఎవరైనా చూశారా...?

మహే: ఏం పిచ్చెక్కిందా... కొన్ని వేలసార్లు చూసి ఉంటాను ఇలాంటి వేరు శనక్కాయిలని

పట్టా: ఇలాంటి వేరు శనక్కాయిల్ని కాదండీ... దీన్ని... దీన్ని ఇంతకు ముందు ఎవరూ చూడడానికి ఛాన్సేలేదు ఎందుకంటే ఇప్పుడేదీన్ని మీ చేత్తోనే పగలకొట్టారుగనుక

మహే: ఆ!

పట్టా: ఆ... ఇప్పుడు దాన్ని మీరు నోట్లో వేసుకోండి నమిలి మింగెయ్యండి. (మహేంద్రనాథ్ నోట్లో వేసుకున్నాడు అలాగే చేశాడు) ఇప్పుడు చెప్పండి సార్... మీరు ఇప్పుడే పగలకొట్టిన ఈ వేరుశనగ కాయని భవిష్యత్తులో ఎవరైనా చూడగలరా... చూడలేరు.. ఎందుకంటే మీరు మింగేశారుకనుక.

మహే: హోరి... అసాధ్యుడవే...

పట్టా: అవున్సార్... పాపం... అసాధ్యుణ్ణేనట! దయచేసి నన్ను మీ అసిస్టెంట్‌గా చేర్చుకోండిసార్...

మహే: చేర్చుకోవచ్చోయ్... కానీ చెప్పానుగా... పిచ్చి పిచ్చి నమ్మకాలు అవీ మీ ఇంట్లో ఎక్కువ. నాకు అవంటే ఒళ్ళుమంట... ఎలా చెప్పు...?

పట్టా: సార్... అదొక్కటీ మర్చిపోయి నన్ను మీ అసిస్టెంట్‌గా తీసుకోలేరా?

మహే: ఎలా మర్చిపోమంటావోయ్...? ఈ నమ్మకాల పవరు నీకు తెలీదు ఎంత మంచి మనుషులైనా సరే ఒక్కసారి ఇలాంటి నమ్మకాల వలలో చిక్కితే అవతల వాళ్ళకి చెడు చేస్తారు తెలుసా...

పట్టా: అదెలా సార్... మంచి వాళ్ళు చెడు ఎలా చేస్తారు?

మహే: అదేనోయ్ గమ్మత్తు... వాళ్ళకి తెలీదు 'అవతల వాళ్ళని బాధపెడుతున్నాం' అని...

పట్టా: అయింది సార్... మీ మనసులో ఉన్నది ఇప్పుడు నాకు పూర్తిగా అర్థం అయింది...

మహే: అర్థం అయిందో వ్యర్థం అయిందో

పట్టా: అబ్బెబ్బెబ్బే... అంతమాటనకండి సార్... కొన్ని నమ్మకాలు అనవసరంగా పెట్టుకొని టైమ్ వేస్ట్ చేసుకోకూడదు... అంతేకద్సార్... మీరు చెప్పేది.

మహే: కరెక్ట్...



## జస్ట్ ఫర్ ఫన్

**ప్రొఫెసర్ విద్యార్థులతో:-**

మీరెప్పుడైనా చింపాంజీ పుర్రెను చూశారా?
అది చాలా అరుదైన పుర్రె.
ఇలాంటివి మనదేశంలో రెండే రెండు ఉన్నాయి.
ఒకటి కలకత్తా మ్యూజియంలో వుంది.
మరొకటి నా దగ్గర ఉంది.

- గోపి

పట్టా: కానీ మా ఫాదర్ ఎక్స్‌పీరియన్సే వేరు సార్...

మహే: ఏంటో అది?

పట్టా: మా అమ్మగారు సంగీతం పిచ్చితో అస్సలు వంట చేసేదికాద్సార్ మా ఫాదర్ చెయ్యికాల్చుకోవలసి వచ్చేది. లైఫ్ మరీ మిజరబుల్ అయిపోయింది. అప్పుడేం చేశాడో తెలుసా... సార్...

మహే: ఏ మంత్రగాణ్ణో, కోయవాణ్ణో పట్టుకొని తాయెత్తు కట్టించి ఉంటాడు

పట్టా: లేద్సార్... తాయెత్తుకన్నా పెద్ద ఎత్తే వేశాడు...

మహే: ఏంటో అది?



పట్టా: మా అమ్మగారి మైండ్‌ని హిప్నాటిజంతో మార్చేశాడు. దెబ్బతో మా నాన్నగారికి కొన్ని శక్తుల మీద, సెంటిమెంట్ల మీద, శకునాలమీద నమ్మకం ఏర్పడిపోయిందండి

మహే: పిచ్చివాడా... హిప్నాటిజం ఈజ్ ఎ సైన్స్ బాబూ... అది మానవాతీత శక్తి కానేకాదు. మీ ఫాదర్ పొరపాటు పడ్డాడు. నేను హిప్నాటిజాన్ని నమ్ముతాను

పట్టా: నమ్ముతారా సార్.. హమ్మయ్య...! థాంక్యూ బ్రహ్మయ్యా...

మహే: అదేంటి... ఆ హమ్మయ్య బ్రహ్మయ్య ప్రాసేంటి?

పట్టా: మీరు హిప్నాటిజాన్ని నమ్ముతున్నందుకు ఆ బ్రహ్మదేవుడికి థాంక్స్ చెప్పుకుంటున్నా... ఎందుకంటే నేను హిప్నాటిజం నేర్చుకున్నాను కనుక

మహే: ఏంటీ... నువ్వు హిప్నాటిజం నేర్చుకున్నావా?

పట్టా: ఏదో కొద్దికొద్దిగానే సార్... కానీ... చాలా మంది హిప్నాటిస్ట్‌ల దగ్గర మెయిన్ అసిస్టెంట్‌గా పనిచేశా

మహే: (ఆనందంగా) ఆహా! ఇంకేంమరి?

పట్టా: అందుకేసార్... మీరు మీ పేరు చివర 'ఎమ్ ఎ జి ఐ సి' మేజిక్‌ని సి ఐ జి ఎ ఎమ్ సిగామ్‌లా ఎలా మార్చి పెట్టుకున్నారో అలా నా పేరు చివరకూడా మటాష్ అని ఓ డిగ్రీ తగిలించుకున్నా

మహే: మటాషా... అదేంటి?

పట్టా: అదేసార్... ఎమ్ ఎ టి ఎ ఎస్ హెచ్... మటాష్.. అంటే... మెయిన్ అసిస్టెంట్ టు ఆల్ సీనియర్ హిప్నాటిస్ట్స్... అని అర్థం...

మహే: హహహహ... మెయిన్ అసిస్టెంట్ టు ఆల్ సీనియర్ హిప్నాటిస్ట్స్... ఎమ్ ఎ టి ఎ ఎస్ హెచ్... మటాష్.. పట్టార్కర్ మటాష్.. బావుందోయ్ చాలా బావుంది. ఇప్పుడు నచ్చావు నాకు.

పట్టా: మరోసారి హమ్మయ్య బ్రహ్మయ్య సార్! సార్... ఇంతకీ నన్ను మీ అసిస్టెంట్‌గా చేర్చుకుంటున్నట్టేకదా... సార్...

మహే: తప్పకుండా చేర్చుకుంటానోయ్... నీకు హిప్నాటిజం వచ్చని తెలిశాక నిన్ను నేను వదుల్తానా? రేపే... వచ్చి జాయినవ్వు... రేపు చాలా మంచిరోజు

పట్టా: అదేంట్సార్ శకునాలు సెంటిమెంట్లు లేవుకదా మీకు

మహే: కరెక్ట్ కరెక్ట్ అయితే ఇవాళే... ఇప్పట్నించే జాయినవు...

పట్టా: ముత్యంగా మూడోసారి హమ్మయ్య బ్రహ్మయ్య! సార్... సార్... ఓ చిన్న డౌటు

మహే: అడుగు

పట్టా: శకునాలు, సెంటిమెంట్లు లేవు, ఉండకూడదు, సరే... ఈ దెయ్యాలూ భూతాలూ, బాణామతి, చిల్లంగి, చేతబడి ఇవి కూడా లేవాసార్...

మహే: భారద్దేశ చరిత్ర అంతా చదివి మహాత్మాగాంధీకి ఇందిరాగాంధీ ఏమవుతుందని అడిగాట్ట నీలాంటివాడే! ఇంతసేపు నేను చెప్పిందేమిటి? శకునాలు, సెంటిమెంట్లు, దెయ్యాలు, భూతాలు, బాణామతి, చిల్లంగి ఇవన్నీ మనం కల్పించుకున్నవి. ఒక్కొక్కసారి ఇంకొకళ్ళని బెదరకొట్టడానికి మాత్రమే ట్రిక్కుల్లా పనిచేస్తాయంతే.

పట్టా: బెదరగొట్టడానికా...!? ట్రిక్కులా...!?

మహే: యా!

పట్టా: సార్... మరి కొంతమంది బాణామతి, చేతబడి ఉన్నాయని, చూశాం అని సవాల్ చేస్తుంటారూ.... ఎవరో పేపర్లో కూడా రాశారీమధ్య...

మహే: అదా... అది వాళ్ళ భ్రమ... నేను కూడా చూశాను ఆ ఆర్టికల్. దానికి కౌంటర్‌గా నేనో స్టేట్‌మెంటిచ్చా... 'అవేవీ లేవు... దమ్ముంటే నిరూపించు ఎలాటి పరీక్షకైనా నేను సిద్ధం' అని...! తెలుసా?

పట్టా: తెలుస్సార్... ఆ స్టేట్‌మెంట్ లో మీ అడ్రసు చూసే వచ్చాను. మీ స్టేట్‌మెంట్‌ని ఖండిస్తూ -'ఉన్నాయని ప్రూవ్ చేస్తానూ దమ్ముంటే నీతలలో వెంట్రుకలు పంపు నీకే చేతబడి చేస్తాను' అంటూ ఆర్టికల్ రాసినతను మిమ్మల్ని సవాల్ చేశాడు మీరు చూళ్ళేదా సార్...

మహే: ఏంటీ... నన్ను సవాల్ చేస్తాడా... ఇదిగో ఇప్పుడే నా తల వెంట్రుకలు కొన్ని తీసి నీకిస్తాను... అవి వాడి అడ్రసుకి పంపించు అంతేకాదు... ఇదిగో డైరీ తీసుకో ఇందులో ప్రపంచంలో ప్రఖ్యాతి చెందిన మెజీషియన్ల అడ్రసులు, హిప్నాటిస్ట్‌ల అడ్రసులు, హేతువాద సంఘాల అడ్రసులు వాళ్ళ సభ్యుల అడ్రసులు అన్నీ ఉన్నాయి. నేను లెటర్రాస్తాను. అది జిరాక్స్ కాపీలు తీయించి వాళ్ళకి పంపు... వాళ్ళందరూ వెంట్రుకలు ఖచ్చితంగా పంపిస్తారు.... దెబ్బతో కుదురుతుంది వాడికి రోగం.

పట్టా: అలాగే సార్... ఇప్పుడే మొదలుపెడతా పని.... మీరు ముందర లోపలకెళ్ళి మీ తల వెంట్రుకలు కట్ చేసుకొని ప్యాక్‌చేసి ఇవ్వండి మరీ...

**-- కట్ --**

మహే: ఈ పట్టార్కర్ గాడేంటి... ఆ రోజు కవర్లు, వాటి స్టాంపులకని డబ్బులు పట్టుకుపోయి పత్తాలేడు... నెల రోజులయింది... ఏమయివుంటుంది చెప్మా...

(పట్టార్కర్ మంచి డ్రస్సు కళ్ళజోడుతో స్టయిల్‌గా ప్రవేశిస్తాడు)

పట్టా: నమస్తే సార్... గుడ్మార్నింగ్

మహే: ఎవరు...? ఎవరండీ మీరు

పట్టా: నేనేనండీ... పట్టార్కర్... మటాష్!

మహే: ఆఁ! నువ్వటోయ్... ఏంటి ఏమయింది నీకు... ఏంటీవేషం? నేనిచ్చిన కవర్ల సంగతేమయింది.

పట్టా: పోస్ట్ చేశాన్సార్... విపరీతమైన రెస్పాన్స్ వచ్చింది. దేశం నలుమూలల్నుంచి ప్రపంచం మారుమూలల్నుంచి ప్రతిరోజూ పోస్ట్‌లో ప్రతివాళ్ళూ తల వెంట్రుకలు పంపడమే

మహే: ఆఁ... ఆఁ... ఆ తర్వాత

పట్టా: (ఆనందంగా) ఇంకేముంది... ఆ దెబ్బతో ఓ షాపు తెరిచా... సినిమావాళ్ళు, టీవీవాళ్ళు, నాటకాలవాళ్ళు ఆఖరికి బ్యూటీ పార్లర్స్ కూడా మాకు సప్లయ్ చెయ్యండంటే మాకు సప్లయ్ చెయ్యండి ఎంత కావాలంటే అంతిస్తామంటూ నా వెంటపడుతున్నారంటే నమ్మండి...

మహే: ఏంటి వెంట్రుకల కోసమా

పట్టా: కాద్సార్.... గడ్డాలు, మీసాలు, సవరాలు, విగ్గులు వీటికోసం సార్...

మహే: అవునూ... వాళ్ళందరూ నీవెంట ఎందుకు పడుతున్నారు... నువ్వెలా ఆ షాపు తెరిచావు...!?

పట్టా: మీరు రాసిన లెటర్‌లో వెంట్రుకలు పంపించాల్సిన అడ్రసు అంటూ - నా అడ్రసు ఇచ్చాన్సార్...

మహే: ఆఁ...!

పట్టా: అవున్సార్... థాంక్యూసార్... మీదయవల్ల డబ్బుల కరువు తీరిపోయి హాయిగా ఉన్నాను... నన్నాశీర్వదించండి సార్...

మహే: (ఢామ్మని కూలబడిపోతూ) నన్ను మటాష్ చేశావ్ కదరా పట్టార్కర్... మటాష్ ...!

---- ది ఎండ్ ---

జస్ట్ ఫర్ ఫన్

# రిటర్న్ ఆఫ్ ది టైగర్స్

ఆ మధ్య 'జూ'లో 'సాకీ' అనే పులిని చంపేసారు గుర్తుందా! ఆ దెబ్బతో అక్కడ రెండు పులులకి దడ పట్టుకుంది. బతికుంటే వాల్ పోస్టర్‌లు తినైనా బతకొచ్చులే అనుకుని, ఓ రోజు కాపలా వాళ్ళ కళ్ళు కప్పి జూ నుంచి పారిపోయాయి. ఆర్నెల్ల తర్వాత రెండు పులులూ తిరిగి జూకి వచ్చి, గేటు దగ్గర తచ్చాడుతుంటే కాపలా వాళ్ళు వాటిని తీసుకెళ్ళి మళ్ళీ బోనులో పడేసారు.



రెండు పులులూ ఒకదాన్నొకటి ఎగాదిగా చూసుకున్నాయి. ఒక పులి బాగా చిక్కి శల్యమైపోయి ఉంది. రెండో పులి ఇదివరకటి కంటే కొంచెం ఒళ్ళు చేసింది. 'ఏం బాసూ, ఇలా చిక్కిపోయావు? ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు, ఏం తిన్నావు' అంటూ బక్క పులిని పరామర్శించింది దుక్క పులి.

బక్క పులి నీరసంగా గాండ్రించింది- 'ఏం చెప్పమంటావు బ్రదరూ! నా పాట్లు మనుషులక్కూడా వద్దు. ఆ రోజు మనం పారిపోయామా...!? ఎక్కడ తల దాచుకోవాలా అని ఆలోచించా. మనకి ముప్పొద్దులా తిండి దొరకాలి, పైగా ఎవరి కంటా పడకూడదు. బుర్ర పాదరసంలా పనిచేసింది. తిన్నగా సాంఘిక సంక్షేమ శాఖ హాస్టల్‌కి వెళ్ళి అక్కడే తలా, తోకా దాచుకున్నా, అక్కడైతే తనిఖీ అధికారులెవరూ రారు కదా. అక్కడ పిల్లలు ముందు భయపడ్డా తర్వాత మంచి ఫ్రెండ్సయిపోయార్లే. నాకో రూమ్ ఇచ్చారు. నాతో ఆడుకునేవారు. అంతా బాగానే ఉంది కానీ తిండి దగ్గరే చచ్చే చావొచ్చింది. అదేం తిండిరా దేవుడా! పాచిపోయిన అన్నం, అందులో కుళ్ళిపోయిన పురుగులు, కంపుకొట్టే కూరలు...నిజంగా డోకొచ్చినంత పనయింది. పోనీ, పిల్లల్నే ఆరారా తినేద్దామనుకుంటే మనసొప్పలే. మనకి బాగా ఫ్రెండ్సయి పోయారుగా. అయినా వాళ్ళు కూడా ఎలా ఉన్నారని. నా కంటే అధ్వాన్నంగా ఎక్కడా సోలడు కండ లేకుండా నడుస్తున్న అస్థిపంజరాల్లా ఉన్నారనుకో. ఇంకా ఇక్కడ ఉంటే మనం గుటుక్కుమనటం ఖాయం, 'జూ' కే మళ్ళీ పోతే ఎంతో కొంత పడేస్తారు, అదే 'పది వేలు' అనుకుని మళ్ళీ వచ్చేసా' అని చెప్పి నిట్టూర్చి 'అవునూ, నీ సంగతేంటి! ఇంతలా బలిసావు ' అని కుతూహలంగా అడిగింది.

దుక్కపులి గాండ్రు గాండ్రు మంటూ నవ్వింది. 'మరదే నీకూ నాకూ తేడా. నేనేం చేశానో తెల్సా! తిన్నగా గవర్నమెంటాఫీస్ పోయి అక్కడో ఫైళ్ళ రూంలో దాక్కున్నా. అక్కడకి కూడా ఎప్పుడూ ఎవరూ రార్లే! రోజూ సాయంత్రం క్లర్కులు వెళ్ళిపోయేదాకా వెయిట్ చేసే దాన్ని. అందరూ వెళ్ళిపోతుంటే, ఆఖరివాణ్ణి ఎవరూ చూడకుండా గబుక్కున పట్టేసి, రూంలోకి లాగేసి గుటుక్కుమని మింగేసేదాన్ని. అలా రోజుకొకణ్ణి స్వాహా చేస్తున్నా ఎవరూ కనిపెట్టలేకపోయారు. ఏ క్లర్కు ఎప్పుడొస్తాడో, ఎప్పుడుపోతాడో, అసలొస్తాడో రాడో అక్కడెవరూ పట్టించుకోరనుకుంటా! అలా రోజులు హాయిగా గడిచిపోయాయి'.

'మరెందుకొచ్చావు, అక్కడే సుష్టుగా తింటూ కూర్చోక' బక్కపులి ఆసక్తిగా అడిగింది.

దుక్కపులికి దుఃఖం ముంచుకొచ్చింది. పంజాతో కళ్ళు తుడుచుకుని చెప్పింది.

"అదే నా బాడ్ లక్. ఓ రోజు సాయంత్రం ఎప్పట్లాగే ఒకణ్ణి లాగించేశా. ఇక చూస్కో...ఆ మర్నాడు సెక్రటేరియట్ అంతా గగ్గోలెత్తిపోయింది. "వెంకటావు ఏడీ...వెంకట్రావు ఏడీ" అంటూ అందరూ పరుగులు పెట్టారు. జుత్తు పీకేసుకున్నారు. అన్ని గదులు గాలించేశారు. అలా నేను దొరికిపోయానన్నమాట. నన్ను చావ గొట్టి చంపెయ్యబోయారు, గానీ నేను రంయ్‌రంయ్‌మని పారిపోయి ఇక్కడికొచ్చేశా!"

'అయ్యో పాపం...ఇంతకీ ఎవడా వెంకట్రావు? ఎవరైనా వివిపీయా?' జాలిగా అడిగింది బక్కపులి.

'కాదు... పొద్దున్నే స్టాఫ్ అందరికీ టీలు సప్లయి చేసే కుర్రాడట!' అంటూ తోక జాడించింది దుక్కపులి.

- గోపి




పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

**తారాగణం**

కమల్‌హాసన్, సిమ్రాన్, అబ్బాస్, స్నేహ

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| డాన్స్ | : తరుణ్ కుమార్, బృంద, అశోక్ |
| పాటలు | : భువనచంద్ర, శివగణేష్ |
| పబ్లిసిటీ | : లంక భాస్కర్ |
| గానం | : మనో, శ్రీనివాస్, టిప్పు, డా॥ నారాయణ, సుజాత, స్వర్ణలత, అనూరాధా శ్రీరామ్ |
| డబ్బింగ్ థియేటర్ | : ప్రసాద్ స్టూడియో, సోనిక్ థియేటర్ (చెన్నై) |
| రీ రికార్డింగ్ | : ఏవియమ్ 'జి' డిజిటల్ (చెన్నై) |
| ఆర్ట్ | : జి. కె. |
| కో డైరెక్టర్ | : డి. సాయికృష్ణ |
| మాటలు | : శ్రీరామకృష్ణ |
| ఎడిటింగ్ | : ఎమ్. కాశీవిశ్వనాథ్ |
| అసిస్టెంట్ | : యస్. సూరజ్ కవి |
| స్టంట్ | : విక్రమ్ ధర్మ |
| కెమెరా | : ఆర్థర్ ఎ. విల్సన్ |
| సంగీతం | : దేవా |
| నిర్మాత | : శ్రీలక్ష్మి |
| దర్శకత్వం | : మౌళి |

బ్రహ్మచారి




బ్రహ్మచారి




పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

**తారాగణం**

శ్రీరామ్, రష్మి
వినోద్, రాంబాబు, శ్రీనిజ, రమ్య, తిరుపతివేలు, శివ, మణికుమార్ తదితరులు

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| సంగీతం | : రఘుకౌశిక్ |
| పాటలు | : భాస్కరభట్ల, రవికుమార్ |
| ఫోటోగ్రఫీ | : రఘునందన్ సింగ్ |
| ఎడిటింగ్ | : నందమూరి హరి |
| ఆర్ట్ | : నారాయణరావు |
| డాన్స్ | : రామారావు |
| పి.ఆర్.ఓ. | : త్రినాథ్ పెదిరెడ్ల |
| మేకప్ | : సతీష్, నరేంద్రసింగ్ |
| ప్రొడక్షన్ మేనేజర్ | : కిషోర్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : నాగేంద్ర |
| కో-డైరెక్టర్ | : రమణ |
| నిర్మాత | : యు. సరోజిని |
| కథ,స్క్రీన్‌ప్లే, మాటలు, విజువల్‌ఎఫెక్ట్స్, దర్శకత్వం | : శివ |
| ఆడియో | : ఆదిత్య మ్యూజిక్ |



రచన: శివగణేష్ **1** గానం: శ్రీనివాస్, సుజాత

కో: రవీనా రవీనా... రవీనా రవీనా
ఆ: సకలకళా వల్లభుడా సరసంకోరే స్నేహితుడా (2)
నా కథలో నాయకుడా నా మదిలో మన్మథుడా
నువ్వు పెనవేస్తే శృంగారవీణ పదే పదే మోగాల
అ: కలవా చెలీ కానుకవా మదినే గిచ్చే మల్లికవా
కో: రవీనా రవీనా... రవీనా రవీనా
ఆ: కన్నె వన్నె చూసి కలుగు భావమేది
కళ్లలోన ప్రేమ కామమా ఏదీ ఏదీ
అ: కమ్మనైన స్నేహం గుండె నిండుతుంటే
కాలమంత వెలిగే బంధమే అదీ అదీ
ఆ: ఆ మాటంటే చాలంట నీ మనసుకు బానిసనౌతా
అ: నీ రాజ్యం ఏలేస్తా నీ శ్వాసై నిత్యం నిన్నే ప్రేమిస్తా ||రవీనా||
అ: రాయివంటి నాలో రాగాలొలికినావే
రాయబారమింతా ఎందుకే అహో ప్రియా ప్రియా
ఆ: వేసవంటి నేను వెన్నెలైన వేళ హాయిభారం తీరేటందుకే
మహాశయా
అ: నీ జోరే సెలయేరై నను నీలో ముంచెయ్యాల
ఆ: నీ జాలే నా చీరై నా తనువే కాగి వేగి పోవాల
కో: రవీనా రవీనా... రవీనా రవీనా
ఆ: సకలకళా వల్లభుడా సరసంకోరే స్నేహితుడా
నా కథలో నాయకుడా నా మదిలో మన్మథుడా
అ: నను ఒడిచేర్చి నిను పంచువేళ ప్రాయం ప్రాణం ఊగాల
కో: రవీనా రవీనా... రవీనా రవీనా

రచన: భువనచంద్ర **2** గానం: మనో, కోరస్

అ: చంద్రస్వామి బాలస్వామి సుబ్బుస్వామి రామస్వామి
కళ్యాణం చేసుకున్నారోయ్
ఆశలన్నీ తీరిపోయి కన్నులొట్ట బోయినంక
తప్పుల్ని ఒప్పుకున్నారోయ్
ఓ రబ్బరే అబ్బ సింహం నోట్లో చేతులు పెట్టొద్దోయ్



ఆ: కసికోడి కరుసె కొకొకో ||నకిరే||
ఆ: మేఘమల్లే మారిపోతే అపుడు నువ్వు ఏం చేస్తావోయ్
చెప్పు... చెప్పూ
అ: గాలి తుడుపు మంత్రమేసి నిన్ను పట్టి చెక్కిలి బూరెలు
తింటా... తింటా
ఆ: పంచదార ప్రతిమల్లే మారిపోదునా
అ: మోహమెుచ్చి ఒళ్లంతా కొరికి పెట్టనా
ఆ: ఒక ఉప్పు తోటలామారి నిన్ను విడిచి దూరంగాపోతే
అ: ఒక కోడెదూడలా నేను మారి నీ వెన్ను మేయనా పోరీ
ఆ: ఏయ్ మగడా... కొంచెం వినరా
అ: వినబోనె పప్పుచెక్కా చిట్టి చిలకా
తేనె తునకా మంచమెక్కి స్లోగా
అందివ్వమ్మా చుమ్మా... చుమ్మా...
ఆ: జోడుకోరే ఈడులోనా కుర్రగాళ్లకి దూరంగుండమంది
బామ్మా... లేమ్మా
అ: ఓ... పైటలోని అందాలు చనువుగా ఇమ్మా
ఆ: ఒక అట్లకాడ సంధించి అలరిస్తాలేమ్మా
అ: నీవు జలకమాడగా నేను కొంచెం వీపు రుద్దనా కొమ్మా
ఆ: నిన్ను ఒదిలిపోనుగా మరల మరల నీవెందుకడుగుతావమ్మా
అ: ఇది నిజమా... ఇది నిజమా
ఆ: చెలి మనసు తెలుసు కొనుమా
అ: నకిరేకల్లు జీగం పెట్టి ద్వారం మూసుకో
ఆ: కూచిపూడి పత్తి తెచ్చి పరుపు వేసుకో
అ: కందుకూరి మల్లెపూలు తల్లో పెట్టుకో
ఆ: కాంచిపురం పట్టుచీర కానుకిచ్చుకో
అ: తంజావూర్ బొమ్మకుమల్లె తలాడించి ఒప్పుకో
ఆ: ఒంగోలు గిత్తకి మల్లె వెన్ను మీటి కుమ్ముకో
అ: తుమ్మెదపై పువ్వులకింత ఆశ ఎందుకో
నన్ను చుట్టుకో... ముద్దు పెట్టుకో
ఆ: కసికోడి కూసె కొకొకో



రచన: రవికుమార్ **1** గానం: రవివర్మ, లెనినాచౌదరి, కోరస్

అ: చెంగావి చీరలోన కొత్తగున్న ముద్దు గుమ్మ
కళ్లలోన అంత సిగ్గు చేరుకుంది ఎందుకమ్మ
నువ్వు నవ్వితే ముత్యాలవానే
గున్నమావి తోటలోన కోయిలమ్మవే
మా ఇంటిలోన గుండెలోన వెన్నెలమ్మవే
ఆ: బంగారు బొమ్మకేమొ ఇంటిపేరు మారనుంది
కంగారు ఎందుకమ్మ తీరుకాస్త మారుతుంది
కోరుకుంటే కన్యాకుమారీ
కొండమీద కోతినైన తెచ్చి పెట్టమా
పాలరాతి బొమ్మకేమొ నువ్వు చుట్టమా
అ: బావగారూ బాగున్నారా? పెళ్లి ఎపుడని చూస్తున్నారా?
పెద్దవాళ్లే ఒప్పుకుంటే ఇపుడే చేసెయ్యమా
ఆ: ఆగుతారా అబ్బాయిగారూ... ఏమిటండీ మీ మాటతీరూ
తమరి చెల్లెలే తొందరంటే దండలే మార్చెయ్యమా
అకో: పెళ్లికూతురి తరపునవచ్చీ ప్లేటుకాస్తా మార్చేస్తారా
మ్యాచ్‌ఫిక్సింగ్ జరిగివుంటే ముందుగా చెప్పొచ్చుగా
ఆకో: పెళ్లికొడుకూ ఇన్నోసెంట్ అంతకన్నా యమడీసెంట్
మీకులాగా వేస్ట్‌కాదు అందుకే మెచ్చాములే
చఃకో: చెమ్మచెక్కా చారడేసి మొగ్గా అట్లుపోసీ ఆరగించంగా
ఆటలాడీ పాటపాడీ సందడే చెయ్యొచ్చుగా
అ: కోలకళ్లే కస్తూరిరంగా సోకువుందే సమ్మోహనంగా
వన్నెలాడి వంతపాడీ చిందులే వెయ్యొచ్చుగా
ఆకో: కోతులన్నీ ఓ చోటచేరీ గోలచేస్తే మాకేమి దారీ
వానరాలకూ వెల్‌కం అనడం తప్పేకాదా మరీ
అకో: కొత్తిమీరా కట్టలు మీరే అడ్డపొగలా చుట్టలు మీరే
కొండముచ్చుల్ కోరివస్తే కంకం అన్నాం సరే.





చేసిపెట్టు ఈ సాయం చెబితే వినవా
చ: అయ్యో చెంప ఛెళ్లుమందీ నా గుండె ఝల్లుమందీ
నే వెళ్లను బాబోయ్ అంటే పంపింది మీరేలే
నే హృతిక్‌రోషన్ కాను, నే పవన్‌కళ్యాన్ కాదు
నా కెందుకంట గొడవా నన్నొదిలి పెట్టండే
భయపడితే ఎలాగంట పిచ్చిసన్నాసీ
హనుమాన్ చాలీసా చదువుకోవాలీ
కష్టమైన ఇష్టమైన తప్పదులేరా
చేసిపెట్టు ఈ సాయం చెబితే వినవా...

రచన: రవికుమార్ **7** గానం: పార్థసారథి

ప: తెగుతున్న బంధం ఎవరికో సొంతమవుతోందీ
మాటల్ని దాచీ మౌనమేదో మంత్రమేస్తోందీ
రెక్కలు తెగిన పావురమే దిక్కులు చూస్తుంటే
రెప్పల వెనుక స్వప్నాలే కన్నీరవుతుంటే
జరుగుతోంది పెళ్లి కాలమా ఆపరాదె వెళ్లి
చ: అడగనిదే అమ్మయినా అన్నం పెడుతుందా
చెప్పనిదే చెలి అయినా తన ప్రేమను పంచిస్తుందా
గుండెనిండుగా ప్రేమేవున్నా ఫలితం ఏముందీ
పెదవిదాటి అది పలుకరించగా పరుగున రాకుందీ
నీ మనసుకి నీవే అన్యాయం చేస్తున్నావిది ఏం న్యాయం?
ఎగసిపడిన అలల తలలు ఒరిగినవే...
చ: అవకాశం చేజారీ మళ్లీ వస్తుందా
ఆకాశం ఈ నేల ఇక కలిసే వీలుంటుందా
మోడు వారినా జీవితానికీ ప్రేమే చిగురింతా
తెలిసి తెలిసి మరి తప్పు చేయడం కాదా ఓ వింతా
నీ ప్రేమకు నీవే అన్యాయం చేస్తున్నావిది ఏం న్యాయం?
ఎగసిపడిన అలల తలలు ఒరిగినవే...

ఇండియనంటు ఆశపడ్డ అతివకు నీవే దొరికావే
అ: ఆడపిల్ల మోజే పడ్డా మనసూరిస్తూ ఒడిలో పడ్డా
లవ్‌మి అని చెప్పే వరకు నేనేంచెయ్యగలనే
ఘటోత్కచా గదాధరా... కన్నే నిన్ను వరించెరా
అ: టిక్ టిక్ అనే శబ్దం వయ్యారి నాలోన రవళించెనే చెలీ
ఆ: ధక్ ధక్ అనే ధ్వని కుర్రోడా నా ఎదలో వణికించెనే కన్నా
అ: ఓ... ఒకేనాడు ప్రేమా విరహం నాలో పుట్టెనే స్వీటీ
ఆ: ఒకే సూది పడితే ప్రియుడా బాధతీరులే నాయకా నాయకా
అ: ఓ... ముచ్చటకు మదిలో మాట మొదలిపూట చెప్పెయ్యమంట
ఆ: అందరికీ మతులేపోయి పడిపోదా
అ: కుర్రగుండె వినుకో దమ్మా గడియారంలా మొరిగేనమ్మా
గాలికూడా అలకే పూని ఎదలో అడుగిడదే
ఆ: ఘటోత్కచా... ఘటోత్కచా
అ: దారం పెట్టి నన్నే కుట్టావే ఓ తాళికట్టేయనా చెలీ
ఆ: చెయ్యేపట్టి నన్నే కుర్రోడా దరిచేర్చుకున్నావుగా కన్నా
అ: మరోమారు హత్తుకుపోక విడదు మోహమే స్వీటీ
కొత్తప్రేమ దాహం వెర్రి వచ్చినానమ్మా ఓ చెలీ... ఓ చెలీ
ఆ: ముద్దులను వడగాలుల్లో జడివానల్లో కొడుతూవుంటే
బుజ్జిపాప మంచంకోసం వెతుక్కోదా
అ: కష్టపడి అణిగీవున్న మనసును నీవు కదిలించేస్తే
లవ్ పిచ్చి యమగా ముదిరి వెనకే పడుతున్నా ఆ:ఘటోత్కచా॥

రచన: భువనచంద్ర — **5** — గానం: టిప్పు, స్వర్ణలత

అ: నకిరేకల్లు బీగంవేసి నోరుమూసుకో
ఆ: కూచిపూడి పత్తితెచ్చి చెవులుమూసుకో
అ: కందుకూరి కొబ్బరిమట్ట గారం మానుకో
ఆ: కాంచిపురం మరంలోన నువ్వు చేరిపో
అ: తంజావూరు బొమ్మకింత తలబిరుసెందుకో
ఆ: ఒంగోలు గిత్తా నువ్వు నెమ్మదిగుంటం నేర్చుకో
అ: తుమ్మెదకి పువ్వుకి మధ్య వైరాలెందుకో
చెయ్ పట్టుకో... కొంచెం హత్తుకో

కో: ఆశలు అన్నీ తిరిగివచ్చి మోహానపడదా
అ: నిప్పుల్లో కుప్పని వెయ్యద్దోయ్... ఏయ్
హోరుగాలిలో ఉమ్ములు వెయ్యద్దోయ్ ఓరబ్బిరే అబ్బి
అబ్బి ఓ రబ్బిరే అబ్బి... నిప్పుల్లో కుప్పని వెయ్యద్దోయ్... ఏయ్
కో: ఏనాడో అన్నారు పెద్దోళ్ళు ఏనాడో అన్నారు
ఆనాడే అన్నాడూ అన్నయ్య ఆనాడే అన్నాడు
అ: హనుమాన్ బాడీ భలే వినాయకుడి బుద్ధి భలే
అయ్యప్ప అందము కూర్చుని వున్న స్టైలు భలే
కో: ఆనాడే అన్నాడు అన్నయ్య ఆనాడే అన్నాడు
అ: అన్నా
కో: వద్దని అన్నాడూ కళ్యాణం వద్దని అన్నాడు
అ: సూపర్ బాడీ అయినా కళ్యాణంతో కుంగిపోవురా
ఒంగోల్ గిత్తనైనా సూపులో ముంచి బుగ్గవేయురా
ఆరుమిద్దెలున్న దేవుడైన ఏమి హాయిగున్నాడు
డబులు డ్యూటీ చేశాడు
అయినా బడ్జెట్టు తేలక వాకిట్లో అయ్యె ఒట్టిగ నిలిచాడు
గోచీతో ఒట్టిగ నిలిచాడు అబ్బీ
శ్రీనివాసుని చిట్టావిప్పు ఎంత రుణమో లెక్కజెప్పు
అంతవాడికె ఈ గతయితె అల్లుడి ఫేటు ఏంటో జెప్పు
కో: యాపిల్‌లాగ వున్న బిడ్డ అలసిపోయి వచ్చాడురా మేరేజైనాక
అన్నగారు అన్నమాట పక్కనెట్టి పొద్దు మళ్లీ మంచంపట్టాడు
ఐసలక ఐసలకా ఐసలకా హోయ్
అ: ఎయ్‌రా
కో: ఒంటిగుండే అబ్బాయిని కట్టెయ్యకూడదు
అ: కూడదూ
కో: ఒక్కరాయి కిందకి జారారంటె పైనికి పోలేరు
అ: పోలేరూ
అ: ఎదురు ట్రాఫిక్కే అసలుండని రోడ్డు ఇది
గుర్రం తడబడినా పందెం గెలిచే రేసు ఇది
కో: సత్యమే చెప్పారు పెద్దవాళ్ళు సత్యమే చెప్పారు
దాన్నే అన్నయ్యా కల్లుగొట్టి లైట్‌గా చెప్పాడు



మండుతున్న ఎండైనా చలిగా వుంటోందిలే
అ: నా మనసే ఈ పూటా విననందే నా మాటా ఈ ఫీలింగేంటో మరీ
ఆ: ప్రతిరోజూ నీధ్యాసే ప్రతిచోటా నీ ఊసే ప్రేమంటే అంతేమరీ
ఛఃః అలుపుకన్న గెలుపు ముఖ్యమన్నది రాసివున్న పుస్తకాలలో
పంచుకుంటె ప్రేమ తథ్యమన్నది ఆరారు కాలాలలో
ఆ: అలుముకున్న చీకటంత తొలగద అచ్చమైన వెలుగురాకతో
చేయికలిపి చెలిమి చేయమన్నది ఆ పూల గంధాలతో...
అ: వయ్యారం నచ్చిందమ్మో అపుడే ఎన్ని పులకింతలో
ఆ: వ్యవహారం బాగుందీ ఎదలో ఏం వింతలో
అ: నా మనసే ఈ పూటా... ఆ: ప్రతిరోజూ నీ ధ్యాసే...
ఛఃః వెబ్‌సైట్ ఊసులేవో చెప్పన సాగుతున్న వలపుయాత్రలో
ఓరకంట చూడకమ్మో ఉప్పెన రేగింది నాగుండెలో
ఆ: జంటపెదవి కోరుతోంది ఇప్పుడు వాటమైన స్వీటు కిస్సునీ
కొంటెపదవి పోరుతోంది చప్పున కోరింది ఇచ్చెయ్యనీ
అ: సయ్యంటే సయ్యంటాలే నీలో ఎన్ని కవ్వింతలో
ఆ: ఔనంటే కాదంటానా ఏలో ఎన్నియలో
అ: నా మనసే ఈ పూటా... ఆ: ప్రతిరోజూ...

రచన: రవికుమార్ — **6** — గానం: కాసర్ల శ్యాం, రవివర్మ, బృందం

ప: రైరైరై రయ్యిమనీ ఝుయ్యిమనీ జారిపోతోందే
ఆ వన్నెలాడి తిప్పులాడి వెళ్ళిపోతోందే
ఫాలో చేసేసి లెటర్ ఇచ్చేసెయ్
143 అంటూ లైన్లో పెట్టేసెయ్
చ: ఆ స్టైల్ చూడు బాసూ ఆ స్టైల్ చూడుబాసూ
అరె... ఓవరాల్‌గ చూస్తే మన పవన్‌కళ్యాణే
కిందనించి చూడూ అహపైనించి చూడూ
ఇలా ఫ్రంట్‌కొచ్చి చూడూ అబ్బో హృతిక్ రోషనే
ఉన్నది ఉన్నట్టూ చెప్పుకోవాలీ
నువ్వే ఆ పిల్లకు జర్క్ ఇవ్వాలీ
కష్టమైన ఇష్టమైన తప్పదులేరా

రచన: రవికుమార్ — **2** — గానం: పార్థసారథి

ప: రోజా చూసేలోకం
కొత్తగా వుందిలే
ఎదలోనా హాయిరాగం
సెలయేరై పొంగెలే
చిరుజల్లులలో
ప్రియభామినిలా
సిరివెన్నెలలో
మృదుభావనలా
నన్ను చేరావనీ... నాకే
చేరువయ్యావనీ...
చ: కనులు తెరిచి
నే కలలే కంటా
కళ్ళు మూసినా
నువ్వేనంటా
ఇది ప్రేమ తొలి పాఠమా
కుదురు వుండదూ
కునుకే లేదూ
మౌనమేమిటో
మాటేరాదూ
నీకేమొ పరిహాసమా
ఏంవయ్యిందో ఏ మౌనో
తెలిసేలా
నువ్వైనా కాస్త చెప్పవా?
చేజారిందో ఏమోలే
నా మనసూ
నిన్ను చేరి నన్ను
మరిచిపోయిందే...
చ: దిక్కుతోచకా నేనే వుంటే
ఒక్కసారిగా నువ్వెదురైతే
పెదవంచు దరహాసమా
నిన్నా మొన్నా అసలు
లేదిదీ
ఈ రోజేదో వింతగున్నదీ
శృతిచేయు స్వరచైత్రమా
నువు లేకుండా
నేనెట్లావుండేదీ
నాకైతే అంతుపట్టదే
నా ఊహల్లో ఉయ్యాలే
ఊగేసీ
వెళ్ళిపోతే
కాలమాగిపోతుందే...

రచన: రవికుమార్ — **3** — గానం: ఉన్నికృష్ణన్, లెనినా

నన్ను నాకు పరిచయం చేసినావె గొప్పగా
మల్లెపూల పరిమళం పంచినావె కొత్తగా
తూరుపింట వెలుగురేఖ చేరుతుండగా
గుండెనిండ సంబరం చిందులెయ్యదా
ఎవరూ ఏం తక్కువకాదు తెలివీ ఒక్కరికే లేదు

అ: గాలిలో గంతులేసే చివురాకువి కావొద్దోయ్
కడలిలో ఊయలూగే కర్రముక్కవి కావొద్దోయ్
ఆస్తికి ఒకడు సేవలకొకడని దత్తత తీస్కోరా
వాళ్లని కనిపెంచే పనిలేదురా
నిన్ను నాశనం చేసే కుర్రవాళ్లకి ఛాన్సే ఇవ్వద్దురా
మనసుకి కష్టం రానివ్వొద్దురా అబ్బీ
అమ్మా రమ్మంటూ గంగని నెత్తిమీద పెట్టుకుని
పనైపోయాక పోవే అంటే తలకాయొంచుకుపోవునా
కో: పెళ్లామంటె బెల్లమంటూ
ఇక్కట్లొంచి పోయినోళ్లు మోసపోయారు
బ్రహ్మచారి కుర్రవాడు
పనీపాట మానివేసి తిరిగి చెడ్డాడు అ: ॥చంద్రస్వామి॥
కో: ఐసలకా ఐసలకా ఐసలకా
పెళ్లాలగ్గట్టి తాళి కడితే లైఫే వేస్టంట
ఓ చుక్కని చూసి సైటు వేసుకో జల్సా చెయ్యమంట
చంద్రస్వామి బాలస్వామి
అ: అరెరె ఇంకో చరణం రాయి ఉంద్రా తమ్ముడు ఉంద్రా
కూర్చో... కూర్చో అక్కడ కూర్చో... అరె
కో: సుబ్బుస్వామి రామస్వామి
అ: రేయ్...ఎక్కిందిరా నీకు ఇంద సీకులు తిను... ఒద్దా...
సరే ఫో... పాడురా సామి పాడు... హూ...
కో: చంద్రస్వామి బాలస్వామి మీలోస్వామి మాంగోస్వామి
మల్టీకలర్ మందుస్వామి... ఎక్కింది సామి దిగింది సామి
ఎక్కింది సామీ దిగింది సామీ

రచన: భువనచంద్ర — 3 — గానం: డా॥ నారాయణ

భామా ప్రేమకోసం ఎన్నడైనా పరితపించావా
ఎదతో కన్నీరు నువ్వు కంటినుండి జార్చుకున్నావా
మగువలని మగజాతి కవితలు అంటుంది
కవితేమో చురకత్తై మనసుని పొడిచింది ॥భామా॥
కన్నె మనసే ఒక పూవా ఓ...



మదిని మాడ్చే ఒక మంటా ఓ...
మనిషి గుండె ఒక బండా ఓ...
ఆడుకోను ఒక బంతా ॥భామా॥
నీ మీదే ఆశలు ఎన్నో పెట్టుకున్నాడే బొమ్మా
అమ్మా నువ్ పోపొమ్మన్నా నిను వీడలేదే కొమ్మా
నేరమంతా తనదే అంటూ పిలిచినాడే అమ్మా
దుఃఖమంతా తను పడుతున్నా కంటరాదా చెమ్మా
దెబ్బకొట్టి తప్పేనంటూ వచ్చావా మళ్ళీ
చెప్పుకుంటే చేసిన పాపం పోవునా తల్లీ ॥భామా॥
భళ్ళునపగిలిన అద్దం అతుక్కునేనా మళ్ళీ
మాడిన పూవ్వును మళ్ళీ వికసించేనా తల్లీ
మూసిపెట్టి వుంచానన్నా దాగదే ప్రేమా
ఏక్షణాన ఏం చేస్తుందో తెలియదే భామా
కత్తికైనా ప్రేమకివున్న పదును లేదే బొమ్మా
గాయపడ్డా వెనుకే జ్ఞానం ఓ చింతకొమ్మా
ప్రేమే వేదనై పోయినది ఎందుకే కొమ్మా
కలలే కన్నీరైన కారణాలు తెలిసెనా అమ్మా
నీవల్లే ఆ గుండె నిప్పై మండినది
ఓయమ్మా... ఆ మనసు వ్యథతో నిండింది
ప్రేమే వేదనైపోయినది ఎందుకీ కొమ్మా

రచన: భువనచంద్ర — 4 — గానం: శ్రీనివాస్, సుజాత, వి. చంద్రన్

అ: ఆడమోద మగునేరమయ్యా మాటలాడమోదమగునే...
కలువ ముఖం చెలిది కలువ ముఖం
చిన్నారి మృదు వదనం మురిపించే ఆదికావ్యం
కలువ ముఖం చెలిది కలువ ముఖం
ఆ: ఘటోత్కచా... గదాధరా (2)
వివాహమే పసందురా
ఈనాడే హనుమద్భక్తుడి బ్రహ్మచర్యం ముగిసినదే
అంబాలా గుర్రం వంటి కన్నె కిలాడి దొరికినదే
ఇంద్రుడు చంద్రుడు అంటు నాయకుడంటు



నివురే కప్పేసిన నిప్పు నీలో లేదంటే తప్పు
ఆ నిప్పే శక్తనుకుంటే ఆ శక్తిని రాజెయ్యాలి
ఆ శక్తే శరమనుకుంటే గురిచూసి సంధించాలి
నీ చీకటి పయనంలోన ఆశయమే వెలుగవుతుంది
ఈ జీవన సమరంలోన అదే నిన్ను గెలిపిస్తుంది
అల్లిబిల్లి ఊసులేవో అల్లుతోంది నా హృదయం
నిన్నలేని ఊహలేవో జల్లుతుంటె ఈ ఉదయం
ముద్దబంతి పువ్వులో ఎన్ని వన్నెలో
వెన్నెలమ్మ నవ్వులో ఎన్ని వింతలో
మొలకే మరి మొక్కైపోదా చూస్తే బహుచిత్రం కాదా
చెట్టై అది ఎదిగేటందుకు మట్టేమరి మూలంకాదా
మబ్బేకద వానవుతుంది వానేకద వాగవుతుంది
చినుకే ఇల చేరేటందుకు చినుకేకద దారవుతుంది
నువ్వేకద నాలో ఆశా నువ్వేకద నాలో శ్వాసా
గెలుపే నను చేరిందంటే వెనుకే నీ సాయం లేదా
బీడుభూమి మారదా ఆకుపచ్చగా
చుక్కలైన అందవా నిచ్చెనెయ్యగా
సాగరాల్ని ఈదుతూ సాగినందుకూ
తీరమే చేరదా కనుల ముందుకూ

రచన: రవికుమార్ — 4 — గానం: రఘుకౌశిక్, రాజ్ ఆర్యన్

వానపామును ఎరవేసి చేపల్ని పట్టినట్టు
పైటకొంగు విసిరేసి వెంటతిప్పుకుంటారు
ఓరకంట చూస్తారు దారికడ్డు వస్తారు
అడ్డు తప్పుకోమంటే ముద్దపప్పు అంటారు
ఆఖరికి ఇదిగో ఇలా పప్పురుబ్బిస్తారొరేయ్
ఆడపిల్ల అగ్గిపుల్ల పాతకాలం మాటలే
ఆటం బాంబులకన్నా ఆడపిల్ల డేంజరే
హైటెక్ లేడీస్ షోకులన్ని చూడరో
ఈ కాలం పాపాయిలు జెట్ కన్న స్పీడురో





పర్సనాలిటీ వద్దంట ఏయ్ చికితా
పర్సువైపె చూపులంట మారుతీలె బోరంట
మాటీజ్‌లె హాయంట గ్రీటింగ్ కార్డులంటే ఓల్డ్‌ఫ్యాషనంటారు
ఇ-మెయిల్ అయితే గుడ్ టేస్టలంటారు
పిండివంట పేరు చెబితె నోవే అంటారు
పిజ్జా బర్గర్‌లంటె ఓ యస్ అంటారు
డేరింగైనా ఓకే బాసూ డేటింగైనా కాదే లాసూ
బ్రహ్మకైన రిమ్మతెగులు పుట్టించిపోతారు
అమ్మ బాబోయ్ లేడీస్ నమ్మించి ముంచుతారు
అమెరికాను కుదిపేసిన లాడెన్నే ఆఫ్టాలూ
భూగోళం కదిపేసే పవరేకద ఆడాళ్ళూ
ఐ లవ్ యు అంటారు ఐస్ క్రీం తింటారు
రక్షాబంధన్‌నాడు రాఖీకట్టేస్తారు
పాలిటిక్స్‌లో వున్నవి లిమిటెడ్ పార్టీలే
ఆడపిల్ల తలుచుకుంటే ఎవ్రీడే పార్టీలే
రాముడిలా వుండకురా రెండుజళ్ళ సీతలెవరు?
కృష్ణుడినే ఫాలో ఐతె గర్ల్‌ఫ్రెండ్స్ కానిదెవరు?
నక్సలైట్ల దేముందీ అడవుల్లో వుంటారు
టెర్రరిస్టులంటారా బోర్డర్లో వుంటారు
ఆడాళ్ళే ప్రాబ్లెమ్‌రా అక్కడైనా ఇక్కడైనా ఎక్కడైనా వుంటారు
కన్నుకొట్టి జెల్లకొట్టి మన అంతే చూస్తారు
పక్కింట్లోనా లేడీస్ ఫస్టుక్లాసులో పాసైతే
బుద్ధితెచ్చుకోమంటారూ అగ్గిలాంటి మా నాన్నారు
అందుకేరా లేడీసూ మన పురుషజాతికే ఎనిమీసూ
గురిచూసి గుండెల్లోనా గుచ్చేస్తారూ పిన్నీసూ!

రచన: రవికుమార్ — 5 — గానం: రవివర్మ, హిమబిందు

షు: హోయ్‌రామా వయ్యారిభామా ఆయో ఆయొ ఆమాయయ్యో
గుండెలోన గుబులాయే బోలో మైక్యాకరూఁ
ఆ: నా మనసే నీదయ్యాకా నువ్వూనేను ఒకటేనులే



# రాంపండు లీలలు

## రాంపండూ - ఆటల పోటీలు

**ఆవేళ పొద్దున్న అనంతం నిద్రలేచేటప్పటికీ రాంపండు సిద్ధం.**

**తమ వంశమర్యాదల గురించి అనంతానికి చాలా గర్వం. ఏ వేళ వచ్చినా అతిథిని కష్టపెట్టకూడదని అతని పెద్దలు చెప్పారుట. కానీ వాటిక్కూడా వేళా, పాళా వున్నాయనీ, అవి చెప్పడం పెద్దలు మరిచారనీ అనంత్ నమ్మకం. లంచ్‌టైముకి వచ్చి బుర్రతింటే ఓ దారి. డిన్నర్ టైముకి మరోదారి. కానీ పొద్దున్నే బ్రేక్‌ఫాస్ట్ వేళకే దిగడి దుఃఖగాథలు వినిపించడం అతిథులు చేయవలసిన పనికాదని అనంత్ సిద్ధాంతం.**

"చూడు తండ్రీ, నీ హృదయం బద్దలు కావడమో, ముక్కలు కావడమో, బద్దలయి ముక్కలు కావడమో, ముక్కలయి బద్దలు కావడమో జరిగింది. ఒప్పుకున్నా! అంతమాత్రం చేత ఇలా తెల్లారకుండా..."

రాంపండుకి అహం పొడుచుకు వచ్చింది. "సులోచన వ్యవహారం గురించి మాట్లాడడానికి రాలేదు నేను."

"హమ్మయ్య" అంటూ అనంత్ ఇడ్లీ ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

"గతం మర్చిపోవాలి. అదే మనిషి చేయగలిగేది". రాంపండు ఫిలాసఫించాడు.

"రైట్, రైట్". ఇడ్లీ నోట్లో కుక్కుకుంటూ తలవూపాడు అనంత్.

"నా గుండె హృదయాంతరాల దాకా గాయపడింది. అయినా పట్టించుకోకు".

"...కోను". ఇప్పుడు సాంబారు స్టేజి సాగుతోంది.

"మరిచిపో. మనసులోంచి తుడిచేయ్".

ఆ పాటికి అనంత్ మూతి తుడుచుకోవడం అయిపోయింది. "ఒరే నువ్వాసొద ఆపి, వేరేది మొదలెడతావా? నన్ను మళ్ళీ నిద్ర కుపక్రమించ మంటావా?"

రాంపండుకి భయం వేసింది. అనంత్ నిద్రపోతే అంతే సంగతులని. అసలే అతని పేరు అనంతశయనం. గబగబా తన ప్లాను చెప్పేశాడు.

రాంపండు కున్న వ్యసనాలు రెండే రెండు. ఒకటి ప్రేమలో పడడం, రెండోది జూదం. రకరకాలుగా ఉంటుంది. గుర్రప్పందెం, కవిత్వప్పందెం... ఈసారి స్కూలు ఆటల పోటీల పందెం. వేంవరంలో ఉన్న హైస్కూలు వార్షికోత్సవం సందర్భంగా ఆటలపోటీలు జరుగుతున్నాయి. ఊళ్ళో చీమ చిటుక్కుమనే ముందుకూడా ఎన్ని సార్లు చిటుక్కుమంటుందో చెప్పాలని పందాలు కట్టాలని సిద్ధంగా ఉన్న గుంపొకటి ఉంది. వాళ్ళను పెట్టుకుని నాలుగు డబ్బులు సంపాదిద్దామని రాంపండు అయిడియా. పెట్టుబడి కావాలంటే అనంతం దగ్గరకి రావలసినదే!

కానీ ఈసారి అనంత్ ఓ పట్టాన మెత్తబడలేదు. అచలపతి నడిగి చెప్తానన్నాడు. అతన్ని పిలిచాడు. విషయం చెప్పగానే అతను గడగడా అప్పచెప్పేశాడు.

"సర్, ఈ స్కూలు ఫంక్షన్ ఆటల పోటీల మీద పందాలు కాయడం అనాదిగా సాగుతున్నట్లు నాకు తెలియవచ్చింది. అందువల్ల గణాంకాల వివరాలు తేలికగానే లభ్యమవుతున్నాయి. 15 రకాల ఈవెంట్స్‌లో సాధారణంగా ఫేవరేట్స్‌యే ఎప్పుడూ గెలుస్తూ వస్తున్నారు. అందువల్ల వాళ్ళమీద పందెం కట్టించుకుని మనం సాధించబేయేది పెద్దగా ఏదీ లేదు. ఎవరూ ఊహించని విధంగా కొత్త క్యాండిడేట్‌ను, అంటే గుర్రప్పందాల భాషలో డార్క్‌హార్స్‌ను పోటీలో ప్రవేశపెట్టినపుడే మనకు లాభాలు వచ్చే అవకాశం ఉంది సర్".

రాంపండు ఎగిరి గంతేశాడు. "అలాటి కాండిడేట్ నాకు ఒకళ్ళు తెలుసు. 'మదర్స్ సాక్ రేస్' అని స్కూలు పిల్లల తల్లులు గోనుసంచులు తొడుక్కుని పరిగెడతారు చూడు - ప్రతీ ఏడాదీ దాంట్లో ప్రైజు కొట్టేసేది సుశీలమ్మే. అందరూ ఆవిడ మీదే పందెం కడతారు. కానీ నాకో ఆవిడ తెలుసు. విశాలాక్షి! ఈసారి గెలుపు ఆవిడదే. ఎవరూ ఊహించని డార్క్‌హార్స్!"

"ఆవిడ నీకెలా తెలుసు?" అడిగాడు అనంతం, రాంపండు తన ప్రేమ పరిధిని వివాహితలకు కూడా విస్తరిస్తున్నాడా అన్న అనుమానంతో.

"మొన్న కవిత్వప్పందాల కేసులో డబ్బు పోయిందిగా! ఇంకో కుర్రాడెవరైనా దొరికితే ప్రైవేటు చెబుదామని బుజ్జిని అడిగి చూశా. తన క్లాసుమేటే ఓ కుర్రాడున్నాడంటే వాడికీ చెప్పనారంభించా. వాళ్ల అమ్మగారే విశాలాక్షి..."

"మొత్తానికి ప్రైవేటు మాష్టరుగా స్థిరపడిపోతున్నావన్నమాట.."

"అధిక ప్రసంగం ఆపు. ఈవిడ విషయం విను. ఈ విశాలాక్షి రోజా కాఫీ ఇవ్వడానికి వచ్చి తెగ కబుర్లు చెబుతుందిలే. ఈ ఊరికి కొత్తగా వచ్చారట. ఇంతకుముందున్న ఊళ్లో స్కూలు వార్షికోత్సవాలలో పేరెంట్స్ పాల్గొనే ఆటల పోటీల్లో ప్రైజులన్నీ ఈవిడవేనట. ముఖ్యంగా ఈ గోనుసంచుల పోటీలో ఫస్టు ప్రైజు ఎప్పుడూ ఈవిడదేనట..."

"ఈ అనంత్‌కు ఇంతకంటె ఎక్కువ చెప్పనక్కరలేదు. తక్కినవాళ్లెవరైనా అయితే అర్థం చేసుకోలేరేమో కానీ అనంత్ సూక్ష్మగ్రాహి. నువ్వు చెప్పేదేమిటంటే విశాలాక్షి సామర్థ్యం గురించి ఊళ్లో వాళ్లకి అవగాహన లేదు కాబట్టి షీ ఈజ్ యే డార్క్ హార్స్.."

"మీరు పరిస్థితిని సరిగ్గా అంచనా వేశారు సర్. అలాగే ప్రజలు ఎరగని ఒక అజ్ఞాత హీరో పరుగుపందాలలో గెలిచే శక్తియుక్తులు ఉన్నవాడు నాకు

తెలుసు సర్." అన్నాడు అచలపతి.

"ప్రతీ ఏడాది ప్రకాశ్ అనే కుర్రాడేగా హాట్ ఫేవరేట్.. "అని అడ్డు వచ్చాడు రాంపండు.

"అవునుసర్. కానీ అతని కంటె వేగంగా పరిగెట్టగలడు ఈ ఇంట్లో పనిచేసే సుబ్బు అనే కుర్రవాడు." అన్నాడు అచలపతి.

"అచలపతీ, నువ్వు ఈ ఇంట్లోకి వస్తూనే చాలా సమాచారం సేకరించావు ఒప్పుకున్నా కానీ. ఆ సుబ్బుగాడు నాకు ఇంతప్పటినుండీ తెలుసు. వాడి ఒళ్లే వాడు మోసుకోలేడు. పైగా ఇది స్కూలు పిల్లలకి. వాడికీ చదువుకీ ఆమడ దూరం."అన్నాడు అనంత్ సాధికారంగా.

"..కానీ సుబ్బు ఇటీవలే నైట్‌స్కూల్లో చదువుతున్న సంగతి మీదాకా వచ్చి వుండదు సర్. ఒళ్లు విషయంలో మీతో నేను ఏకీభవిస్తున్నా అవసరం వచ్చినప్పుడు అతను చూపే లాఘవం మీరు ఊహించను కూడా ఊహించలేరని చెప్తున్నా." అన్నాడు అచలపతి, హితోపదేశం చేసే స్టయిల్లో.

"కానీ ఆ అవసరం ఎప్పుడు ఏర్పడుతుంది? మనకు అతని కళ చూసే అవకాశం ఎలా కలుగుతుంది? కళ్లతో చూడందే ఆ లడ్డూగాడి మీద పైస కూడా పెట్టుబడి పెట్టడానికి నేను సిద్ధంగా లేను." అని తేల్చి చెప్పాడు అనంత్.

"ఆ అవకాశం, అవసరం ఇప్పుడే కలిగించవచ్చు సర్. మీరొక రూపాయి ఇస్తే సుబ్బుకి లంచం పెట్టి వంటాయన మెల్లకన్ను మీద కామెంటు చేయమంటాను. వంటాయన తన మెల్లకన్ను గురించి కాస్త సెన్సిటివ్ గా ఫీలవుతాడు. ఒక్క మాట అని చూస్తే చాలు, తరిమి, తరిమి తంతాడు. అప్పుడు ప్రాణరక్షణ కోసం సుబ్బు పెట్టే పరుగులు, ఇదిగో మీరీ కిటికీలోంచి చూడవచ్చు..."

పదినిమిషాలలోనే అనంత్ కోసం ఆ ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేయడం, అంత భారీ శరీరాన్ని వేసుకుని సుబ్బు పరుగులు పెట్టడం చూడడం సంభవించింది. "నా దగ్గర ఉన్న ఆఖరి చిల్లిగవ్వ కూడా ఈ సుబ్బుగాడి మీద పెట్టుబడి పెట్టడానికి సంశయించను." అని అనంత్ గంభీరంగా ప్రకటించడం కూడా జరిగింది.

ఆ తరువాత వారం రోజుల్లో చాలా సంఘటనలు జరిగేయి. సుబ్బు ఆటలపోటీల్లో పేరు ఇవ్వడం, దానిమీద చాలామంది జోకులు వేసుకోవడం జరిగింది. ఎప్పుడైనా ఆవేశంలో వాడి అసలు ప్రజ్ఞ గురించి గొప్పలు చెప్పవద్దని రాంపండుకి వార్నింగు ఇవ్వడం జరిగింది. రాంపండు కూడా ఇది తన జీవన్మరణ సమస్య కాబట్టి సుబ్బు గాడిని చాలా జాగ్రత్తగా, అంటే అవీ, ఇవీ తిని ఆరోగ్యం పాడుచేసుకోకుండా, మరీ తిని ఇంకా లావెక్కకుండా, వాడి పరుగుపెట్టే దృశ్యం ఎవరి కంటా పడకుండా చూసుకుంటున్నాడు. ఎవరికంట బడినా ఫరవాలేదు కానీ భూషణం కంటబడకుండా ఉండాలని రాంపండు ప్రార్థిస్తుండగానే ఆ అనర్థం జరిగింది.

భూషణం అనంత్, రాంపండు గ్రూపుకి పోటీ సిండికేటు నడుపుతున్నాడు. ప్రతీసారీ గెలిచే ప్రకాశ్‌ను, తక్కినవాళ్లను నమ్ముకునే అతను పందాలు ఒప్పుకుంటున్నాడు.



సుబ్బు పరిగెడుతున్న దృశ్యం అతని కంటపడినట్లు కల వచ్చినప్పుడల్లా రాంపండు ఉలిక్కిపడి లేచి అనంత్ దగ్గరకి పరుగులు పెడుతున్నాడు. అనంత్ రక్షరేకు కట్టించి ఇచ్చినా రాంపండు కల నిజమయి కూచుంది.

అవేళ రాంపండు సుబ్బును దొంగతనంగా ఊరు బయటకు తీసుకెళ్లి రన్నింగు ప్రాక్టీసు చేయించి వస్తూ ఉంటే సినిమాహాలు దగ్గర భూషణం కనబడ్డాడు. మర్యాదకి అతన్ని హాలు క్యాంటీనుకి పిలిచి టీ ఇప్పిస్తూంటే తుంటరితనానికి మారుపేరైన సుబ్బు భూషణం మోటరు సైకిలు ఎక్కి స్టార్టు చేయడం, రయ్యిన ముందుకు తీసుకెళ్ళి కింద పడేయడం జరిగింది. భూషణం కంగారుగా బయటకు వచ్చి చూసి సుబ్బుకి రెండు తగిలించబోయేడు. దాంతో సుబ్బు ఆపత్సమయాల్లో ఆదుకునే పరుగు కళను ఆశ్రయించాడు.

సుబ్బును పరుగుపెడుతూండగా చూసిన భూషణం నోరు అలాగే తెరిచి ఉంచేశాడు. మోటరు సైకిలు గగ్గోలు పెడుతున్నా పట్టించుకోలేదు. వీడిని తక్కువ అంచనా వేసి తను చేసిన పొరబాటు ఏమిటో తెలిసివచ్చింది. సుబ్బు మీద పెట్టుబడి పెట్టిన అనంత్ గ్రూపు ఇస్తోకు ముక్క ఎవరో తెలిసిపోయింది.

దాని ఫలితమే మర్నాడు స్కూలు అసెంబ్లీలో అతను చేసిన కుట్ర. ఈ లోగా రాంపండు సుబ్బు పరుగును చూసిన భూషణం హావభావాలను యాక్షన్‌తో సహా వర్ణించి చెప్పడంతో శత్రువు అలర్ట్ అయిపోయిన విషయం అనంత్ గ్రూపుకి తెలిసిపోయింది. ఇంకో డార్క్ హార్స్ లేకపోతే సిండికేట్ మునిగిపోవడం ఖాయం అనుకుంటూండగానే అచలపతి దాచుకున్న ఇంకో పేకముక్క బయటకు తీసాడు.

"సర్, చిన్నపిల్లల లెమన్ అండ్ స్పూన్ పందెం గురించి మీకు తెలుసుగా..నోట్లో చెంచా పెట్టుకుని దాంట్లో నిమ్మకాయ పెట్టుకుని ఎవరు వేగంగా నడిస్తే వాళ్లకి ప్రైజు ఇస్తారూ..దాంట్లో.."

"తెలుసులేవయ్యా, ప్రతీసారీ ఆ పిలకజడ సుమతికేగా ప్రైజు. దాంట్లో మనకేమీ ఛాన్సు లేదు. ఆ స్టాటిస్టిక్స్ అన్నీ ముందే స్టడీ చేసి పడేశాను" అన్నాడు అనంత్ విసుగ్గా.

"సర్, మీరు కాస్త ఓపిగ్గా వినాలి. మన తోటమాలి కూతురు వెంకటలక్ష్మి కూడా దాంట్లో పాల్గొంటోంది. ఆమెకు ఛాన్సు ఉందని నా ఉద్దేశ్యం." అన్నాడు అచలపతి తొణక్కుండా.

"ఎలా, ఎలా..?" అన్నాడు రాంపండు ఆత్రుతగా. అతనికి ఇది రోటీ, కపడా ప్రశ్న. ఈ పందాలలో ఓడిపోతే జీవితాంతం అల్లరి కుర్రాళ్లకు ట్యూషన్లు చెప్పుకు బతకవలసి వస్తుందని అతని భయం.

"నాకు తోటమాలి స్వయంగా చెప్పాడు సర్. రోజూ సాయంత్రం గిన్నె నిండా అంబలి వెంకటలక్ష్మి పట్టుకొస్తుందట. ఒక్క చుక్క కూడా ఒలకదట. అంత స్టడీహేండు ఉన్న పిల్ల ఈ పందెంలో ఈజీగా గెలుస్తుంది." అచలపతి ధీమాగా చెప్పాడు.

"రైటో, అయితే వెంకటలక్ష్మి మీద పందాలు ఒప్పుకో" అని ఆర్డరేశాడు అనంతం. కానీ రాంపండుకి ధైర్యం చిక్కలేదు. "ఒద్దురా, ఇంకా పెట్టుబడి అంటే భయం వేస్తోంది" అంటూ లబలబలాడేడు...

స్కూలు ఫంక్షన్ రెండురోజులుందనగా భూషణం వేసిన ట్రిక్ ఫలించింది. అవేళ స్కూలు అసెంబ్లీలో ప్రార్థన జరుగుతూండగా ఉన్నట్టుండి సుబ్బు కెవ్వున అరిచాడు. పిల్లలంతా ముందు ఉలిక్కిపడి, తర్వాత పకపక నవ్వారు. హెడ్‌మాష్టారు పరంధామయ్య గారికి ఒళ్లు మండిపోయింది. ఇలాటి చిలిపిచేష్టలు సుబ్బు ఇంతకు ముందు చాలా చేశాడు కానీ ఇదే అన్నిటికీ హైలైట్. చరచర వాడి దగ్గరికి నడిచేడు బెత్తం పట్టుకుని.

"ఏరా, తోకతిప్పిన పందిలా ఏమిట్రా ఆ అరుపు? నిలువునా చీరేస్తాను జాగ్రత్త!"

సుబ్బు పాపం ఎప్పట్లా కొంటెగా నవ్వడం లేదు. భయంతో వణుకుతున్నాడు, చొక్కా విదిలించుకుని చూసుకుంటున్నాడు.

"ఏం జరిగిందిరా అంట్ల వెధవా! ఏమిటా నాటకాలు?" పరంధామయ్య గారు గావుకేక పెట్టాడు.

"పు..పురుగండి. ఎవరో నా చొక్కాలో పడేశారండి. నాకు పురుగులంటే తెలుసుకదండి.."అంటూ ఏడుపుమొహం భయమని మీకూ పెట్టాడు సుబ్బు.

పరంధామయ్య కరగలేదు. "వెధవ్వేషాలు ఆపు. ఎన్నిసార్లు చెప్పినా నీ అల్లరి తగ్గలేదు. నీ పని ఇలా కాదు. నువ్వు ఆటలపోటీల్లో పేరిచ్చావు కదూ, నిన్ను తీసేశాను ఫో. దిక్కున్నచోట చెప్పుకో. హన్నా! తుంటరితనం మరీ పెరిగిపోయింది. ఒక్కసారి ఇలా చేస్తే తప్ప నీకు బుద్ధి రాదు. లేకపోతే నిన్ను చూసి మిగతావాళ్లు తగలడతారు."

పరుగుపందెంలోంచి తీసేసినందుకు సుబ్బు బాధపడ్డాడో లేదో తెలియదు కానీ వాణ్ని అనుక్షణం కనిపెట్టుకు తిరుగుతున్న రాంపండు మాత్రం గొల్లుమన్నాడు. పైగా సుబ్బు పక్కన నిలబడ్డ మోహన్‌కి అసెంబ్లీ అయిపోయిన తర్వాత భూషణం ఐస్‌క్రీము ఇప్పిస్తూ కనబడడంతో కుట్ర మొత్తం అర్థమయి రాంపండు మరింత కుళ్లుకున్నాడు. వెంటనే వచ్చి సిండికేట్ దగ్గర మొత్తుకున్నాడు.

"ఒరేయ్, అనంతూ, ఆ భూషణం గాడు మోహన్ అనే కుర్రాడికి లంచం పెట్టి సుబ్బుగాడిని పోటీలోంచి తప్పించేసాడురా. అయినా ఆ సుబ్బు గాడిలాటి రాలుగాయి కుర్రాడికి పురుగులంటే అంత భయమేమిట్రా? అందరూ కళ్లు మూసుకుని ప్రార్థిస్తూ ఉంటూ ఈ మోహన్ గాడు సుబ్బుగాడి చొక్కాలో ఓ పురుగు పడేయడం, వీడు కెవ్వుమని గుండెలవిసేలా అరవడం.. అంతా మన ఖర్మానికి వచ్చిందనుకో.."




అనంత్ ఓదార్చాడు. "అచలపతి ఉన్నాడుగా ఏదో ఒకటి చూస్తాడులే. ఎవిరిథింగ్ ఈజ్ ఫెయిర్ ఇన్ లవ్ అండ్ వార్ అన్నారు. ఇలాటి మోసాలు ఉంటాయనే వెంకటలక్ష్మిని రంగంలోకి దించాం. నువ్వు చెప్పిన విశాలాక్షి ఎలాగూ వుంది. ఊరికే కంగారు పడకు."

"ఏమోరా, నీకయితే ఇది వినోదం కానీ, నాకు లైఫ్ అండ్ డెత్ కొశ్చన్. ఒక్కోసారి విసుగేసి ఆ భూషణం గాడితో చేతులు కలిపేద్దామా అనిపిస్తోంది. మొన్న ఆఫర్ ఇచ్చాడు కూడా.."

"అలాటి పిచ్చిపని చేయకు. అఫ్‌కోర్స్, నీకు కావాలంటే సిండికేట్ లోంచి బయటకు వెళ్లిపోతానంటే నేను అభ్యంతరపెట్టను. కానీ అచలపతి ఉన్నాడుగా..పెట్టుబడి కూడా పెట్టాడు..ఏదోలా చక్రం అడ్డువేస్తాడులే.."

రాంపండు అప్పటికి శాంతించాడు కానీ ఫంక్షన్ రోజున వెంకటలక్ష్మిని చూడగానే నీరుకారిపోయాడు. ఆ రోజు కాస్సేపటిలో పోటీలు ప్రారంభమవుతాయనగా ఓ పదేళ్ల పిల్ల అనంత్, రాంపండుల దగ్గరికి వచ్చింది. వస్తూనే రాంపండుని చిరకాలంగా ఎరుగున్నట్టు లాటరీలో తనకు బహుమతిగా వచ్చిన బొమ్మ గురించి మాట్లాడ్డం మొదలుపెట్టింది.

"మరేమో, నా బొమ్మ లేదూ, దానికి బంగారూ అని పేరు పెట్టానులే. దాన్ని రోజూ రాత్రి నా పక్కలో పడుక్కోబెట్టుకుని... అస్సలు ఏడవదులే. చాలా మంచిది. మరేమో, పొద్దున్నే లేపి, స్నానం చేయించి.."

అసలే చికాగ్గా ఉన్నాడేమో రాంపండు "చాల్లే, సొద" అని విసుక్కున్నాడు కానీ వంశమర్యాద కాపాడడానికి కంకణం కట్టుకున్న అనంత్ మాత్రం "పాపా, నువ్వు కాస్సేపు మాట్లాడ్డం ఆపితే మేం ఈ ఆటల పోటీలు చూస్తాంగా. ఇప్పుడు స్కూలు పిల్లల తల్లులందరూ గోనుసంచులు తొడుక్కుని పరిగెడతారన్న మాట. నువ్వూ, మీ బంగారూ కూడా చూడండి." అని ఊరుకోబెట్టబోయాడు.

"నేనూ పోటీల్లో పాల్గొంటాగా.." అంది ఆ పాప కళ్లు మహా తిప్పుతూ.

"ఏదీ వాగుడుపోటీల్లోనా...?" అడిగాడు రాంపండు కసిగా.

"కాదు, లెమన్ అండ్ స్పూన్. మరేమో నిమ్మకాయ ఒక చెంచాలో పెట్టుకుని..." అంటూ పాప చెప్పబోతుండగానే ఆత్రం పట్టలేని రాంపండు "నీ పేరు సుమతా?" అని అడిగేశాడు.

ఆ పిల్లకు కోపం వచ్చేసింది.

"కాదు, సుమతి అంటే అది. ఆ ఎర్ర పరికిణీ లేదూ, ఆ పిల్ల. నా పేరు వెంకటలక్ష్మి. సుబ్బు మా క్లాసే. వాడిని పోటీల్లోంచి తీసేశారుగా. మా బాగా అయింది. మొన్న నా జడ పట్టుకుని లాగి....." అంటూ మళ్లీ మొదలెట్టింది.

కానీ రాంపండు అవేవీ వినేస్థితిలో లేడు. తన ఎదురుగా ఉన్న నల్లటి, పొట్టి, గుమ్మటం లాంటి స్వరూపమే వెంకటలక్ష్మి అని తెలియగానే అతనికి భయం వేసింది. "ఒరే అనంతూ, అచలపతిని నమ్ముకుని పొరపాటు చేసాంరా. ఈ అమ్మాయి వణక్కుండా, బెణక్కుండా గిన్నె నిండా అంబలి తేవచ్చు కానీ, స్పీడ్ సంగతి ఆలోచించి చూడు. ఆ సుమతిని చూడు. చలాకీగా, సలాకలా ఉంది. ఈ వెంకటలక్ష్మి కదిలేసరికి ఆ సుమతి ఆరడుగులు ముందుంటుంది. ఒరే, అచలపతి హామీ చూసుకుని ఈ వెంకటలక్ష్మి మీద చాలా పెట్టుబడి పెట్టేసానురా. కొంప మునిగినట్టుంది" అంటూండగానే అచలపతి వాళ్ల దగ్గరకి వచ్చాడు.

"సర్, ఈ భూషణానికి చాలా మంది గూఢచారులు ఉండి ఉంటారు. మన విశాలాక్షి మంచి కాండిడేట్ అని అతనికి తెలిసిపోయి నట్టుంది. తన కాండిడేట్‌కి గట్టిపోటీ ఇస్తుందని గ్రహించేసేడు లాగుంది. ఇందాకటి నుండి చూస్తున్నాను. వెళ్లి అవీ, ఇవీ కబుర్లు చెప్పి మూడుసార్లు స్కూలు క్యాంటీనుకి తీసుకెళ్లి బోల్డంత మెక్కబెట్టాడు. ఇప్పుడావిడ ఓ మూల కూర్చుని ఆపసోపాలు పడుతోంది. పోటీలో ప్రైజు రాకపోయినా ఫర్వాలేదు. దాన్లో వచ్చేదాని కంటె ఎక్కువ ఖరీదైన ఐస్‌క్రీములు పెట్టించాడు ఈ పెద్ద మనిషి అంటోంది పక్కావిడతో" అని వార్త మోసుకొచ్చాడు.

విషయం వింటూండగానే వెంటనే రియాక్టయింది రాంపండే! "ఒరే, అనంతూ, క్షమించరా, నేను పార్టీ ఫిరాయించేసాను. భూషణం గాడితో చేతులు కలిపేస్తున్నాను. ఈ లెమన్ అండ్ స్పూన్ రేసు మీద చాలానే రిస్కు తీసుకున్నాను. పోతే తట్టుకోలేను" అంటూ భూషణం కోసం పరుగు పెట్టాడు.

రాంపండు అనుకున్నదే అయింది. గోనెసంచుల పోటీలో విశాలాక్షికి మూడో స్థానం. నిమ్మకాయల పోటీలో వెంటకలక్ష్మికి ఆరోస్థానం వచ్చాయి. కానీ ప్రైజులు ఎనౌన్స్ చేయడానికి కాస్త ఆలస్యమయింది. దానికి కారణం హెడ్‌మాస్టారు పరంధామయ్య తన ప్రసంగంలో వివరించారు.

"....ఈ ఆటల పోటీలు పిల్లలలో క్రీడా స్ఫూర్తిని పెంపొందించడానికి ఉద్దేశించబడ్డాయని అందరికీ తెలుసు. కానీ ఊళ్లో కొందరు సోమరులు, జూదరులు ఈ పిల్లలను గుర్రాల కింద జమకట్టి వాళ్ల మీద పందాలు కట్టి డబ్బు చేసుకుంటున్నారని తెలిసి చాలా బాధపడుతున్నాను. కానీ సాక్ష్యాలు దొరక్క ఏమీ చేయలేక పోతున్నాను. మూడేళ్ల క్రితం ఇటువంటి సంఘటన నా దృష్టికి వచ్చింది. అదృష్టవశాత్తూ సాక్ష్యం కూడా లభించింది. అప్పుడు పోటీలన్నీ కాన్సిల్ చేసి వేశాను. ఈ ఏడాది కూడా ఇటువంటి పందాలు జరిగాయని నాకు సాక్ష్యం దొరికింది...."

ఎఫెక్ట్ కోసం పరంధామయ్య ఆగినప్పుడు అనంత్ అచలపతి కేసి చూడబోయి ఎక్కడున్నాడని కళ్లతో వెతికాడు. పరంధామయ్యకు కాస్త దూరంగా తలవంచుకుని నిలబడ్డ అచలపతిని చూసి అయోమయంలో పడిపోయేడు. ఇంతలోనే పరంధామయ్య తన ప్రసంగాన్ని కొనసాగించేడు.

".....పని పాటాలేని ఓ కుర్రజమీందారు తన వద్ద పనిచేసే అతని ద్వారా లెమన్ అండ్ స్పూన్ పందెంలో పాల్గొనే కొంతమంది పిల్లలకు లంచం పెట్టి ఆటల ఫలితాలను తన స్వార్థం కోసం ప్రభావితం చేశాడు. యజమాని ఆజ్ఞ మేరకు అతని ఆదేశాన్ని శిరసావహించినా, ఆ పనివాడి అంతరాత్మ మాత్రం ఊరుకోలేక పోయింది. తను చేసిన తప్పు ఒప్పుకోమని చెప్పింది. అంతరాత్మ ప్రబోధాన్ని విని అతను జరిగిన సంగతి యావత్తు నాకు వివరించి క్షమాపణ కోరాడు..." ఇక్కడ పరంధామయ్య ఆగి, అచలపతి కేసి ఒక్కసారి చూసి, తిరిగి ప్రసంగం కొనసాగించడం అనంత్ దృష్టిని దాటిపోలేదు.

"నేరాన్ని ఒప్పుకున్న వ్యక్తి కోరిక మేరకు అతని పేరును, అతని యజమాని పేరును నేను బయట పెట్టడం లేదు. కానీ లంచం పుచ్చుకుని ఆటలాడిన పిల్లలను మాత్రం పోటీనుండి తొలగిస్తున్నాను. లెమన్ అండ్ స్పూన్ పోటీలో మొదటగా వచ్చిన ఐదుగురు పిల్లలను అనర్హులుగా ప్రకటిస్తూ ఆరవ స్థానంలో వచ్చిన వెంకటలక్ష్మిని విజేతగా ప్రకటిస్తున్నాను. అమ్మాయ్, వెంకటలక్ష్మీ... ఇలా రా. లంచం ఇవ్వజూపినా పుచ్చుకోని నీ నిజాయితీని అభినందిస్తూ ఈ బహుమతిని నీకు అందజేస్తున్నాను..."

ఈ ప్రకటన వింటూ రాంపండు చేసిన ఆర్తనాదం ప్రజల హర్షధ్వానాల మధ్య వినబడలేదు.

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పి.జి.ఉడ్‌హౌస్ రాసిన "ది ప్యూరిటీ ఆఫ్ ది టర్ఫ్" కథ ఆధారంగా)**

**ప్రసిద్ధ హాస్య రచయిత - 'కాంతం కథల' మునిమాణిక్యం జయంతి (మార్చి 15) సందర్భంగా గత సంచికలో వెలువడిన ఉపాధ్యాయ ఉవాచ తరువాయి భాగం ఇది.**

క్లాసిక్స్ రీటోల్డ్



# ఉపాధ్యాయ ఉవాచ

మునిమాణిక్యం నరసింహారావు

**ఉపాధ్యాయుడి జీవితం అంధకార బంధురమూ కాదు, బ్రతకలేక బడిపంతులు కావడం అనే మాట నిజమూ కాదు. అనుభవించే వాడికి ఈ జీవితం కూడా హాస్యరసం ఇస్తుంది. ఈ సంగతి చెప్పడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం.**

విద్యార్థుల ఆకతాయితనాన్ని ఇలా భరిస్తుంటే, ఉపాధ్యాయుడనబడే బడుగు మానిసి, పై అధికారుల ధాం ధూంలు కూడా సహిస్తూ ఊరుకోవాలి. వాళ్ళు ఒక్కొక్కప్పుడు ఒంటి కాలిమీదా, మరొకప్పుడు రెండు కాళ్ళమీద కూడా లేస్తూ ఉంటారు. ఆ లేవడానికి సరి అయిన కారణం ఉండక్కర్లేదు. వాళ్ళు ఉపాధ్యాయుల్ని కేక లెయ్యడం తెలిసి కొంతా, తెలియక కొంతాను.

ఓ రోజు మా పాఠశాల ప్రెసిడెంటు గారు ఆ గదీ ఈ గదీ చూసుకుంటూ సైన్సు గదిలోకి వెళ్ళారు. గది మూల పగిలిపోయిన గాజుబుడ్లు కనిపించాయి. టెస్టుట్యూబులకీ ఫ్లాస్కులకీ ఆయన పెట్టుకున్న పేరు గాజుబుడ్లు - మొదట ముఖం చిట్లించి, విసుక్కుని ఆపైన కోపంగా "ఏమయ్యా, మంచీ చెడ్డా తెలియనక్కర్లేదూ? ఇన్ని బుడ్లు పగలగొట్టించావుకదా ఎవరి సొమ్ము అనుకున్నావు? చిన్నతనపు చేష్టలా లేక కొంటెతనమా?" చివాట్లు పెట్టారు.

దానికి సైన్సు మాష్టారు వినమ్రుడై "పిల్లలు వాటితో పని చేసేటప్పుడు ప్రమాదవశం చేత అవి పగులుతాయి" అని విన్నవించుకున్నాడు.

వెంటనే ప్రెసిడెంటుగారు "అవునయ్యా నాకూ తెలుసు. అయినా గాజు బుడ్లు పిల్లల చేతికిస్తావా? సున్నితమైన వస్తువుని పిల్లలకి ఇస్తే ఏమవుతుంది? ఇన్నాళ్ళూ చదివి నువ్వు నేర్చుకున్న విషయం ఇదేనా? ఈ గాజు బుడ్లు పిల్లల చేతికి ఎందుకిచ్చావు? ఏదైనా పని ఉంటే నువ్వు చేసి వాడికి చూపించరాదా?" అన్నారు.

సైన్సు మేష్టారుకి ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తోచలేదు. చివరికి నెమ్మదిగా 'వాళ్ళ చేతికి ఇయ్యక తప్పదండీ" అన్నాడు.

"చాలు చాల్లేవయ్యా. అంతగా తప్పకపోతే నాకు మాట మాత్రంగానైనా చెప్పి ఉండవలసింది. దాని దుంపతెగ, పోతే పోయింది. ఇత్తడివో సీనారేకువో ఇనుపవో చేయించి పడేసేవాణ్ణి. కుర్రాళ్ళు మాస్టరుగా ఉంటే కష్టసుఖాలు తెలియవుగదా" అంటూ పెద్ద పెద్ద అంగలేసుకుంటూ ఇవతలికి వచ్చారు. ఆ రావడం రావడం తిన్నగా నా జాగ్రఫీ క్లాసులోకి వచ్చారు. క్లాసులో మేష్టార్ని అడిగి మరీ లోపలికి రావాలనే సంగతి ఆయనకి తోచలేదు. తోచకపోతే పోయె, తిన్నగా వచ్చి నేను కూర్చోవలసిన కుర్చీలో తను వచ్చి కూర్చున్నాడు. కూర్చుని "ఏమిటయ్యా, పాఠం చెబుతున్నావా ఆడుకుంటున్నావా - టేబిల్ మీద ఆ బంతి ఏమిటీ?" అన్నాడు.

"అది బంతి కాదు సార్ - గ్లోబ్... భూగోళం" అన్నా సవినయంగా. "తెలుసు లేవయ్యా" అంటూ దానిమీద చెయ్యి వేశారు. అది గిర్రున తిరిగింది. "అయిందీ! దీని సీలలు కూడా ఊడగొట్టావన్నమాట - అక్కడ ఆ సైన్సు మేష్టారు బుడ్లు పగుల గొట్టాడు. నువ్వు దీని మేకులూ సీలలూ ఊడగొట్టావు. ఎల్లా తిరిగి పోతోందో చూడు... ఉండు నీపని చెప్తాను. దీన్ని కమిటీ వాళ్ళందరికీ చూపించి నీ వ్యవహారం తేలుస్తాను" అంటూ ఆ గ్లోబ్ పట్టుకుని బయలుదేరాడు.

నేను కావాలనే "అయ్యా క్షమించాలి. ఏదో పొరపాటు జరిగింది. ఈ సంగతి కమిటీ ముందు పెట్టి నా ఉద్యోగం ఊడగొట్టించకండి" అంటూ వెనకాలే వెళ్ళి బ్రతిమాలాను. కాని ఆయన బిగిసి పోయాడు. తర్వాత ఆయన కమిటీ ముందు ఆ గ్లోబ్ పెట్టడం, వాళ్ళు ఆయన్ని చివాట్లు పెట్టడం, తర్వాత నన్ను చూసినప్పుడల్లా ఆయన ముఖం కోపంగా పెట్టడం, జరిగింది.

ఉపాధ్యాయుడు కమిటీ మెంబర్ల ధాటీకి తట్టుకోవడమే కాదు - తల్లిదండ్రుల ఆగ్రహావేశాలకి కూడా ఒక్కొక్కప్పుడు తలవంచాలి.

ఒక రోజు ఒక విద్యార్థి తండ్రి, మల్లయ్య శ్రేష్ఠిగారనుకుంటాను, రౌద్రమూర్తియై వచ్చి, తను స్కూలు కమిటీలో మెంబరుననే విషయం సూచిస్తూ "ఏమయ్యా మేష్టారూ - మా అబ్బాయిని ఆరో క్లాసులో వెయ్యలేదట - అయిదో క్లాసు తప్పించావట! ఏం!... ఎంచేత?" అన్నాడు కారాలు మిరియాలు నూరుతూ.

ఆయనకి విషయాన్ని నచ్చ చెప్పవలసి అవసరాన్ని గుర్తించిన వాడనై "అయ్యా! మీరు వర్తకులు గదా! మీ అబ్బాయి రేపు బేరాలు చేస్తుంటే సరిగ్గా పద్దులు వ్రాయవద్దా! అవే ఇక్కడ నేర్పుతున్నాము. మాటలు తప్పులేకుండా వ్రాయగల అక్షర జ్ఞానం మీవాడికి రాలేదు. అందుచేత తప్పించాము"

అన్నాను. "ఏమాట తప్పు వ్రాశాడండి" అని ఆయన అడిగాడు. చింతపండు అనే మాట "శింతపండు" అని వ్రాశాడండి అని చెప్పి ఆయన సానుభూతిని, ఆమోదాన్ని కోరే ఒక చిరునవ్వు నవ్వాను. ఆయన బదులుగా చిరునవ్వు నవ్వాలా? ఊహు! ఆయన పెదవులపై చిరునవ్వు ప్రతిఫలించక పోగా ముఖం ముడతలు పడింది. విసుగుతో "ఓసీ - ఇదిటయ్యా... నేనింకా ఏమిటో అనుకున్నాను... లేనిపోని చాదస్తాలు పెట్టుకోకు! చింతపండు అంటేనేమి? శింతపండు అంటేనేమి? దాని పులుపు విరిగిందా? ధర తగ్గిందా? చాలు చాలు - ఇలాగే రాయాలి, అలాగ రాయకూడదు అని పిచ్చి పిచ్చి పట్టింపులు పెట్టుకోకుండా, పైక్లాసులో వేసి, డోకరాలు కట్టడం నేర్పి కాస్త లెక్కా డొక్కా గట్టి చెయ్యండి - ఏం తెలిసిందా?" అంటూంటే, నా ఉద్యోగం నిలుపుకొనేందుకు తల ఊపి 'చిత్తం' అనాల్సి వచ్చింది...

తల్లి దండ్రులతో ఇలాగే అనేకం.

కలరా వల్ల నూటికి 12.7 చనిపోయారంటే, ఓ తండ్రిగారు "మధ్యలో ఆ చుక్కేవిటయ్యా" అంటే "పన్నెండు కంటే ఎక్కువ. పదమూడు కంటే తక్కువా" అని చెప్పాల్సి వచ్చింది. "అంటే? అంటూ ఆయన తల గోక్కుని "ఓహో పన్నెండుగురు పూర్తిగా చచ్చారా?" పదమూడోవాడు ఏడు వంతులు చచ్చి మూడు వంతులు చావకుండా ఉన్నాడా? సరిసరి... అర్థం అయిందిలే" అంటూ వెళ్ళిపోయారు.



ప్లీడర్లు, జడ్జీలు, డాక్టర్లు, యాక్టర్లు వీళ్ళంతా "మేష్టారీ పని హాయి, లాయర్లు క్రొత్త విషయాలూ, క్రొత్తగా వచ్చిన జడ్జిమెంట్లు ఎప్పటి కప్పుడు క్రొత్తగా తెలుసుకోవాలి. మేష్టర్లకి అలా కాదు. చెప్పిందే చెప్పొచ్చు. క్రిందటి సంవత్సరం భూమి గుండ్రంగా ఉండి ఈ సంవత్సరం చప్పున మారి బల్లపరుపు కాదు కదా. ఒక మందు బదులు మరో మందు ఇస్తే మా వృత్తిలో కొంపలంటుకుంటాయి. మేష్టరికి అన్నీ శలవలే - శనివారం, ఆదివారం, పండగవస్తే, చలేస్తే, ఎండకాస్తే, వానకురిస్తే, వరద వస్తే, ఉన్న ఊళ్ళో ఉత్సవమైతే, ప్రక్క ఊళ్లో బాజా వాయిస్తే, ఇలా ఎన్ని శలవలో" అంటూ మేష్టారీ అంత హాయి మరోటి లేదంటారు.

ఉపాధ్యాయుడికి ఉండే బాధలు ఉపాధ్యాయుడికి ఉన్నాయి. పై అధికారుల వద్ద నుంచి మొట్టికాయలూ, కుర్రవాళ్ళ దగ్గర వెటకారాలూ, వెక్కిరింపులూ. క్లాసులో నలభై మంది ఉన్నారంటే, నలభై మందివీ నలభై రకాల మనస్తత్వాలు, వీళ్ళందరికీ ఒక్కటే పాఠం చెప్పాలి. అంతకంటె నలభై అడవి మృగాల్ని సర్దడం సులభం. ఎందుచేతంటే, అవన్నీ ఒక్కలాటివే. ఒకదానికి గడ్డి ఒకదానికి వంకాయలు ఇష్టం అంటూ లేదు. భిన్న భిన్న ప్రకృతులు గల క్లాసులో ఒకడికి బొమ్మలంటే ప్రేమ. చరిత్ర పాఠం ఎంత కష్టపడి చెబుతున్నా వాడికి రవ్వంతయినా రుచించదు. ఆయన ఆవేదనతో చెబుతూంటే, వాడు ఆ చెబుతున్న మేష్టారి బొమ్మ వికృతంగా గీస్తూ ఉంటాడు. భిన్న రుచులు గల విద్యార్థులకి ఒకే రకమైన విద్య గరపడంలో ఉపాధ్యాయుడికి ఎంతో కష్టం ఉంది. తరుణ వయస్కులైన విద్యార్థుల ఉత్సాహం ఉరకలు పెడుతూ ఉంటుంది. వారి జీవితంలో చైతన్యం ఎక్కువ, ఒకచోట అరగంట సేపు నిలకడగా కూర్చోలేరు. పట్టుమని పది నిముషాలు ఏ విషయాన్నీ వినను లేరు. రాళ్ళపై నుండి జలజలమంటూ, దూకుతూ, పోయే సెలయేరు లాగ ఉంటుంది వాళ్ళ జీవితం. అలాంటి కుర్రాళ్ళకి పాఠాన్ని తియ్యని మాటలతో ఆకర్షణ ఏర్పడేలాగ చెప్పాలి. ఇదంతా అందరూ అనుకుంటున్నట్లు అంత సులువైన పని కాదు.

సరే - అది అలా ఉంచండి.

ఈ ఉపాధ్యాయ వృత్తిలో ఉండే సాధక బాధకాలు చెప్పడం పూర్తి చెయ్యబోయేముందు ముఖ్యమైన సంగతి ఒకటి చెప్పాలి. అదేమిటంటే, 'ఇంట గెలిచి రచ్చగెలువు' అన్నట్లు, మొదట తనింట్లో తాను ఉత్తమ ఉపాధ్యాయుడుగా రాణించాలి. అప్పుడే బయట ఉత్తమ ఉపాధ్యాయుడో, ఉత్త ఉపాధ్యాయుడో అయ్యేది.

క్రొత్తగా మాస్టరీ పని దొరకడంతోనే అతనికి ముందుగా తన భార్యకి చదువు చెప్పుకోవాలనిపిస్తుంది. ఆవిడ ఇంగ్లీషులో మాట్లాడితే చూడాలని లేదా వినాలని ముచ్చట పడతాడు. ఇంగ్లీషు పుస్తకం కొని పట్టుకొస్తాడు. అక్షరాలదాకా నిరాటంకంగా సాగిన తర్వాత లక్ష ఆటంకాలు. ఆవిడ ఆ ఇంగ్లీషు పుస్తకాన్ని ఏ చారు రాచ్చిప్ప మీదో మూత పెడుతుంది. దాంతో అతని గుండె బేజారయిపోయి ఇంక ఆ చదువు కట్టిపెడతాడు. ఒకవేళ పట్టుదలతో సాగించాలనుకున్నా పగలు ఆయనకి తీరిక ఉండదు. రాత్రి ఆమెకి ఇష్టం ఉండదు. కాదూ కూడదని రాత్రి భోజనాలయాక బలవంతంగా కూర్చోబెట్టి పాఠం మొదలెడితే, కళ్ళు మూస్తూ తెరుస్తూ చిటికెలేస్తూ ఉండగానే మధ్య ఏదో ముఖ్యమైన విషయం జ్ఞాపకానికి వస్తుంది ఆ పిల్లకు. "ఈ చదువుకేం కానీండి- రేపు కార్తీక మాసానికి యుద్ధం ఆపేసి నవరసులు చౌక చేస్తారటగా?" అంటుంది. ఏమిటి ఆ మాటకర్థం? అంటే నవరసులు ప్రియంచేసి ఆడవాళ్ళను ఏడ్పించేటందుకే అసలు ఈ యుద్ధం చేస్తున్నట్టూ, కాస్సేపు ఏడిపించి చాల్లే వీళ్ళని ఏడ్పించడం అని స్త్రీలపై జాలిదలిచి యుద్ధం ఆపివేయడానికి ఎవరో నిశ్చయించి నట్టూ! ఇక చదువు సాగదు - ఒక వేళ నెలో రెండు నెలలో పట్టుదలతో సాగించినా ఆ తర్వాత ఆ అమ్మాయికి కొంచెం వికారం ఏర్పడడం, అంతటితో చదువు పూర్తిగా ఆగిపోవడం తప్పదు.

భార్యకి సరే - కొన్నేళ్ళ తర్వాత ఇంట్లో బిడ్డలకి పాఠం చెప్పినా, కొన్ని కొన్ని విపరీత పరిణామాలు ఉద్భవిస్తాయి. ఓ సారి మా అమ్మాయికి లెక్కలు చెబుతున్నా. "ఒకడు ఒక పనిని మూడు రోజుల్లో చేస్తాడు. ఆ పనినే మరొకడు అయిదు రోజుల్లో చేస్తాడు. ఇద్దరూ కలిసి ఆ పనిని ఎన్ని రోజుల్లో చేస్తారు?" అని లెక్క. మా అమ్మాయి చెయ్యలేకపోయింది ఆ లెక్క. నే నొక్కటి వేశాను. వెంటనే మా ఆవిడ వచ్చి పిల్లను రెక్కచ్చుకుని వెనక్కి లాగి "ఏవిటండీ వెధవ లెక్కలు. దానికి చెప్పడం ఎందుకూ! బిడ్డను కొడుతున్నారు కూడానూ? కాకపోయినా ఏం లెక్కలివి? ఒకడు ఒక పనిని మూడు రోజుల్లో చక్కగా పూర్తి చేయగలిగి ఉంటే, అయిదు రోజులదాకా డేకే మరో వెధవను కూడా ఆ పనిలో ఇరికించడం ఏమంత తెలివైన పనండీ? ఆ ఒక్కడి చేతే చేయించుకోకూడదూ? ఆ ఇద్దర్నీ కలపడం ఎందుకండీ? వాళ్ళిద్దరూ కలిస్తే వప్పందాలు పోతారుగాని చస్తే ఆ పని పూర్తి అవుతుందంటారా? పిచ్చా ఏమన్నా మీకూ? ఇలాంటి లెక్కలు చెయ్యలేకపోతే మానె, పిల్లదాన్ని కొట్టబోకండి" అంటూ దాన్ని లాక్కుని వెళ్ళింది.

ఒక రోజున మా అబ్బాయికి ఒక లెక్క ఇచ్చి చెయ్యమన్నాను. లెక్క ఏమిటంటే - ఒకడు గంటకు పది మైళ్ళు పరిగెడతాడు. పద్దెనిమిది గంటల్లో ఎన్ని మైళ్ళు పరిగెడతాడు అని. వాడు లెక్క ప్రారంభించి ఒక్క క్షణం అయిన తర్వాత ఆగి వెర్రి చూపులు చూస్తూ ఉండి పోయాడు. "లెక్క చేశావా? ఎన్ని మైళ్ళు?" అని గుడ్లెర్రజేశాను. 'ఏవిటండీ' అన్నాడు. "ఏమిటేమిటి నీ ముఖం! గంటకి పది మైళ్ళ చొప్పున పద్దెనిమిది గంటల్లో ఎన్ని మైళ్ళు పోతాడో కనుక్కో" అని కోప్పడ్డాను. "కనుక్కుంటానండి. చాలా దూరం పోయాడు గానీ, అసలు వాడు అట్లా పరిగెత్తితే, రెండు మూడు గంటలయ్యేసరికి గుండె పగిలి ఠపీ మని చావడా అని ఆలోచిస్తున్నానండి' అన్నాడు. "చావడా? లెక్కల్లో మనుష్యులు చావరు. లెక్క ప్రకారం పద్దెనిమిది గంటలూ పరిగెత్తి కాని మరీ చావడు... ఇంక లెక్క వెయ్యి" అని కోప్పడ్డాను.

"ఓ తొట్టికి ఓ రంధ్రం ఉంది, అందులోంచి గంటకి అయిదు గేలనుల చొప్పున నీరు కారిపోతుంది. గంటకి తొమ్మిది గేలనుల చొప్పున నీరును ఇచ్చే పంపు మూలంగా ఆ తొట్టి ఎంత కాలంలో నిండుతుంది?" అదీ లెక్క.

"ఇవేం లెక్కలండీ - పిల్లలకి కాస్త తెలివైనవి చెప్పండీ" అంది మా ఆవిడ.

"ఏం?" అన్నా.

"ఏం ఏమిటి? నా ముఖం, చిల్లి తొట్టిలో నీరు పోస్తూంటే ఓ చెంప కారిపోయేవి కారిపోతూంటే, పైనుంచి నింపడం ఏవిటి? ఆ చిల్లి తొట్టికి మాటేసుకుని ఆ తర్వాత నీరు నింపుకోకూడదూ?"

"నీకు తెలియదులే. ఇది అచ్చు పుస్తకంలో విషయం - దొరలు రాసింది."

"అయితే మటుకు? దొరలైతే మటుకు తొట్టికి చిల్లి ఉంటే, కాస్త మాటేసుకుని వాడుకోరా ఏమిటి? - చాల్లెండి లెక్కలూ మీరూను."

నాకెలా సమాధానం చెప్పాలో అర్థం కాలేదు.

మరోసారి నేను మా చిన్న వాడికి లెక్కలు చెబుతున్నాను. "ఒరే బాబూ, మనం ఉన్న ఇల్లు పదహారు వేల రూపాయల ఖరీదు గలదిరా. దీన్ని ఒక లక్షరూపాయల కమ్మేస్తే ఎంత లాభం వస్తుంది?" అని నోటి లెక్క అడిగాను. వాడు తెల్లబోయి చూడ్డం మొదలెట్టాడు. "ఏం చెప్పవేంరా?" అన్నాను. వాడు బిక్క మొహంతో "అసలు ఈ యిల్లు మనది కాదుగా నాన్నా!" అన్నాడు . నేను విసుగ్గా "మనదే అనుకో - అనుకొని, అమ్మితే ఎంత లాభం వస్తుందో చెప్పూ" అన్నాను. "బోలెడు లాభం వస్తుందిలే నాన్నా!" అని విసుగ్గా అంటూ అక్కడి నుంచి పరిగెట్టుకుని పారిపోయాడు ఆడుకోడానికి. ఇల్లు మనది కానప్పుడు ఎందుకు వచ్చిన పనికిమాలిన ఆలోచన ఇదంతా అని వాడి ఊహ అయి ఉంటుంది.

ఇలా ఉంటుంది ఉపాధ్యాయుడి జీవితం, సుఖ దుఃఖాల సమ్మిశ్రితమై వెలుగు చీకట్లతో దోబూచులాడుతూ. హాయిగా నవ్వుకో గలిగితే ఉపాధ్యాయ వృత్తి తమాషాగానే ఉంటుంది మరి!

జస్ట్ ఫర్ ఫన్

## కత్తుల్తో కాదురా... కంటి చూపుతో చంపేస్తా...!

- రచన: మల్లాది వెంకటకృష్ణమూర్తి



పెదకోడూరు నించి నెహ్రూ జూ పార్క్‌కి తొలిసారిగా వచ్చాడు రాజు. గొరిల్లా ఎన్‌క్లోజర్ ముందు నిలబడి చూస్తుంటే, అదికూడా తననే పరిశీలనగా చూస్తోందని గ్రహించాడు.

రాజు తన చేతిని గొరిల్లా చూసేలా ఊపాడు. అదీ బదులుగా అలాగే వూపింది. తన పొట్ట మీద కుడిచేత్తో కొట్టుకున్నాడు. అదీ ఆ ఏక్షన్‌ని రిపీట్ చేసింది.

పైకి, కిందకి దూకాడు. గొరిల్లా కూడా అచ్చం అలాగే దుమికింది. చేతిలో తాడు లేకపోయినా తాడాట ఆడుతున్నట్టుగా అభినయించాడు. అదీ అలాగే అభినయించింది. ఒంటి కాలి మీద కుంటాడు. గుండ్రంగా ప్రదక్షిణం చేసాడు. అ ప్రదక్షిణం చేసాడు. జుట్టు పీక్కున్నాడు. ఒంగొని లేచాడు. అతని చర్యలన్నిటినీ ఆ గొరిల్లా కూడా వెంటనే అనుకరించింది.

అకస్మాత్తుగా గాలి దుమారం చెలరేగి ఓ నలక రాజు కంట్లో పడింది. రాజు తన కుడి కంటిని రుద్దుకున్నాడు. కంట్లోంచి నలక తీసే ఆ ప్రయత్నంలో అనుకోకుండా అతను కటకటాల దగ్గరికి నడిచాడు.

అప్పటికే ఆ గొరిల్లా తన ఛాతీని బాదుకుంటూ, కటకటాల మీద కొడుతూ, చిందులు తొక్కుతోంది. రాజు తన దగ్గరికి రాగానే అది కటకటాల్లోంచి అతన్ని పట్టుకుని పిచ్చకొట్టుడు కొట్టింది.

రాజుకి స్పృహ వచ్చేసరికి జూ డాక్టర్ అతని మీదకి వంగి చూస్తున్నాడు. ఏమైందని అడిగితే జరిగింది వివరించాడు రాజు.

"ఓ! గొరిల్లా భాషలో కుడి కున్ను నలుముకోవడం అంటే అమ్మ, ఆలి బూతులు తిట్టినట్లు. అందుకని దానికి కోపం వచ్చి వుంటుంది" చెప్పాడు జూ అధికారి.

ఇంటికి వెళ్ళిన రాజు ఆ గొరిల్లా మీద ఎలాగైనా కసి తీర్చుకోవాలనుకున్నాడు. రాత్రంతా ఆ కోపంతో సరిగ్గా నిద్రపట్టలేదు. కూర్చుని ఎలా దానిమీద పగ తీర్చుకోవాలో ఆలోచించి పథకం వేసాడు.

మర్నాడు రాజు జూ కెళుతూ, రెండు పదునైన కత్తులు, పార్టీల్లో పిల్లలు పెట్టుకునే టోపీలు రెండు, రెండు బూరలు కొన్నాడు. జూకి వెళ్ళి ఎవరూ లేకుండా చూసి ఓ కత్తి, టోపీ, బూర కటకటాల్లోంచి గొరిల్లా దగ్గరికి విసిరేసాడు. అది ఇతని వంకే చూడసాగింది.

మనుష్యుల చర్యలకి ఆ గొరిల్లా అనుకరిస్తుందని తెల్సిన రాజు పార్టీ టోపీ తీసి నెత్తిన వుంచుకున్నాడు. అదీ తన దగ్గరున్న వాటిలో టోపీని చూసి తీసి నెత్తిన వుంచుకుంది.

తర్వాత పార్టీ బూర తీసి నోట్లో వుంచుకుని గట్టిగా ఊదాడు. అదీ బూరని తీసుకుంది. అలాగే చేసింది.

బూర ఊదుతూ గుండ్రంగా తిరిగాడు రాజు. గొరిల్లా కూడా అదే పని చేసింది. రాజు తర్వాత తన కత్తిని తీసుకుని దాన్ని తలమీద గుండ్రంగా తిప్పాడు. ఇతని చర్యలని జాగ్రత్తగా గమనిస్తున్న గొరిల్లా కూడా కత్తిన అందుకుని నెత్తిన వుంచుకొని చుట్టూ తిరిగింది.

చేతిని చాపి కత్తిని పైకి, కిందకి ఝుళిపించాడు రాజు. గొరిల్లా ఏ మాత్రం ఆలోచించకుండా అతని చర్యని ఇమిటేట్ చేసింది.

రాజు గట్టిగా వూపిరి పీల్చుకుని వదిలి కత్తితో పొత్తి కడుపులో పొడుచుకున్నాడు. ఇంటి దగ్గర అక్కడ ఓ ఇనుప రేకు ఉంచి పైన బట్ట కట్టుకోవడంతో కత్తి లోపలకి దిగలేదు. గొరిల్లా అతను చేసిన పనిని తిరిగి చేయకపోవడంతో మరోసారి కత్తితో పొత్తి కడుపు మీద పొడుచుకున్నాడు రాజు.

గొరిల్లా తన చేతిలోని కత్తివంక ఓసారి, రాజు వంక ఓసారి చూసి కత్తిని పారేసి కుడికన్నుని నలుపుకుంది.

మార్చి 16న శ్రీరంగం గోపాలరత్నం 9వ వర్ధంతి సందర్భంగా

# 'సంగీత రత్నం' శ్రీరంగం గోపాల రత్నం



కర్ణాటక సంగీత ప్రపంచంలో ఎమ్మెస్ సుబ్బులక్ష్మి డి.కె.పట్టమ్మాళ్, ఎమ్మెల్ వసంతకుమారి తరువాత ప్రస్తావించుకునే సంగీత విద్వన్మణి 'శ్రీరంగం గోపాలరత్నం'. చాలామంది జీవితంలో సంగీతం ఒక భాగమైతే, గోపాలరత్నం జీవితమంతా సంగీతమయమే.

కళలకు కాణాచి అయిన విజయనగరం జిల్లా పుష్పగిరిలో వరదాచార్యులు, సుభద్రమ్మ దంపతులకు 1939లో జన్మించారు శ్రీరంగం గోపాలరత్నం. వారిది సంగీత కుటుంబం కావటం వల్ల పసితనాన్నే బామ్మ వద్ద సంగీతంలో తొలిపాఠాలు, ఆ తరువాత తండ్రి వద్ద మలిపాఠాలు నేర్చుకున్నారు. తల్లి మేనమామ అప్పకొండమాచార్యులు రాసిన రెండు హరి కథలను పాలకొల్లు వైష్ణవ సభలో చెప్పి నాటి ప్రఖ్యాత హరి కథా విద్వాంసుడు పెద్దింటి దీక్షితులుచే ప్రశంసలందుకున్నారామె. అపుడామె వయసు తొమ్మిదేళ్లే.

ప్రధానంగా శ్రీరంగం గోపాలరత్నం జోగారావు వద్ద పూర్తి స్థాయి సంగీత శిక్షణ నొంది ఆ తరువాత వయొలిన్ విద్వాంసుడు ద్వారం వెంకటస్వామినాయుడు, శ్రీపాద పినాక పాణి వద్ద శిష్యరికం చేశారు. వీరిద్దరి వద్ద నేర్చుకున్న విద్య ఆమె పాండిత్యానికి మెరుగులద్దింది.

1957లో విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో నిలయ విద్వాంసురాలిగా చేరిన ఆమె 1977 వరకు రేడియో ద్వారా కర్ణాటక సంగీతాన్ని, లలిత సంగీతాన్ని జన సామాన్యానికి చేరువ చేశారు. 1960-70 దశకాల్లో విజయవాడ, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రాలు - సంగీతానికి పెద్దపీట వేసిన రోజులు. విజయవాడలో మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఓలేటి వెంకటేశ్వర్లు, పింగళి లక్ష్మీకాంతం, ఎం.వి.రమణమూర్తి, సంధ్యా వందనం శ్రీనివాసరావు, బాలాంత్రపు రజనీ కాంతరావు, మంచాల జగన్నాథరావు వంటి వారితో కలిసి ఆమె సమర్పించిన సంగీత కార్యక్రమాలు గోపాలరత్నం సంగీత ప్రతిభకు నిదర్శనాలు.

ఈ పరంపరలో ఆకాశవాణి ద్వారా ఆమె వినిపించిన అన్నమాచార్య కీర్తనలు భక్తి పారవశ్యంలో ముంచెత్తాయి. 'కస్తూరి రంగయ్యా కరుణించవేమయ్యా', 'ఏడే అల్లరి వనమాలి' పాటలు మంచిపేరు తీసుకురాగా, క్షేత్రయ్య పదాలు, మీరాభజనలు, లీలాశుకుని తరంగాలు, జయదేవుని అష్టపదులు, రామదాసు, ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలు, నండూరి ఎంకిపాటలు, పెళ్ళిపాటలు, సంప్రదాయ, జానపద గీతాలు, తిల్లానాలు, జోలపాటలు, భక్తిగీతాలు... ఏవి పాడినా అవి ఆమె గొంతులో తియ్యదనాన్ని కలుపుకుని హృద్యంగా బయటకు వచ్చేవి. విజయవాడ రేడియో కేంద్రం రెండు దశాబ్దాల పాటు సుప్రభాతం మొదలు ప్రసార సమాప్తి వరకు ఏదో ఒక సందర్భంలో శ్రీరంగం కంఠంతో శ్రోతల హృదయ క్షేత్రాల్ని సుసంపన్నం చేసేది.

బందా కనకలింగేశ్వరరావు పుణ్యామా అని కూచిపూడికి నూతన ఒరవడి వచ్చినప్పుడు ఓలేటి వేంకటేశ్వర్లు కూచిపూడి నాట్యాచార్యులు చింతా కృష్ణమూర్తిని ప్రక్కన కూర్చొనబెట్టుకుని "భామాకలాపం" యక్ష గానాన్ని సంస్కరించి బాలమురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం చేత రికార్డు చేసి ప్రసారం చేశారు. ఆ యక్షగాన రూపకాన్ని ఎన్నిసార్లు విన్నా ఇంకా ఇంకా వినాలనిపిస్తుంది. "మదనా..." (ఆనందభైరవి), 'శకునాలు మంచివాయె' (మోహన), 'భామనే సత్యభామనే'.... వంటి స్వరరచనలు నేటి వరకూ ఎందరికో మార్గదర్శకంగా ఉన్నాయంటే అది గోపాలరత్నం అద్భుత స్వరమాధుర్యమే. ఓసారి నూకల చిన సత్యనారాయణ 'నౌకాచరితం'ను హైదరాబాదు అమృతవాణి స్టూడియోలో గోపాలరత్నం చేతనే రికార్డు చేయించారు. ఇందులోని "తనయందే ప్రేమ" అనేకృతిని నలుగురు గోపికలకు నలుగురు పాడాలి. అందులో ఒకరుగా శ్రీరంగం పాడారు. తీరా రికార్డు అయిన తరువాత మిగతా ముగ్గురు ఆమె స్థాయిలో పాడకపోవడంతో నూకల చినసత్యనారాయణ పూర్తి పాటను ఆమె చేతనే పాడించారు.

ఇకపోతే మీరాబాయి సంగీత నాటకం విషయానికి వస్తే ఆ నాటకం వినడమే గొప్ప అనుభూతి. కృష్ణ భక్తురాలైన మీరాబాయి గోపాల రత్నంలో ప్రవేశించిందా అనిపిస్తుంది. "బికారి రాముడు", "శ్రీ వెంకటేశ్వర వైభవం" చిత్రాలకు పాడారు. అయితే దురదృష్టవశాత్తు ఆమె పాడలేని స్థితికి రావడంతో 1977లో విజయవాడ నుండి హైదరాబాదు వచ్చారు. విజయవాడలో విజయవంతంగా నడచిన ఆమె సంగీత యాత్రకు అవాంతర మేర్పడింది.

హైదరాబాదు సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా నియమితురాలైన గోపాలరత్నం తాను పాడలేకపోతున్నాననే మనోవేదనకు గురయ్యేరు. తెలుగు వర్సిటి ఆవిర్భావం తరువాత లలిత కళాపీఠానికి ప్రత్యేక అధికారి అయ్యారు.

శ్రీరంగం గోపాలరత్నం తన సంగీత జీవితంలో లెక్కలేనన్ని కచేరీలు చేశారు. గాన కళలో ఆమె సృష్టించని ప్రక్రియ లేదు. రాష్ట్రంలోని వలు సాంస్కృతిక సంస్థలు సన్మానాలు చేసి "గానకోకిల", "సంగీత కళానిధి" "సంగీత రత్న", "ఆంధ్ర నైటింగేల్", వంటి బిరుదులను సమర్పించుకున్నాయి. 1969లో తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆస్థాన విద్వాంసురాలిగా నియమించగా 1992లో భారత ప్రభుత్వం "పద్మశ్రీ"తో సత్కరించింది. 1993 మార్చి 16న మద్రాసులో కాలధర్మం చెందిన ఆ మహాగాయని తన జీవితాన్ని సంగీతంలోనే పండించుకోవాలని వివాహం చేసుకోలేదు. సంగీత ప్రపంచంలో బహుముఖ ప్రజ్ఞాశాలిగా శ్రీరంగం గోపాలరత్నం సదాస్మరణీయురాలే.

-హెచ్.రమేష్‌బాబు

# మంచి స్క్రిప్టు అంటే...!?




-ముళ్లపూడి వెంకటరమణ

రచన చేసిన ఏ చిత్రంలో అయినా ఆ సన్నివేశానికి అతిగా కాకుండా అతికినట్టుగా 'సినిమా ప్రధానంగా దృశ్యపరమైన సాధనం' అని నమ్మే వ్యక్తి కాబట్టి దృశ్యానికి తగ్గట్టుగా తగు స్థాయిలో, తగ్గు మోతాదులో పాత్రల చేత సంభాషణలు పలికించే రచయిత శ్రీముళ్లపూడి వెంకటరమణ. అందుకే ఆయన చిత్రాల్లో పాత్రలు చెప్పే సంభాషణలు, నాటకీయతతో కాకుండా నిజ జీవితంలో వలె సహజంగా వుంటాయి. సినిమాకు ప్రాణ ప్రతిష్ట చేసేది దర్శకుడైనా, ప్రాణం-మంచి స్క్రిప్టు. ఆ మంచి స్క్రిప్టు అంటే ఏమిటి- దానికుండవలసిన లక్షణాలేమిటి? అన్న విషయాలను గురించి సోదాహరణగా 'విజయచిత్ర'లో కొన్నేళ్ళక్రితం రాసిన వ్యాసం ఇదిగో -

మంచి స్క్రిప్టుకు వుండవలసిన లక్షణాలేమిటి... అసలు మంచి స్క్రిప్టు అంటే ఏమిటి అని అడుగుతున్నారా?

రాసేవాడికి అన్నీ మంచివే. నిర్మాతలకి యిచ్చేటప్పుడు అన్నీ బెస్టే. దాంట్లో అనుకున్నది ఎంతవరకు చెప్పగలిగాం... ఏది జనం మెచ్చుకున్నారు... అన్నది అసలు ప్రశ్న. నూటికి ఎనభై మంది మెచ్చుకుంటేనే అది మంచి సినిమా అవుతుంది. ఇక్కడ పేర్లర్ సినిమా, ఆర్ట్ ఫిలిం అన్న సంబంధం ఏమీ లేదు. సినిమాకి రాయడమన్నా తియ్యడమన్నా అందరికీ నచ్చే స్థాయిలో... అందరికీ అర్థమయ్యే రీతిలో వుంటేనే మంచి స్క్రిప్టు అవుతుంది.

అయితే కొన్ని కథాంశాలు రైటర్‌ని ఎక్కువగా ఇన్‌స్పైర్ చేస్తాయి. కొన్నిటికి అంతకన్న స్కోప్ వుండదు కాబట్టి, అంతే రాయడానికి వీలవుతుంది. కొన్ని కొన్ని కొత్త పాయింట్లు రచయిత మనసులో వుండేవి బయటకు తీసుకువచ్చి చెప్పిస్తూ వుంటాయి.



ఇక నా చిత్రాలకు వస్తే - 'సాక్షి' ఒక మైలురాయనే చెప్పాలి. పూర్తి ఔట్‌డోర్‌లో తీసే ప్రయోగం మొదటిసారిగా మేం చేశాం. స్టూడియోలో కాకుండా సహజత్వం పుట్టిపడేలా - నిజ జీవితంలోలా వుండాలని. కానీ మేకప్ ఏ మాత్రం ఉపయోగించకుండా వుండలేకపోయాం. అప్పటికి మేం కొత్త. ఫ్రెష్‌గా వచ్చారు బాపు. అంతకు మునుపు దర్శకత్వం వహించిన అనుభవం లేదు. అసిస్టెంట్ డైరక్టర్‌గానూ పనిచెయ్యలేదు.

స్టూడియోలో 40 లెన్స్, 70 లెన్స్, లేక 25 లెన్స్ ఉపయోగించడమా అన్నది పాయింట్ కాదసలు... కథ చెప్పడం, చెప్పడానికి కావలసిన అభిరుచి, చెప్పే విధానం, కామన్ సెన్స్ యివి మూడూ కావాలి. కామన్ సెన్స్, మంచి అభిరుచి అంటేనే మంచి స్క్రిప్టుని ఎన్నిక చేసుకోవడం అన్నమాట. ఏదో నాకు ఛాన్సొచ్చింది కదా... ఏదో ఒకటి తీసేస్తానంటే కుదరదు. మేం 'సాక్షి' తీసినప్పుడు పాతదంతా పనికి రాదనికాదు. ఏదో కొత్తదనం తేవాలన్న ఉద్దేశంతో అప్పుడది చేశాం. అది మంచి ప్రయత్నమే. ఇప్పటికీ ఆ స్క్రిప్టు చాలా బావుందని టెక్నీషియన్స్ అందరూ మెచ్చుకుంటూ వుంటారు.



అలాగే 'బుద్ధిమంతుడు' కూడా, కొత్తరకం కథ చెప్దాం అనుకున్నాం. ఆ మేరకు అది పండింది. అయితే నేను రాసేటప్పుడు 'యార్డ్ స్టిక్స్' అనే కొలబద్దలు పెట్టుకోను. పాత సినిమాలో హిట్ అయినవి పెట్టుకుని, యిన్ని రీళ్ళకి యివి వుండాలి అనేవి లేకుండా ఈ కథని ఎలా చెప్తే బాగుంటుంది. అనుకుని అలాగే రాస్తున్నాను. దానికి రూల్స్, గ్రామర్ లేవు.

నా నమ్మకం - సినిమాకనే కాదు, కథ రాయడానికీ, నవల రాయడానికీ, దేనికీ - మంచి రచనకి గ్రామర్ అవసరంలేదు. ఆ మంచి రచనని గ్రామర్ అనుసరిస్తుంది. అయితే కొందరు కొన్ని నియమాలు పాటిస్తూ - యిది యిన్ని పేజీలుండాలి... యిలా వెళ్ళాలి అనే పద్ధతిలో వుంటారు. దానికి లోబడి వారు రచనలు చేస్తున్నారు. కొంతమంది ఆ ధ్యాస లేకుండా, అది ఎలా రాయాలనుకున్నారో అలా చెప్పేస్తూ వుంటారు. ఒక్కొక్కప్పుడు అది కొత్త గ్రామర్‌ని సృష్టిస్తుంది. నేనేదీ కొలబద్దలు పెట్టుకు రాయను. 'ఇది ఇలా రాయాలీ' అనుకుంటే అలాగే రాశాను. అది రైటో, తప్పో అన్నది ఆలోచించలేదు. తప్పయినవి ఫెయిలవుతుంటాయి.

అయితే సినిమా విజువల్ మీడియం అని నేను మొదట్నుంచి అంటున్నాను. 'బొమ్మ ముందు... శబ్దం తర్వాత' అని. అందుకే నా స్క్రిప్టులో డైలాగు - ఎక్కడ మాట అవసరమో అక్కడే వస్తుందన్న మాట. నేను మొదట్నుంచి అలాగే నేర్చుకున్నాను, పెద్దవాళ్ళనీ, పాత క్లాసిక్స్‌ని చూసి. అదే నాటకం వుందనుకోండి విజువల్‌కన్న 'ఆడియో'... శబ్దానికి ప్రాధాన్యం హెచ్చు. కారణం సినిమాలోలా దూరంగా వున్నవారికి రంగస్థలం మీద నటులు సరిగ్గా కనిపించరు అంచేత సంభాషణలు ఎక్కువగా వుండాలి. అదే సినిమాలో, ఒక విజువల్‌తో వందమాటలు పలికించవచ్చు. 'ఒక బొమ్మ వంద మాటల పెట్టు' అంటారు చూడండి. అది జ్ఞాపకం పెట్టుకుని రాస్తాను. విజువల్‌గా, అందంగా ఎలా చెప్పడం అన్నది ఊహించి చూసినదానికి అప్పుడు మాటలు రాయడం అన్నమాట.

'ముత్యాల ముగ్గు'లో కూడా ఎక్కువ మాట్లాడే పాత్ర రావుగోపాలరావు వేసిన కంట్రాక్టర్ పాత్రదే. హీరోగానీ, హీరోయిన్‌గానీ ఎక్కువ మాట్లాడరు. సెటైర్ చెయ్యడం కోసం, మాటేదాని ఊపిరి కాబట్టి కాంట్రాక్టరు పాత్ర



ఎక్కువ మాట్లాడుతుంది. కానీ ఆ పాత్ర పరిచయం కూడా విజువల్‌తోనే ప్రారంభమవుతుంది - 'ఆకాశంలో మర్డర్ జరిగినట్టుంది' అంటూ.

అలాగే 'వంశవృక్షం'లో విరామం దగ్గర ఒకడైలాగ్ వుంది. 'అమ్మరాలేదేం' అనడుగుతాడు ఆ కుర్రవాడు (వంశీకృష్ణ). 'చీకటి పడింది కదమ్మా, దారి తప్పి వుంటుంది' అంటాడాయన (సోమయాజులు). సరిగ్గా



అప్పుడే చీకటి పడింది. ఆ అమ్మాయి (జ్యోతి) బుర్రకీ చీకటి పడింది. పెళ్ళి చేసుకున్నా లేచిపోయింది. ఎంతమందో దాన్నర్థం చేసుకుని మెచ్చుకున్నారు. విడిగా ఆ మాటకు అర్థం లేదు కానీ ఆ సందర్భంలో సరిగ్గా అది అతుక్కుంది. విజువల్స్ వల్ల.

మూకీ సినిమాల కాలంలో చార్లీ చాప్లిన్ సినిమా కాలంలో టాకీలు లేవు. విజువల్ మూవ్‌మెంట్స్‌తోనే శబ్దం లేకుండా చెప్పాల్సి వచ్చింది. అంచేత దృశ్యపరంగా ఎంత బాగా చెప్పవచ్చును అన్నది అప్పుడే కనిపెట్టారు. ఇవాళ మనం ఉన్నవే సరిగ్గా ఉపయోగించుకోవడం లేదు. ఎక్కువగా డైలాగ్స్ మీద ఆధారపడిపోయాం, కారణం - టాకీ అడ్వాంటేజ్ వుంది కాబట్టి. ఇప్పుడు కూడా నేను నాటితరం పెద్దవాళ్ళని దృష్టిలో పెట్టుకుని, విజువల్‌ని దృష్టిలో పెట్టుకునే రాస్తాను. ఒక్క చూపులో ఎంతటి భావాన్నైనా చూపెట్టవచ్చు... తనలోని బాధయిది అని, అందుకు బూరెల మూకుడు, మండే పొయ్యి... దాని మీద డైలాగులు... యివన్నీ అక్కర్లేదు.

ఇక - సినిమాకు ఫిక్స్‌డ్ ఫార్ములా అంటూ లేదు. సినీమాలో అశ్లీల పదజాలం గుప్పించి, హాస్యం అనిపించి అది విజయవంతమైతే అదే ఫార్ములాతో సినిమాలు వచ్చినా, 3,4 సినిమాల తర్వాత యిక జనానికి విసుగెత్తుతుంది. అందుకే ఫిక్స్‌డ్ ఫార్ములా అనేది లేదు, అనవసరం అంటాను. అసలు డబ్బు చేసుకోడంలో దేనికీ ఫార్ములా అంటూ లేదు. వ్యవసాయంలోనూ అంతే. ఒకడు పసుపువేసి సొమ్ములు గడిస్తే మరుసటి సంవత్సరం అందరూ  పసుపే వేస్తారు. కొన్ని వేల ఎకరాలు మొత్తం పసుపుతో నిండిపోయి 'గ్లట్' వస్తుంది. ఎవరికీ అమ్ముడవదు. మొత్తం పోతుంది. ఫార్ములాని నమ్మితే అంతే.

ఒక థీమ్ తీసుకున్నప్పుడు, దాన్ని ఎలా తియ్యాలి అనుకుని, ఇవాళ్టి పరిస్థితులకు అనుగుణంగా కథాంశాన్ని మలచుకుని, దాని మీద కృషి చేస్తే మంచి స్క్రిప్టు తయారవుతుంది. రామాయణాన్ని తియ్యాల్సి వచ్చినా యిప్పటి పరిస్థితులకు తగ్గట్టుగా వుండేలా తీసుకురావడమే సబ్జెక్ట్‌లో వుండే స్పార్క్. దాన్ని యివాళ తీసినప్పుడు, యివాళ్టి వాళ్ళు చూసినప్పుడు, దాంట్లో వారి జీవితం ప్రతిబింబించాలి. అందులోనూ రామాయణం, భారతం - కాలానికి అతీతమైన సబ్జెక్టులు. అవి ఏ కాలానికైనా వర్తిస్తాయి. మనుషులు ప్రవర్తనా అవీ - ఒక మనిషి ఒక పరిస్థితిలో ఎలా ప్రవర్తిస్తాడు - సుఖం వస్తే ఏమవుతాడు... ఒళ్ళు పొగరెక్కితే ఎలా వుంటాడు... చాలా నిస్పృహ కలిగితే ఏమవుతాడు - యివన్నీ భారతంలో వున్నాయి. మనిషి ప్రవర్తన ఎన్ని రకాలుగా వుంటుందో. మనిషి మెదడు ఎన్నిరకాలుగా ఆలోచించగలదో, ఎన్ని రకాల తప్పులు చెయ్యగలదో - ఎన్ని రకాల ఒప్పులు చెయ్యగలడో...

అసలు ఆరంభదశలో రైటర్‌కి ప్రోత్సాహం ఎంతైనా అవసరం. నా తొలి చిత్రం 'దాగుడు మూతలు' అయినా విడుదలైన తొలి చిత్రం 'రక్త సంబంధం' ఇది తమిళం 'పాశమలర్' నుంచి రీమేక్ చిత్రం. దానికి సంభాషణలు రాసే అవకాశం నాకు వచ్చినప్పుడు 'కామెడీలు రాసేవాడు యితనేం రాస్తాడు' అన్నారు కొందరు. కానీ డూండీ గారూ, దర్శకులు



వి. మధుసూదనరావుగారూ నన్నెంతో ఉత్సాహపరచి రాయించారు. లేకుంటే నేను అప్పుడే యింటికి వెళ్ళిపోయివుండే వాడిని. నేను బాగా రాయకపోయినా, బాగుందని వాళ్ళు నటించి,  రాయించారు. నేను నమ్మలేదనుకోండి... 'పత్రికల్లోంచి వచ్చినవాడు. బాగా రాస్తాడు. ఫ్రెష్ టాలెంట్' అని వాళ్ళనుకున్నారు. ఆ నమ్మకం నాకు లేదు కానీ వారికి నామీద నమ్మకం వుంది. ఓ పదిసార్లు, యిరవైసార్లు రాయగా ఒక దారి కనిపించింది. అయితే ఆ చిత్రం ఎంత హిట్టయినా, నాది అని చెప్పుకోలేను. కె.పి. కొట్టార్కరగారి స్క్రిప్టు నేను తెలుగులో రాశాను. నాది అని చెప్పుకోవాలనే వుంటుంది. అంత గొప్ప కథ అది.

రీమేక్స్ కాకుండా చెప్పాలంటే - సాక్షి, అందాలరాముడు, బుద్ధిమంతుడు, ముత్యాల ముగ్గు. అలాగే 'వంశ వృక్షం' నవల కన్నడంలో తీశారు, అది మేం తెలుగులో తీసినప్పుడు దాన్ని పూర్తిగా నేను స్వంతం చేసుకున్నాను. ఆ నవలా రచయిత ఎస్. ఎల్. భైరప్పగారు - దాన్ని చిత్రంగా తీస్తామని ఎందరోవెళ్ళి అడిగినా యివ్వనన్నారు, సినిమా తీస్తే నవలని పాడుచేస్తారని. నేను వెళ్ళి అడిగినప్పుడు ఆ మాటే అని 'అసలు నా నవల నీకేం అర్థమైంది?' అనడిగారు. నాకు ఏం అర్థమైందీ అంటే- 'నాకు ఆ నవల మీద గౌరవం వుంది. ఇన్ని లక్షలు ఖర్చు పెడుతున్నాం. దీనికి మించిన ఋజువు ఏం కావాలి. మిగతా వివరాలు మీరు నాకు నవల యిచ్చాక మాట్లాడతాను' అన్నాను. ఆ సినిమా ప్రారంభించే ముందు యిరవైసార్లు చదివి, మైళ్ళ కొద్దీ నడిచి, ఆలోచించి, ఒంటపట్టించుకున్నాక 'ఆ కథ నాది' అనిపించాక, అప్పుడు రాయడం మొదలు పెట్టాను. ఆ కథలో లేనివి కొన్ని అందులోంచి రావాల్సినవి నాకు స్ఫురించాయి. నేను కొన్ని మార్పులు చేశాను. విజువల్ అప్పీల్ వచ్చేలాగా తీసుకువచ్చాను. అందులో మొదటి వాక్యం... "వాళ్ళబ్బాయి నదిలో పడి చచ్చిపోయాడు. ఆయన దీనంగా గోడకి బారగిలబడి కూర్చున్నాడు" - ఆ ఒక్క వాక్యానికి నేను వంశీకృష్ణ

పాట పెట్టి, నావలో గోదావరి దాటుతుండడం, ఇంతలో సాయం కోసం వెళితే కొడుకుని పంపించి ఈ లాంచిలో వెళ్ళిపోయాడు. నావ పక్కనే వస్తుంటే, ఈ దేవుడికి పూజ చేసి దీపం పెడుతూంటే ఆయనింట దీపం ఆరిపోతుంది. ఆ ఒక్క వాక్యాన్నీ - 'చచ్చిపోయాడు' - అన్నదాన్ని యింతగా పెంచాం. దాన్ని భైరప్పగారు చూసి మెచ్చుకున్నారు. ఆ ఒక్క వాక్యాన్ని నది దాటడం, యివతలి గట్టు, అవతలి గట్టు అని పెట్టి 'ఐరనీ ఆఫ్ ఫేట్' - దేవుడికి పూజ చేస్తుంటే, అక్కడ కొడుకు చచ్చిపోవడం, మనవడు పడివుండడం... 'నేనెందుకు బ్రతకాలి... ఎందుకు బ్రతకాలి' అని అనుకుంటూండగా ఆ పిల్లాడు వుంటాడు. 'వీడికోసం బ్రతకాలి' అనుకోవడం - ఇదీ 'వంశవృక్షం'కి పునాది. అలా నేను స్వంతం చేసుకుని రీమేక్ అయినప్పటికీ బాగా సంతృప్తి ననుభవిస్తూ రాశాను. ఆ నవల చదువుతున్నప్పుడు ఎంజాయ్ చేశాను. పుస్తకంలో కొన్ని భాగాలు అండర్‌లైన్ చేసుకుని బాపుగారితో చర్చించి స్క్రిప్టు రాశాను. ఐదారు వందల పేజీల నవల అది. దాన్ని తెరమీద రెండు గంటల్లో చెప్పాలి. అందుకే అందుకు అవసరమైన పాత్రలనే తీసుకొని వాటికే ప్రాముఖ్యం యిచ్చాం. అంత మాత్రాన వదిలేసినవి చెడ్డవని కాదు. నవలంటే కళ్ళు మూసుకుంటే బొమ్మలు కనిపిస్తాయి. కానీ సినిమాకి అలా కాదు కదా రెండు గంటల్లో పూర్తి కథ చెప్పాలి. అందుకని కొన్ని పాత్రలని తగ్గించాల్సి వచ్చింది.

సినిమా షూటింగ్ ప్రారంభానికి ముందే నేను స్క్రిప్టు రాస్తాను. షూటింగ్‌కి వెళ్ళాక స్క్రిప్టు మార్చే అవసరమే అసలు రాదు. అయితే ఒక 'స్కూల్ ఆఫ్ థాట్' వుంది. అక్కడికక్కడ లొకేషన్‌లో స్క్రిప్టు రాయడం. కొంతమంది 'ఎక్స్‌ట్రాడినరీ జీనియస్'లు వుంటారు. వారికి లొకేషన్‌లో నటీనటులతో మాట్లాడుతుంటేగానీ ఇన్‌స్పిరేషన్ రాదు. అటువంటి వాళ్ళు అప్పటికప్పుడు రాస్తారు. అది హిట్ అయితే అలాగే రాయాలి అనేవాళ్ళు వున్నారు. కానీ అది వేళాకోళంగా కనిపిస్తుంది నాకు. విధి లేక అయితే తప్పదు. నేనంటే ఒక పనిచెయ్యను. ప్రొడక్షన్, బిజినెస్ చూస్తాను... రాస్తాను కాబట్టి నేను రాయడంలో కాస్త ఆలశ్యం జరగవచ్చు తప్పితే - అదీ ఏడెనిమిది సంవత్సరాలుగా... యివన్నీ కూడా స్క్రిప్టు మొత్తం పూర్తయిన తర్వాతనే చూస్తున్నాను.

కొందరు ఆ స్పాట్‌లో అప్పటి కప్పుడే కేరక్టర్లనీ, సంభాషణలనీ మార్చేసి, కావలసిన 13వేల అడుగులకి 70 వేల అడుగులు తీసేసి అందులోంచి కావలసినది తీసుకుంటూ వుంటారు. అలాంటి చిత్రాల్లో ఆర్ట్ మృగ్యం అని నా నమ్మకం. అలాంటి సినిమా హిట్ అయినా నాకు సంతోషం కలుగదు వాళ్ళ డబ్బుతోవాళ్ళు ప్రయోగాలు చేసుకుంటే పర్వాలేదు, యూరోప్‌లోని ఇంప్రూవైజేషన్ నిర్మాణకారుల్లా...! కానీ ప్రొడ్యూసర్ చేత మూడు నాలుగు సినిమాలకయ్యే డబ్బు ఖర్చుపెట్టిస్తారు. అన్ని వేల అడుగులుతీశాక అందులోంచి ఏరతారు... అందులోంచి మంచివి పెడతారు. చిత్రం చూస్తుంటే జంపింగ్‌లూ అవీ కనిపిస్తూవుంటాయి. అది పద్ధతికాదు. ఇది నేను చెప్పాలి అని అనుకుంటే ముందు నాకు కావలసింది నేను చెప్పడం తెలుసుకోవాలి. తెలుసుకున్నాక సినిమా తియ్యాలి. అంతేకానీ 'నాకు తోచిందంతా తీస్తాను' అంటే యిది చాలా ఖరీదైన మీడియం.

అయితే ప్రేక్షకుల అభిరుచులు కూడా తమాషాగా వుంటాయి. 'అందాల రాముడు' చాలామంచి కామెడీగా విభిన్న పంథాలో స్క్రిప్టు తయారు చేసుకుని, ఓ ఏభైవేలు పెట్టి ప్రత్యేకంగా లాంచీ తయారు చేయించి, రెండు వందల ఏభైమందితో గోదావరి మీద ఎంతో సరదాగా అందరం ఎంజాయ్ చేస్తూ తీశాం. కానీ తీరా విడుదలయ్యాక అప్పుడు, 'బోట్‌లో చుట్టేశార్రా' అన్నారు, కానీ అదే సినిమా యివాళ మళ్ళీ విడుదలైతే విడుదలైన ప్రతిచోటా - ప్రతిసారీ బాగా ఆడుతోంది. అంచేత 'మంచి స్క్రిప్టు ఏదీ' అని రచయితని అడిగితే చెప్పడం కష్టమే. ముందుగా చెప్పినట్లు రాసేవాడికి అన్నీ బెస్టే.



అందరికీ నచ్చేస్థాయిలో, అందరికీ అర్థమయ్యే రీతిలో వుంటేనే అది మంచి స్క్రిప్టు అవుతుంది. బుద్ధిమంతుడు, ముత్యాలముగ్గు చిత్రాలు వెంటనే అర్థమయితే 'అందాలరాముడు' లాంటి చిత్రం విషయంలో ఆ అర్థం చేసుకోవడమన్నది పదేళ్ళు ఆలశ్యం కావచ్చు అంతే.

# తెలుగు సినిమా సంగీతంలో నాలుగు కొత్త కలలు

ఆ గదిలో నలుగురు కుర్రాళ్ళు ప్రపంచాన్ని మరిచిపోయి తమ పనిలో నిమగ్నమై వున్నారు. సడన్‌గా కరెంట్ పోవడంతో నలుగురిలో ఒక్కసారిగా నిట్టూర్పులు. ఎంతసేపు గడిచినా కరెంట్ వచ్చే సూచనలు కనబడక పోవడంతో రిలాక్స్ కావడం కోసం వీధి చివర్లోని టీ కొట్టుకి బయలుదేరారు.

టీ తాగుతూ నలుగురిలో ఓ కుర్రాడు ఓ ఆలోచన వెల్లడించాడు. మిగతా ముగ్గురి తలలు వూగాయి. కలలు రేగాయి. ఎదలో భావాలు చెలరేగాయి.

అతి తక్కువ సమయంలోనే వారి సమిష్టి స్వప్నం ఓ రూపుదిద్దుకుంది.

ఇండస్ట్రీ మెప్పు ప్లస్ ప్రేక్షకుల తీర్పుకోసం ఎదురుచూస్తున్న

## ఆ నలుగురూ....



సందీప్ (గిటారిస్ట్)

బాబ్జీ (సింగర్)

భాషశ్రీ (రైటర్)

శేషు (సౌండ్ ఇంజనీర్)

భీమనేని శ్రీనివాసరావు స్వీయదర్శకత్వంలో నిర్మిస్తోన్న ప్రేమకథా చిత్రం 'నీ తోడు కావాలి' ద్వారా పరిచయమవుతున్న ఈ యంగ్ 'మ్యూజిక్ టీమ్' సెన్సేషన్ సృష్టించడానికి సిద్ధమవుతున్నారు.

'నీ తోడు కావాలి' సినిమా తమ కలలకు ప్రతిరూపమని వాళ్ళు చెబుతున్నారు.

అసలు ఈ నలుగురి కలయికే అనుకోకుండా జరిగింది.

సంగీతం పట్ల మంచి అభిరుచి వున్న బాబ్జీ ఓ పక్క కానిస్టేబుల్‌గా పని చేస్తూనే, మరో పక్క సింగర్‌గా ప్రయత్నాలు చేసేవాడు. సంగీత దర్శకుడు ఎర్రా రమేష్ ఇతనికి మంచి స్నేహితుడు. 'కలలు కందాంరా' సినిమాకి ఎర్రా రమేష్ వర్క్ చేస్తుంటే ఓసారి కలవడానికి వెళ్ళాడు బాబ్జీ.

అక్కడే కీ బోర్డ్ ప్లేయర్ సందీప్, రైటర్ భాషశ్రీ, సౌండ్ ఇంజినీర్ శేషు పరిచయమయ్యారు. భావ సారూప్యత వాళ్ళని తక్కువ సమయంలోనే సన్నిహితుల్ని చేసింది.

బషీర్‌బాగ్‌లో శేషు వాళ్ళకి 'శారదా డిజిటల్ స్టూడియో' వుంది. 'మనకున్న ప్రతిభతో స్వంతంగా ఓ ఆల్బమ్ చేద్దామన్న' శేషు ఐడియాతో డిసెంబర్ 6, 2000న శ్రీకారం దిద్దారు. ఆ రోజున 'కలలు' అనే ట్యూన్ తయారు చేసుకున్నారు. పాటను రెడీ చేసేసారు. విన్నవాళ్ళంతా భేష్ అన్నారు. ఇంకేం వారిలో ఉత్సాహం ఉరకలెత్తింది. డిఫరెంట్ కాన్సెప్ట్స్‌తో ఆరు పాటల్ని రెడీ చేసేసారు.

భీమనేని శ్రీనివాసరావు మేనల్లుడు శ్రీనివాస్ ఆర్ట్ డైరెక్టర్‌గా వర్క్ చేస్తున్నాడు. ఆయనేదో పని మీద ఇంటిలిజెన్స్ ఎస్పీని కలవడానికి వెళ్ళినప్పుడు బాబ్జీ పరిచయమయ్యాడు. బాబ్జీలో మంచి గాయకుడున్నాడన్న విషయాన్ని గుర్తించుకుని భీమనేనికి పరిచయం చేసాడు శ్రీనివాస్.

అదే ఈ కథకి మలుపు.

   

| ఇండస్ట్రీలో పేరు | భాషశ్రీ | సందీప్ | బాబ్జీ | శేషు |
|---|---|---|---|---|
| అసలు పేరు | షేక్ భాషా | కాంగుల సందీప్ | అహ్మద్ వలీషా బాబ్జీ (జైల్ డిపార్టుమెంట్‌కి అటాచ్డ్ కానిస్టేబుల్) | పొన్నపల్లి శేషుకుమార్ |
| స్వస్థలం | విజయవాడ | హైదరాబాద్ | కాకినాడ | గుంటూరు |
| బర్త్ డే | 15 ఆగస్టు 1976 | 8 మార్చి 1982 | 2 జనవరి, 1974 | 27 జనవరి, 1976 |
| విద్యార్హత | బి.కామ్ | ఇంటర్ పాస్ | బి.కామ్ | కంప్యూటర్ గ్రాడ్యుయేషన్ |
| తల్లితండ్రులు | మౌలాలి సాహెబ్, మెహబూబ్ బీబీ | లక్ష్మణరావు, విజయలక్ష్మి | కొరుప్రోలు జనార్ధన స్వామి, జయలక్ష్మి | శ్యాంమోహన్, జయలక్ష్మి |
| తండ్రి వృత్తి | రిటైర్డ్ రైల్వే ఉద్యోగి | ఐడిపిఎల్ ఉద్యోగి | బిల్లు కలెక్టర్ | బ్యాంక్ మేనేజర్ |
| ఫేవరెట్ మ్యూజిక్ డైరెక్టర్స్ | ఎ.ఆర్.రెహమాన్ | ఇళయరాజా, ఎ.ఆర్.రెహమాన్ | ఇళయరాజా రెహమాన్ కె.వి.మహదేవన్ | ఆర్.డి.బర్మన్, ఇళయరాజా, ఎ.ఆర్.రెహమాన్ |
| జీవితాశయం | గొప్ప రచయిత అనిపించు కోవాలని లేదుగానీ, మంచి రచయిత అనిపించుకుంటే చాలు. | బెస్ట్ మ్యూజిషియన్ అనిపించుకోవాలి. | సంగీతరంగంలోనే ఏదైనా సాధించాలని వుంది | తెలుగు సంగీత రంగంలో టెక్నికల్‌గానూ, అన్ని రకాలుగానూ, 'ది బెస్ట్' అనిపించుకోవాలి. |

భీమనేనికి బాబ్జీ వాయిస్ నచ్చినట్టుంది. మాటల్లో తన ఫ్రెండ్స్ గురించి, తమ కంపోజింగ్ గురించి చెప్పాడు బాబ్జీ, కలవమని చెప్పారు భీమనేని.

ఈ కుర్రాళ్ళకి ఆశ్చర్యమనిపించింది. అంత పెద్ద దర్శకుడు తమని కలవమనడం మొదట నమ్మశక్యంగా అనిపించలేదు. భీమనేనిని కలిసి వాళ్ళు చేసిన ట్యూన్స్ వినిపించారు. వీళ్ళలో అద్భుతమైన ప్రతిభను ఆయన గమనించారు.

ఇంకేముంది. స్వీయ దర్శకత్వంలో తను నిర్మించనున్న 'నీ తోడు కావాలి' చిత్రానికి ఈ టీమ్‌తో మ్యూజిక్ చేయాలని డిసైడ్ అయ్యారు. నాలుగు నెలలు తనతోనే వుంచుకుని, వాళ్ళకు కావల్సిన స్వేచ్ఛ ఇస్తూ తనకు కావాల్సిన అవుట్ పుట్‌ను సాధించుకున్నారాయన.

ఈ ఆల్బమ్‌లో మొత్తం తొమ్మిది పాటలున్నాయి. పాటలన్నీ భాషశ్రీనే రాసాడు. ఆరు పాటలు బాబ్జీ పాడాడు.

'నీ తోడు కావాలి' పాటలు విన్నవాళ్ళంతా ఎక్స్‌లెంట్ అంటున్నారు. 'పిట్ట కొంచెం కూత ఘనం' అని ఇక్కడ వాళ్ళ వయసుల్ని ప్రతిభతో లింక్ పెట్టాల్సిన పనిలేదు.

ప్రతిభకు ఇప్పుడు హద్దులు, కొలమానాలు లేవు. కొత్తదనం కోసం పరిశ్రమ అర్రులు చాస్తోంది. యువత కూడా తమకొచ్చిన అవకాశాల్ని అధిక శాతం సద్వినియోగం చేసుకుంటున్నారు.

ఈ నలుగురు కుర్రాళ్ళు ముమ్ముందు మరింతగా పరిశ్రమలోకి కొత్తనీరు రావడానికి తోడ్పడతారని ఆశిద్దాం.

వాళ్ళ నలుగురిదీ చిన్న వయసే. ఈ వయసులో అనుకోకుండా వచ్చిన గ్లామర్, పేరు ప్రతిష్టలు ఎలాంటి వారినైనా ఇబ్బంది పడతాయి. కానీ వీళ్ళు తెలివైన వాళ్ళు. వచ్చిన ఆఫర్స్‌న్నీ ఒప్పేసుకుని తక్కువ టైంలో ఎక్కువ డబ్బు సంపాదించావాలనే ఐడియాలో లేరు. కొద్దిగా గ్యాప్ వచ్చినా గానీ ఫస్ట్ సినిమాకి చేసినంత క్వాలిటీలోనే ఇక ముందు సినిమాలకు కూడా మ్యూజిక్ నందించాలనే వుద్దేశ్యంతో వున్నారు.

అలాగే నక్సెన్‌ను చూసుకుని ఎవరి రూట్‌లో వాళ్ళు విడిపోవాలనుకోవడం లేదు. ఏం చేసినా నలుగురూ కలిసే చేస్తాం అని ఆత్మవిశ్వాసంతో చెబుతున్నారు.



## బాబ్జీ తో - ఇంటర్వ్యూ

మీది సంగీతపు కుటుంబమా?

అవును. మా నాన్నగారు, మా మామయ్య మల్లిపూడి శివరామయ్యగారు - మంచి సింగర్స్. మా ఫ్యామిలీలో అందరూ మంచి కళాకారులే. మా మామయ్య మెహర్‌బాబా మీద 200 పాటలు రాసి దేశవ్యాప్తంగా పేరు తెచ్చుకున్నారు.

గాయకుడిగా మీ తొలి ప్రయత్నం ఏది?

1990లో మామయ్య చేసిన 'అవతార్ మెహర్‌బాబా డోంట్ వర్రీ బీ హేపీ' ఆల్బమ్‌లో నేను రెండు పాటలు పాడాను. అప్పుడు నేను తొమ్మిదో తరగతి చదువుతున్నాను.

తర్వాత ఎక్కడా పాడలేదా?

తూర్పుగోదావరి జిల్లాలో బాగా ప్రసిద్ధి చెందిన గంగాధరం ఆర్కెస్ట్రాలో ఐదేళ్ళు పాటలు పాడాను.

సంగీతం ఏమైనా నేర్చుకున్నారా?

1992లో కాకరపల్లి వీరభద్రరావుగారి దగ్గర నేర్చుకున్నాను . అలాగే హైదరాబాద్ రిజర్వ్ బ్యాంక్ సెక్యూరిటీ వింగ్‌లో చేస్తున్నప్పుడు త్యాగరాయ మ్యూజిక్ అండ్ డాన్స్ కాలేజ్‌లో క్లాసికల్ డిప్లమో చేసాను.

ఉద్యోగంలో ఎప్పుడు చేరారు?

బి.కామ్ చదువుతుండగా 1993లో స్పోర్ట్ కోటాలో కానిస్టేబుల్‌గా జాబ్ వచ్చింది. మూడేళ్ళు సంగీతానికి దూరంగా వుండి సిన్సియర్‌గా జాబ్ చేసాను.

మళ్ళీ సింగింగ్ వైపు ఎలా టర్న్ అయ్యారు?

స్నేహితుని బలవంతం మీద 1996లో 'పాడుతా తీయగా' ప్రోగ్రామ్‌కి కేసెట్ పంపితే సెలెక్ట్ అయ్యాను. బాలూగారు నా గొంతుని మెచ్చుకున్నారు. ఇంప్రూవ్ చేసుకోమన్నారు.

మీ పేరు వెనుక ఏదో కథ వున్నట్టుందే?

కొత్తలంక బాబాగారు తూర్పుగోదావరి జిల్లాలో బాగా ఫేమస్. ఆయన భక్తురాలైన మా పెద్దమ్మ మీద అప్పుడప్పుడు పూనుతుంటారు. నేను పుట్టినప్పుడు మా పెద్దమ్మ మీద బాబా పూనితే 'అహ్మద్ వలీషా బాబ్జీ' అని నాకు పేరు పెట్టమని చెప్పింది. నేను హిందువునైనా గానీ, ఈ ముస్లిం పేరు నాకు బాగా అచ్చొచ్చింది.



## శేషు తో - ఇంటర్వ్యూ

సౌండ్ ఇంజనీరింగ్ పట్ల ఇంట్రస్ట్ ఎలా మొదలైంది?

నాన్నగారు చిన్నప్పట్నుంచీ హాబీగా నాటకాలకు సౌండ్ ఇంజనీరింగ్ చేసేవారు. ఆ ఇంట్రస్ట్‌తోనే ఇంట్లోనే చిన్న స్టూడియో ఏర్పాటు చేసారు. అందుకే నాలుగేళ్ళ వయసు నుంచే నాకు అబ్జర్వేషన్ మొదలైంది.

బషీర్‌బాగ్‌లోని 'శారదా డిజిటల్ స్టూడియో' మీదేనా?

నాన్నగారు, అత్తయ్య, శారద (ఒకప్పుడు సింగర్) ఇంట్రస్ట్‌తో ఈ స్టూడియో పెట్టారు. అప్పుడు నాకు పధ్నాలుగేళ్ళు. సెలవు దొరికితే చాలు నేను స్టూడియోలోనే గడిపేవాణ్ణి.

ఎంతవరకూ చదువుకున్నారు?

బి.కామ్ తర్వాత కంప్యూటర్స్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసాను. రెండేళ్ళు 'రిలయెన్స్ సైబర్‌టెక్'లో ఉద్యోగం చేసాను. ఆ కంపెనీ మూసేయడంతో స్టూడియోని డెవలప్ చేద్దామనుకున్నాను.

ఏ విధంగా?

ఎక్విప్‌మెంట్ కోసం ముంబై వెళ్ళాను. అక్కడే ఎవియం సౌండ్ లాబ్‌లో 6 నెలలు హార్డ్ డిస్క్ రికార్డింగ్, డిజిటల్ మిక్సింగ్‌లో శిక్షణ పొందాను. అక్కడికి వచ్చే చాలామంది మ్యూజిషన్స్‌ని అబ్జర్వ్ చేసాను. తర్వాత హైదరాబాద్ వచ్చాను. మిక్సింగ్‌లో మంచి పేరు సంపాదించుకున్నాను.

మ్యూజిక్ ఆల్బమ్ చేయాలనే ఐడియా ఎందుకు వచ్చింది?

నాకది ఫేషన్. ఆల్బమ్ చేసి డబ్బు చేసుకోవాలని, నన్ను నేను ప్రూవ్ చేసుకోవాలనే కోరికతో మాత్రం కాదు.



## సందీప్ తో - ఇంటర్వ్యూ

ఇంత చిన్న వయసులోనే గిటార్ ప్లేయర్‌గా ఎలా పేరు తెచ్చుకున్నారు?

నేను తొమ్మిదేళ్ళ నుంచే గిటార్ ప్లే చేయడం మొదలు పెట్టాను. ఇది నాన్నగారి ద్వారా నాకు అబ్బిన విద్య. నన్ను మంచి మ్యూజిషియన్‌గా చూడాలన్నది నాన్నగారి కోరిక. అందుకే నన్ను వందేమాతరం శ్రీనివాస్ దగ్గర జాయిన్ చేయించారు.

ఎన్నాళ్ళ నుంచి చేస్తున్నారక్కడ?

పదమూడేళ్ళ వయసు నుంచి ఆయన దగ్గర గిటార్ ప్లే చేస్తున్నాను. ఇప్పటికి ఓ 22 సినిమాలకు పని చేసి వుంటాను.



## భాషశ్రీ తో - ఇంటర్వ్యూ

రచయిత కావాలని ఎందుకునుకున్నారు?

ప్రత్యేక కారణం ఏమీ లేదు. చిన్నప్పట్నుంచి ఆసక్తి అంతే.

రచయితగా మీ కాన్ఫిడెన్స్ ఏమిటి?

పెద్ద పెద్ద సాహిత్యం పుస్తకాలు చదవలేదు గానీ, సింపుల్ పదాలతో ఎదుటి వాళ్ళకు అర్థమయ్యేలా రచన చేయగలననే నమ్మకం వుంది.

పాటల రచయిత కావడానికి మీరు చేసిన ప్రయత్నం?

రామోజీ ఫిలిం సిటీలోని ఫైవ్‌స్టార్ హోటల్‌లో సూపర్‌వైజర్‌గా రెండేళ్ళు పని చేసి, ఉద్యోగం మానేసి పాటల రచయితగా ప్రయత్నాలు మొదలెట్టాను. సంగీత దర్శకుడు గురురాజ్ దగ్గరికి వెళ్ళి నన్ను నేను పరిచయం చేసుకుని అవకాశమడిగాను. ఆయన తన దగ్గరనే వుండమన్నారు. ఆయన ద్వారా ఎర్రా రమేష్ పరిచయమై 'కలలు కందాంరా' సినిమాకి పాట రాసే అవకాశమిచ్చారు. అక్కడే బాబ్జీ, శేషు, సందీప్ పరిచయమయ్యారు.

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ. 80/-

ఆడియోపరంగా పాత పాటలకు సంబంధించిన ఏమంచి పనైనా సరే అది హెచ్.ఎం.వి. ద్వారా జరిగి తీరవలసిందే....! 'బహుదూరపు బాటసారి' అనే డబుల్ ప్యాక్ క్యాసెట్ల ద్వారా ఆ నమ్మకాన్ని నిలబెట్టుకుంటూ మరోసారి తమ అభిరుచి ఎటువంటిదో ఋజువు చేసుకున్నారు వారు. ఘంటసాల పాడిన ప్రైవేటు గీతాలలో పేరెన్నిక గన్నవి, మరుగునపడి అలభ్యంగా ఉన్న మరికొన్ని మహత్తర స్వరరచనలని - ఏక మొత్తంగా సంకలించి 'బహుదూరపు బాటసారి' పేరిట విడుదల చేసిన హెచ్.ఎం.వి. వారి చిత్త శుద్ధికి తెలుగు శ్రోతలందరూ ఋణపడక తప్పదు.

క్యాసెట్ నెం.1లో ఏ సైడు - ఎవ్వరిదీ కాళ్ళ చప్పుడు (రచన కరుణశ్రీ), గాలిలో నా బ్రతుకు (రతన్‌రావు), నగుమోమునకు (షైడిశ్రీ) లైలా (రతన్‌రావు), ఎడారిలో (రతన్‌శ్రీ), చూచెదవేలనో ప్రణయ సుందరి (కరుణశ్రీ), రేగిన ముంగురుల్ (కరుణశ్రీ), అదిసంధ్యా సమయము (సాంధ్యశ్రీ) బీ సైడు - రేపులో మాపులో (తోలేటి), రాధనురా (కరుణశ్రీ), పుట్టింటి పాపాయి (గుర్రం జాషువా), తూరుపు దిశయందు (సి.హెచ్.సుబ్బారావు), తెలుగుభారతి (తోలేటి) ఉన్నాయి. ఇవన్నీ అరుదుగా లభించే ఆణిముత్యాలు. ఒక్కొక్కటీ వింటుంటే కళ్లు చెమరుస్తాయి. గుండె గగుర్పొడుస్తుంది. శరీరం రోమాంచితమై పోతుంది. "మనకు ఎంతటి స్వరసంపద ఉంది!? ఇన్నాళ్ళూ వీటి పట్ల ఎంత ఉదాసీనంగా ప్రవర్తించాం!? ఇదే ఇంకొక భాషకు సంబంధించిన వారైతే ఊరుకుంటారా!? ఎంత ప్రచారం చేసుకుంటారు!? మన పట్ల మనకెందుకింత చిన్నచూపు!?" అనే భావనలు కలుగుతాయి. ముఖ్యంగా గుర్రం జాషువా గారి 'పుట్టబోయెడి బుల్లి బుజ్జిపాపాయి' వింటుంటే పులకించని శ్రోతలకి చెవులున్నా అవి - పోతన చెప్పినట్టు - కేవలం చర్మరంధ్రాలే!

క్యాసెట్ నెం.2లో ఏసైడు - నేనొక పూలమొక్కకడనిల్చి (పుష్పవిలాపం) (కరుణశ్రీ), బహుదూరపు బాటసారి ఇటురావో ఒక్కసారి (ఘంటసాల రచన), రావోయి బంగారి మావా (కొనకళ్ళ వెంకటరత్నం), చింతచిగురు చిన్నదానా (రావులపర్తి భద్రిరాజు), నీ చేయి నా చేయి (ఆరుద్ర), నిను నేను మరువలేనురా పంచదార వంటి పోలిసెంకటసామి (సీనియర్ సముద్రాల), తేనెలొలికించి (సత్యనారాయణ శర్మ), కోమల కోమలీ మణులు (నాగార్జునకొండ), (డా॥ యస్.ఆంజనేయులు), బీ సైడు - తలనిండ పూదండ దాల్చిన రాణి (దాశరధి), వెలిగించవే చిన్ని వలపుదీపం (దాశరధి), అది ఒక రమణీయ పుష్పవనము (కుంతీకుమారి), (కరుణశ్రీ), పాడనా ప్రభూ (రావులపర్తి భద్రిరాజు), జీవితమంతా (రావులపర్తి భద్రిరాజు), నీ కొండకు నీవే రప్పించుకో (సి.సుబ్బారావు), ఉన్నాయి. ఇవన్నీ బహుళ ప్రచారంలో ఉన్నవే. చాలావరకు రికార్డులుగా, రికార్డుల నుంచి తయారుచేసిన చేసిన క్యాసెట్లుగా, హెచ్.ఎం.వి.వారు లోగడ విడుదల చేసిన చేసిన క్యాసెట్లుగా దొరుకుతాయి. కాకపోతే ప్రస్తుతం మారుతున్న కాలానికి అనుగుణంగా మ్యూజిక్ సిస్టమ్స్ కూడా మారుతున్నాయి కాబట్టి అవన్నీ ఇప్పటి మ్యూజిక్ సిస్టమ్స్‌లో అంతగా వినబుద్దెయ్యదు. కానీ హెచ్.ఎం.వి వారు ఈ క్యాసెట్లను ఈ మార్పులకు అనుగుణంగా తిరిగి రికార్డు చేసి, మంచి క్వాలిటీ ఉన్న టేపులపైకి ట్రాన్స్‌ఫర్ చేశారు కనుక మరింత వినసొంపుగా ఉంటాయి ఆస్వాదించడానికి.

ఇవన్నీ ఒక ఎత్తు.... రెండు క్యాసెట్లకీ ముందు మాటగా జోడించిన కరుణశ్రీగారి ఉపోద్ఘాతం ఒక్కటీ ఒక ఎత్తు. ఆయన గొంతు ఎలా ఉంటుందో, ఆయన మాట్లాడితే ఎలా ఉంటుందో తెలియని అభిమానులు వేల సంఖ్యలో ఉన్నారు ఆంధ్రదేశంలో! వారందరికీ ఈ క్యాసెట్ అమృత తుల్యంగా అనిపిస్తుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే - 'మా దగ్గిర మంచి కలెక్షన్ ఉంది' అని చెప్పుకునే ప్రతి వారింటా ఉండదగ్గర డబుల్‌ప్యాక్ ఇది. అంతేకాదు ఇప్పటిదాకా ఏ కలెక్షను లేని వారు కూడా ఈ ప్యాక్‌ని కొంటే మంచి కలెక్షన్‌కి శ్రీకారం చుట్టినట్టే. ఇంతమంచి పనిని చేసినందుకు హెచ్.ఎం.వి. వారు బహువిధాల ప్రశంసార్హులు.




విడుదల : జి.యస్.కె.
వెల : రూ. 35/-

# రాజా ఆడియో రివ్యూ

యస్పీ బాలుతో 'భగవద్గీత' పాడించిన జి.యస్.కె. వారు మన పుణ్య క్షేత్రాలు, శ్రీరామగీత అనే రెండు ఆడియో క్యాసెట్‌లను విడుదల చేశారు. ఎనిమిది పుణ్యక్షేత్రాలకు సంబంధించిన స్థల పురాణాలతో కూడిన 8 పాటలు 'మన పుణ్యక్షేత్రాలు' క్యాసెట్‌లో ఉన్నాయి. వీటిని యువ రచయిత హర్ష రాయగా సీనియర్ మ్యుజిషియన్ నేమాని సూర్యప్రకాశ్ స్వరపరిచారు.

'తొలుత అవిఘ్నమస్తు అనుచు' అన్నట్టుగా తొలిగీతం కాణిపాకం వరసిద్ధి వినాయకునిపై మొదలవుతుంది. సంప్రదాయాన్ని కాపాడుతూ హంస ధ్వని రాగం లోనే స్వర పరిచారు ఈ గీతాన్ని. బాలు ఈ పాట పాడడం అటు పాటకి ఇటు ఆడియోకి 'అన్ని విధాలా' ఉపకరించింది, సహకరించింది. వేంకటేశ్వరునిపై 'తిరుమల వాసా శ్రీ వెంకటేశా' అంటూ యస్.పి.చరణ్ లేతగా పాడిన విధానం మార్దవంగా ఉంది. కాకపోతే 'శరణం' అనే పదంలోని 'శ' కారాన్ని పలికే పద్ధతి విషయంలో కాస్త తన తండ్రి బాలుని అబ్జర్వ్ చేయక తప్పదు. ట్యూన్ వింటుంటే స్వర్గీయ కోదండపాణి శైలి గుర్తుకు వస్తూ ఉంటుంది. జ్ఞాన సరస్వతిపై 'బాసర క్షేత్రాన భాసిల్లు తల్లీ' అంటూ పాడిన నిత్యసంతోషిణి సుస్పష్ట వాచకం పాటకు దన్నుగా నిల్చింది. ఈ పాటను కూడా సంప్రదాయబద్ధంగా సరస్వతి రాగాన్ని ఉపయోగిస్తూ స్వరపరిచారు. 'శ్రీశైల వాసా హే చిద్విలాసా' అంటూ యస్పీబాలు పాడిన పాటలో పాడుకోటానికి అనువైన సాహిత్యం జతపడింది. అభోగి రాగంలో కూర్చిన వరస నోటికి వెంటనే పట్టేట్టుగా హృదయానికి హత్తుకునేట్టుగా ఉంది.

'అన్నవరంలో అవతరించిన ఆది దేవా శరణం' అంటూ సత్యనారాయణ స్వామిపై బాలూ పాడిన పాటకు గౌరీ మనోహరి రాగంలో చేసిన ట్యూన్ రసభావస్ఫోరకంగా అమరింది. 'భద్రాద్రి క్షేత్రాన వెలసిన రామయ్య' పాటను యస్.పి.చరణ్ తన స్వర జీవితంలో ఆధ్యాత్మిక పరంగా ఓ ల్యాండ్ మార్క్‌గా చెప్పుకోవచ్చు. మధ్యమావతి రాగంలో ఈ పాటకు హృద్యమైన అనుభూతిని కలిగించటంలో తోడ్పడింది. బెజవాడ కనకదుర్గపై 'జగమేలు కనకదుర్గమ్మ జేజేలు అందుకోవమ్మా' పాటను మాస్‌ను ఆకర్షించే ట్యూన్, ఉష పాడిన పద్ధతి ప్లస్ పాయింట్స్‌గా నిలిచాయి. 'మందపల్లి శనీశ్వరా అండ నీవే మహేశ్వరా' అంటూ శనిదేవునిపై 'పాడుతా తీయగా' ఫేమ్ పార్థసారధి పాడిన పాట ప్రతి భక్తుడూ పాడుకోక తప్పదన్న స్థాయిలో ఉంది. ఈ సమీక్షకుడికి సంబంధించినంతవరకు శనీశ్వరునిపై వచ్చిన పూర్తి స్థాయి గీతం ఇదేనని చెప్పవచ్చు. రేవతిరాగంలో ఈ పాటను కూర్చారు. ఈ క్యాసెట్‌లోని గీతాలకు పార్థసారధి, రాజేష్ అందించిన వ్యాఖ్యానం సముచితంగా ఉంది.



# రెలుగాయిల స్పెషల్





"మా స్కూల్లో పిల్లలు ఎవరూ చేయలేని పని.... చివరకు టీచర్లు కూడా చేయలేనిది నేను ఒక్కణ్ణే చేయగల్ను...."
"ఏంటది?"
"నేను రాసిన నోట్సుని చదవటం....."



ముగ్గురాడాళ్ళు కూర్చోటానికి సీటు లేక నిలబడి వున్నారు రైల్లో. ఓలావు పాటి ఆవిడ కూర్చుని వుంది "నువ్వేకనక పెద్దమనిషివయితే లేచి నిలబడ వయ్యా... ఆ ముగ్గుర్లో ఎవరో ఒకరు కూర్చుంటారు..." అంది లావుపాటి ఆవిడ తన ప్రక్కన కూర్చుని వున్న పెద్దమనిషితో.
"నీకే కనక జాలిలాంటిదేదైనా వుంటే ముందు నువ్వు లేచి నిలబడమ్మా.... ఏకంగా ఆ ముగ్గురూ కూర్చుంటారు...." అని అరిచాడు పక్కనే ఉండి చోద్యం చూస్తున్న కుర్రాడు.






క్లాసులో లెక్కలు చెబుతున్నారు మాస్టారు. "పది రూపాయలకి ఏభై ఏపిల్ పళ్ళు యిస్తే ఒక్కొక్క యాపిల్ విలువ ఎంత?" అడిగేరు మాస్టారు.
"మీరు భలే వారండీ... ఈ రోజుల్లో పది రూపాయలకి ఏభై ఎవడిస్తాడు.? అలా యిచ్చాడంటే అవి ఏ కుళ్ళువోలేదా పుచ్చువో అయి వుంటాయ్..." అంటూ కుర్రాళ్ళంతా అడ్డుపడ్డారు ఏకగ్రీవంగా.



'పక్షులు - వలస' గురించి పాఠం చెబుతున్నారు సైన్సు టీచర్. ఒక జాతి కొంగని పిల్లలకు చూపిస్తూ "ఈ పక్షి ఎక్కడి నుంచి వచ్చిందో ఎవరైనా చెప్పగలరా?" ప్రశ్నించింది టీచర్.
"గుడ్డులోంచి టీచర్" అంటూ చెప్పారు పిల్లలంతా తడుముకోకుండా....



క్లాసులో టీచర్ పిల్లల్ని చదివిస్తు న్నారు. "పిల్లలూ... పరీక్షలు దగ్గరికి వచ్చేస్తున్నాయ్. దగ్గరికి రావటం కాదు. పరీక్షా పత్రాలు కూడా ప్రింటింగ్ ప్రెస్‌లో వున్నాయి. ఈ పాటికి మీరు అన్నీ చదివేసి వుండాలి. ఇంకా ఏమన్నా అనుమానాలుంటే యిప్పుడే అడగండి." అన్నారు టీచర్.
క్షణకాలం పాటు క్లాసంతా నిశ్శబ్దంగా అయిపోయింది. "సరస్వతీ ప్రింటింగ్ ప్రెస్‌లో ఉన్న క్వొశ్చెన్ పేపర్లు మనవేకదూ టీచర్" గట్టిగా అరిచాడో వెనకబెంచి కుర్రవాడు.



"ఏంటో సార్... నాకేమీ అర్థం కావటం లేదు.... నాకైతే నేర్చు కోవాలనే వుంది. మీరు చెబుతోంది రెండు చెవుల్లోకి వెళ్ళటం వెళ్తోంది. గానీ ఇంకో చెవులోంచి బయటకు వచ్చేస్తోంది". టీచర్‌తో చెబుతున్నాడు మొద్దబ్బాయ్.
"ఏంటి? రెండు చెవులోంచి వెళ్ళి ఇంకో ఒక చెవిలోంచి బయటకు వస్తోందా నీకు రెండు చెవులేకదా వుంటా?"
ఆశ్చర్యంగా అడిగేడు టీచర్.
"చూశారా... చూశారా టీచర్... దీన్ని బట్టి చూస్తే నాకు లెక్కలు కూడా రావని తెల్సింది...." అన్నాడు ఆ మొద్దబ్బాయ్.



# రెలుగాయిల స్పెషల్






తరగతి గదిలో అధికారి పిల్లల్ని తనిఖీ చేసన్తూ "పిల్లలూ.... మీకు తోచిన సంఖ్య చెప్పండి" అని అడిగేరు.

"ఇరవై ఏడు...." ముక్తకంఠంతో చెప్పారు పిల్లలంతా తనిఖీ అధికారి బోర్డు మీద 'డెబ్బై రెండు' అని రాశారు.

పిల్లలు చూసి వూరుకున్నారు.

"పిల్లలూ.... మీకు తోచిన సంఖ్య ఏదైనా మళ్ళీ చెప్పండి..." అని అడిగేరు తనిఖీ అధికారి.

"ఇరవై నాలుగు" చెప్పారు పిల్లలంతా ఆయన బోర్డు మీద నలభై రెండు అని తిరగేసి రాశారు.

ఈసారి కూడా పిల్లలు ఏమీ మాట్లాడలేదు.

"ఇంకో సంఖ్య ఏదైనా చెబుతారా?" మళ్ళీ అడిగేరు తనిఖీ అధికారి.

"ముప్ఫై మూడు (33) ...." గట్టిగా అరిచేడు ఓ కుర్రాడు.

"ఇప్పుడు చూద్దాంరా... మనం చెప్పిన దాన్ని ఎలా తిరగేస్తాడో...." అంటూ వినిపించింది బెంచీలోంచి.



"లెక్కలన్నీ కష్టపడి చివరిదాకా చేశావు గానీ.... వేటికీ జవాబులు వెయ్యలేదేం?" అడిగింది టీచర్.

"నాకెప్పుడూ తప్పు వచ్చేది అక్కడే టీచర్" అంటూ చెప్పిందా అమ్మాయి.






పిల్లలంతా పరీక్షహాల్లో కూర్చుని తలలు వంచుకుని పరీక్షా పత్రానికి జవాబులు రాసుకుంటున్నారు. ఓ కుర్రాడు మాత్రం అస్తమానం వంగి ముందుకూర్చున్న వాడి పేపరులోంచి కాపీ కొట్టి రాస్తున్నాడు. "మరీ యింత మోసమా? దాదాపు వాడి పేపర్లో సగానికి పైనే కాపీ చేశావ్ కదురా... అవునా కాదా?" గట్టిగా అడిగేరు టీచర్.

"వాడి రాత చూడండి టీచర్ ఎంత దరిద్రంగా ఉందో లేకపోతే... ఒక్కసారి చూడగానే మొత్తం ఎక్కించి పారేసేవాణ్ణి కదా... అసలు తప్పంతా వాడిదే టీచర్ టైమ్ వేస్ట్‌చేలో" అంటూ సమర్థించుకున్నాడు ఆ కాపీ రైటర్.



"న్యూస్ పేపరు వల్ల ఉపయోగమా? టీవీ. వల్లా?"

"న్యూస్ పేపరు వలనే ఉపయోగం ఎక్కువ సార్. చదివేశాక ఎంచక్కా పొట్లాలు కట్టుకోవటానికి పనికొస్తుంది. టీవీ వల్ల అలా కుదరదు కదా....!"



స్పర్శేంద్రియాల గురించి పిల్లలకు పాఠం చెబుతోంది టీచర్. వాళ్ళ నుంచి సమాధానాలు రాబట్టుకోవడం కోసం ప్రశ్నలు యిలా .... అడుగుతోంది...

"మనకు కళ్ళు ఎందుకున్నాయ్....?"

'చూడటానికి....'

"మరి ముక్కుదేనికి....?"

"వాసన చూడటానికి....."

"మరి చెవులు?"

"రింగులు పెట్టుకోవటానికి....."



"స్కూల్లో నువ్వు బాగా అల్లరి పెట్టావని టీచర్ కంప్లయింట్ ఇచ్చినా సరే ఇంటికెళ్ళాక మీ నాన్న నిన్ను కొట్టడటగా..."

"లేదురా.... పైగా నన్ను కొట్టడం వల్ల నాకంటే మా నాన్నకే ఎక్కువ బాధట...."

"అంటే.... నువ్వంటే మీ నాన్నకి అంత యిష్టం అన్నమాట..."

"అదేం కాదురా మానాన్నకు భుజాల నొప్పులు.... కీళ్ళ నొప్పులు.... వాతం అన్నీ వున్నాయిరా... అందుకే కొట్టడానికి భయం..."

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : సూరజ్ (1966)
బ్యానర్ : వీనస్ పిక్చర్స్
సంగీతం : శంకర్-జైకిషన్
రచన : హస్రత్ జైపూరి
గానం : మహమ్మద్ రఫీ
అభినయం : రాజేంద్రకుమార్, వైజయంతిమాల



## బహారోం ఫూల్ బర్సావో...



ఆవిర్భావం నుంచి అంతం వరకూ అంతా, అన్నీ ప్రకృతిలోనే, ప్రకృతి సాక్షిగా జరుగుతుంటాయి. బహుశా అందుకేనేమో కవులు తమ కవితా వస్తువును ప్రకృతిలో దర్శించే ప్రయత్నం చేస్తుంటారు. ప్రకృతి భాష తెల్సినవాడు ఎప్పుడూ ఒంటరిగా వుండడు. ప్రకృతితో తన సంతోషాన్ని, విషాదాన్ని చెప్తుంటాడు. తనకోసం వసంతాన్నిమ్మంటాడు. వర్షాన్ని తెచ్చి తన ప్రేయసిని హర్షంలో ముంచెత్తమంటాడు.

ఈ పాటలో ప్రేమికుడు అలాంటి ప్రకృతి మిత్రుడు. అడవి వర్ణాలు, చిత్రాలు తెలిసిన వాడు. మొగ్గలనుంచి మేఘాల దాకా అన్నింటికి తన ప్రేమను చెప్పినవాడు. తన ప్రేయసిని ఆహ్వానించడానికై వాటిని కూడా సమాయత్తం చేసేవాడు.



బహారోం ఫూల్ బర్సావో...
మేరా మెహబూబ్ ఆయాహై...
హవావో (రాగిణీ గావో...
మేరా మెహబూబ్ ఆయాహై...
వో లాలీ ఫూల్‌కీ మెహందీ
లగా ఇన్ గోరే హాథోం మే(...
ఉతర్ ఆయే ఘటా కాజల్
లగా ఇన్ ప్యారీ ఆంఖోం మే(...
సితారే మాంగ్ భర్ జావో
మేరా మెహబూబ్ ఆయాహై...
మేరా మెహబూబ్ ఆయా హై... ॥బహారోం॥
నజారోం హర్ తరఫ్ అబ్ తాన్ దో ఇక్ నూర్‌కి చాదర్
బడా షర్మీలాదిల్‌బర్ హై చలాజాయే, న షర్ మాకర్
జరా తుమ్ దిల్‌కో బహలావో
మేరా మెహబూబ్ ఆయా హై...
మేరా మెహబూబ్ ఆయా హై... ॥బహారోం॥
సజాయా హై జవా కలియోం నే అబ్ యే సేజ్ ఉల్ఫత్‌కీ
యిన్హే మాలూమ్ థా ఆయేగీ ఏకే దిన్ రుత్ మెహబ్బత్ కీ
ఫిజాఓం( రంగ్ బిఖరావో
మేరా మెహబూబ్ ఆయాహై...
మేరా మెహబూబ్ ఆయా హై... ॥బహారోం॥

బహార్ అంటే వసంతం. వర్షంలోంచి వచ్చినదే బరసాత్. (వ,బ అభేదం కదా) కురిపించు అనడానికి 'బరసావో' అంటారు. రాగాలు కలిగినది రాగిణి. మెహబూబ్ ఉర్దూపదం - ప్రేమికుడు, ప్రేయసి ఇద్దరికీ ఉపయోగిస్తారు.

వసంతమా పూలు వర్షించు...
నా ప్రేయసి వచ్చింది
పవనమా రాగాలు ఆలపించు...
నా ప్రేయసి విచ్చేసింది

పవనం పాడే రాగాలు ప్రేమికులకే తెలుసు. గాలి వేణువులో రాగమైతే, మదిలో సరాగమౌతుంది.

'గోరీ' అంటే తెల్లని అని అర్థం. మెహందీ అంటే గోరింటాకు. ఘటా అంటే మబ్బు. మనం 'ఘటం' అనే కుండను హిందీలో 'ఘడా' అంటారు. కాజల్ అంటే కాటుక, కజరా అని కూడా అంటారు. కజరారీ ఆంఖే(కాటుక కళ్ళు) గురించి కొన్ని పాటల్లో వింటాం. 'మాంగ్' అంటే పాపిట.

ఆ పూల ఎరుపు అమిరింది
ఈ తెల్లని చేతులకు గోరింటాకుగా
దిగివచ్చిన మబ్బుల నలుపు
అందమైన కన్నులకు కాటుకగా
నక్షత్రాలలారా, పాపిటను అలంకరించండి
నా ప్రేయసి విచ్చేసింది

ఈ రంగులన్నీ ప్రకృతిలోంచి వచ్చినవే. పూల ఎరుపు-మామూలు ఎరుపు రంగు కాదు - పూవుల సహజాతంలో పరిపుష్టమైనట్టిది. అలాంటి పూల ఎరుపు మొగ్గ పూవుగా రూపుదిద్దుకొనే పరిణామ క్రమంలో ప్రతి ఘడియలోనూ కొత్త అందాలు సంతరించుకొంటుంది. ఆ ఎర్రదనాన్ని తెచ్చి తన ప్రేయసి అరచేతులకి గోరింటాకుగా పెట్టాలట.

సాధారణమైన కాటుక ఆమె నల్లని కనుపావల వద్ద వెలవెలబోతుందేమో అందుకే మేఘాల నలుపును తెచ్చి కాటుకగా పూయమంటున్నాడు.





నజారా అంటే దృశ్యం 'నూర్-కాంతి' (నూర్‌జహాన్ అంటే ప్రపంచానికే కాంతి అని అర్థం) తానా అంటే కప్పడం, చాదర్ అంటే దుప్పటి. శరమ్ అంటే సిగ్గు. సిగ్గరిని శర్మీలీ అంటారు. బహ్‌లానా అంటే ఆహ్లాద పరచడం.

**ఓ ప్రకృతీ నలుదిక్కులా పరచు**
**వెలుగు దుప్పటిని**
**అసలే బిడియస్తురాలు**
**సిగ్గుపడి మరలిపోతుందేమో**
**మనసును ఆహ్లాదపరచండి**
**నా ప్రేయసి విచ్చేసింది**

నలుదిక్కులా కాంతి దుప్పటిలా పరచుకోవడమన్నది మన భాషా ప్రయోగం కాదు. అయినా పరిచితంగానే ఉంటుంది.

తీరా అంతా సిద్ధపరిచిన తర్వాత ఆమె సిగ్గుపడి వెళ్ళిపోతే ఎలా...? అందుకే ఆమెకు నచ్చచెప్పమని మళ్ళీ ప్రకృతినే అభ్యర్థించడం.



సేజ్ అంటే శయ్య. ఉల్ఫత్ - ప్రేమ, స్నేహం. బిఖరానా అంటే చెల్లాచెదురు కావడం.

**లేత మొగ్గలు అలంకరించాయి**
**వలపు పానుపులను**
**తెలుసు వాటికి ఓ నాటికి**
**ప్రేమ ఋతువు వస్తుందని**
**విరజిమ్మండి రంగులను**
**నా ప్రేయసి విచ్చేసింది.**

వలపు పాన్పుని అలంకరించిన లేత మొగ్గలు కూడా ఎదురు చూస్తున్నాయి. ఆమె రాగానే వికసించేందుకు.

పాటంతా ప్రకృతి పరుచుకొన్న ఒక మంచి పాట యిది.



పల్లెటూరు, నిరుపేదలు, పరివర్తన, జయంమనదే, చరణదాసి, ఇల్లరికం వంటి చిత్రాల ద్వారా తెలుగు వారికి 'తెరపరిచితుడైన' దర్శకుడు తాతినేని ప్రకాశరావు హిందీలో తీసిన చిత్రమిది. అంతకుముందు ససురాల్, హమ్‌రాహి లాంటి చిత్రాలు ఆయన హిందీలో తీసినా అవన్నీ 'మనవే' అనే అభిప్రాయం తెలుగువారికి ఉండేది, ఎందుకంటే ససురాల్, హమ్‌రాహి సినిమాలు ఇల్లరికం, భార్యాభర్తలు కథలతో తీసినవే కనుక! 'సూరజ్' సినిమాని మన తెలుగువాడు తీసిన (తొలి) హిందీ సినిమా అనే లెవెల్లో చూశారు తెలుగువాళ్ళు. మంచి సంగీతం, చక్కని టేకింగ్... రాజేంద్రకుమార్, వైజయంతిమాల వంటి టాప్ స్టార్స్ కాంబినేషన్... వీటన్నిటితో అటు ఉత్తరాదిలో ఎంత ఘనవిజయం సాధించిందో ఇటు దక్షిణాదిలో... ముఖ్యంగా ఆంధ్రాలో ఈ క్రేజీ పాయింట్సన్నిటితో అంతే విజయాన్ని సాధించింది. మ్యూజికల్ ఎంటర్‌టెయినర్‌గా మంచిపేరు కూడా తెచ్చుకుంది, సినిమాలో హిట్‌సాంగ్స్ ఎన్ని వున్నా ఈ 'బహారోం ఫూల్ బర్‌సావో' పాట మాత్రం విపరీతంగా హిట్ అయింది.

ఈ పాట 'శివరంజని' రాగచ్ఛాయలలో స్వరపరిచారు శంకర్-జైకిషన్! అక్కడ కూడా ఆ రాగానికి చెందని అన్యస్వరాలను ఎఫెక్ట్‌కోసం ఉపయోగించారు కనుక 'మిశ్ర శివరంజని'గా భావించడం సుఖం! సాధారణంగా శివరంజని రాగాన్ని శోకగీతాలకు వాడేవారు. ఒక ప్రణయగీతానికి ఆ రాగాన్ని వాడడం నిజంగా ఓ ప్రయోగం. ఆ ప్రభావం తరువాత చాలా పాటలమీద కనిపించింది. ముఖ్యంగా మన తెలుగు వరకు చూసుకుంటే - చాలదా ఈ చోటు (నేనంటే నేనే), ఒకటై పోదామా ఊహల వాహినిలో (ఆస్తులు-అంతస్తులు), గుట్టమీద గువ్వ కూసింది (బుద్ధిమంతుడు), సిరిమల్లె సొగసు జాబిల్లి సొగసు (పుట్టినిల్లు - మెట్టినిల్లు) కనులలో నీరూపం (రావణుడే రాముడైతే) వంటి పాటలు చటుక్కున గుర్తొస్తాయి!

ఈ 'బహారోం ఫూల్ బర్‌సావో'ని రఫీ చేత ఇంగ్లీష్ ట్యూన్‌లో పాట పాడించి ఓ ప్రైవేట్‌సాంగ్‌లా శంకర్-జైకిషన్ రిలీజ్ చేశారు ఆ రోజుల్లో...!

**- బందా షాలిని శర్మ**




తెలుగు, తమిళ, హిందీ రంగాలలో ప్రతిష్ఠాత్మక చిత్రాలను నిర్మించిన సంస్థలలో ఏవీయమ్ ఒకటి. ఇప్పటికీ కొనసాగుతున్న ఘన చరితగల ఏవీయమ్ సంస్థ (చిత్రాల) గురించి ఏకంగా ఓ పుస్తకాన్నే తీసుకురావచ్చు. ఆ సంస్థ నిర్మించిన చిత్రాలలో ఒక మంచి చిత్రం:




ఎన్.టి. రామారావు, అంజలీదేవి, వైజయంతిమాల, యస్. బాలచందర్, యస్.వి. రంగారావు, నాగయ్య, రమణారెడ్డి మొదలగువారు ముఖ్య తారాగణం, ఈ చిత్రానికి దర్శకుడు ఎమ్.వి. రామన్, మాటలు - పాటలు తోలేటి, సంగీతం ఆర్. సుదర్శనం. ఈ చిత్రాన్ని తమిళంలో 'పెణ్' గాను హిందీలో 'లడ్కీ'గాను తీశారు. తెలుగు వెర్షన్ 'సంఘం'లో 12 పాటలున్నాయి. అందులో ఓ నాలుగు పాటల గురించి :

**ఆ.....**
**లలాలాలలా**
**భారత వీర కుమారిని నేనె నారీ రతనము నేనె**
**భారత నారీ అభ్యుదయానికి నాయకురాలిని నేనె ॥భారత॥**
**స్వార్థముతో కులమత భేదముతో**
**సతతము పోరే భరతావనిలో శాంతిజ్యోతి వెలిగిస్తా ॥సతతము॥**
**కర్షక సౌఖ్యం కార్మిక శ్రేయం (2)**
**కలిగే మార్గం చూపిస్తా (2)**
**రాణీ రుద్రమ మల్లమదేవి రెడ్డి నాగమ్మనేనే (2)**
**రణ తిక్కన భార్యా సతిమాంచాల (2)**
**శౌర్యధైర్యములు నావే**
**శౌర్యధైర్యములు నావే ॥భారత॥**





ఈ పాటను సుశీల పాడగా వైజయంతిమాల అభినయించింది. ఇవాళ విన్నాకూడా బావుండే ట్యూన్ యిది. ఈ పాటకు మోహనరాగం ఆధారరాగం. పల్లవి చివరలో గల - 'నాయకురాలిని నేనే' తర్వాత వచ్చే ఇంటర్ లూడ్‌తో సహా ఆరోజుల్లోని పిన్నలు, పెద్దలు 'హమ్' చేసుకునేవారు. అంతగా జనంలోకి వెళ్ళిపోయిన పాట యిది. పాత్ర స్వభావాన్ని ప్రతిబింబించే ఈ పరిచయగీతాన్ని (ఇంట్రడక్షన్ సాంగ్) పాతిక, ముప్ఫై ఏళ్ళ తర్వాత తమిళ దర్శకుడు భారతీరాజా ఓ చిత్రంలో కథానాయిక రేవతి పాత్ర ఎంట్రన్స్‌కి నేపథ్యగీతంలా వాడుకున్నారంటేనే ఊహించుకోవచ్చు - ఈపాట ప్రభావం ఎంతగా ఉండేదో!? ఈ పాట ఎక్కడైనా దొరికితే వినిచూడండి చాలా ఇన్‌స్పయిరింగ్‌గా ఉంటుంది. అంతేకాదు స్పష్టత, మాధుర్యంతోపాటు సుశీల గొంతు ఎంత ఖంగుమని మోగేదో కూడా తెలుస్తుంది.

సుందరాంగ మరువగ లేనోయ్ రావేలా
నా అందచందములు దాచితి నీకై రావేలా (2)
ముద్దు నవ్వుల మోహనకృష్ణా రావేలా ॥ముద్దు॥
నవ్వులలో రాలు సరాగాలు రాగమయ రతనాలు ॥నవ్వు॥ ॥సుంద॥
నీలి కనులలో వాలు చూపుల ఆ వేళా
నను చూసి కనుసైగచేసితివోయి రావేలా ॥నీలి॥
కాలి మువ్వల కమ్మని పాట ఆ వేళ ॥కాలి॥
ఆ మువ్వలలో పిలుపు అదే వలపు మురిపెముల కలగలుపు
మువ్వలలో పిలుపు అదే వలపు మురిపెముల కలగలుపు ॥సుంద॥
హృదయ వీణ తీగలు మీటి ఆ వేళా
అనురాగ రసములే చిందితివోయి రావేల ॥ హృదయ॥
మనసు నిలువదోయ్ మధువసంతమోయ్ రావేలా ॥మనసు॥
పూవులు వికసించె ప్రకాశించె ప్రేమతో పల్లవించె॥పూవులు॥ ॥సుంద॥





ఈ పాటను సుశీల పాడగా అంజలీదేవి, వైజయంతిమాల అభినయించారు. ఈ పాటకు అక్కడక్కడ యమన్ కలిసిన కళ్యాణిరాగం ఆధారం. ఆనాటి హిట్ సాంగ్స్ గురించి చెప్పుకుంటే ఇవాళ్టికీ జనామోదం పొందే గీతం యిది. చాలా సాదాసీదాగా, సాఫ్ట్‌గా ఉండే ట్యూన్, అక్కడక్కడ కొద్దిపాటి వైవిధ్యం తప్ప పాట మొదట్నించి చివరివరకు ఒకేరకం నడకతో సాగిపోయే ఈ వరసను జనం ఆదరించటానికి కారణం - మెలోడీ ప్లస్ రాగం! 'సంఘం' సినిమా విడుదలయిన 14 ఏళ్ళ తర్వాత కె.వి. రెడ్డిగారి 'భాగ్య చక్రం' అనే జానపద చిత్రం విడుదలయింది. ఆ సినిమాలో ఎన్.టి.ఆర్. అభినయంతో 'కుండ కాదు కుండ కాదు చినదానా నా గుండెలదర కొట్టినావే చినదానా' అనే పాటను పెండ్యాల స్వరపరిచారు. పల్లవి వింటూనే "ఇది సుందరాంగ మరువగ లేనోయ్ పాట ట్యూన్‌రా" అంటూ జనం పెదవి విరిచేశారు. అంతగా గుర్తుండి పోయిందా పాట.

---

సుమారు 20 ఏళ్ళ క్రితం నాటి మాట... హైదరాబాద్ అశోకా హోటల్‌లో వేటూరి సుందరరామ్మూర్తి మద్రాసు నుంచి వచ్చి బసచేశారు. 'అడవిరాముడు' పాటలు మారుమ్రోగిపోతున్న రోజులవి. అప్పటికి పత్రికలలో మ్యూజిక్ రివ్యూలు రాస్తున్న ఓ జర్నలిస్ట్ వచ్చి ఆయనని కలిశాడు.

"నీ రివ్యూలు చూస్తున్నాను. నిరంతర అధ్యయనంతో మన మస్తిష్కాలలో సమాచారాన్ని అలా పోగుచేసుకుంటూ ఉండాల్సిందే! ఇది అనంతం... దీనికి విసుగు, విరామం ఉండకూడదు" అని చెప్పి "సరదాగా పందెం ఒకటి పెట్టుకుందాం... నేను పది సినిమా పాటల పల్లవులు పాడతాను. ఆ పాటలు ఏ సినిమాలోవో, వాటిని ఎవరు రాశారో, ఎవరు పాడారో, ఎవరు మ్యూజిక్కో, ఎవరు నటించారో చెప్పాలి. అన్నీ కరెక్ట్‌గా చెబితే నీకు పదివేల రూపాయలు బహుమానం. అయితే మొదటి తొమ్మిది కరెక్ట్‌గా చెప్పినా ఒక్క పైసా ఇవ్వను. పదవ పాట కూడా కరెక్ట్‌గా చెప్పగానే మొత్తం పదివేల రూపాయలు ఇచ్చేస్తాను... సరేనా!?" అన్నారు వేటూరి.

ఇరవై ఏళ్ళ క్రితం పదివేల రూపాయలంటే ఇవాళ దాని విలువ ఎంతో ఈజీగా ఊహించుకోవచ్చు. "డబ్బు కోసం కాకపోయినా మీ అంతటివారితో పందెం కనుక ఓకే" అని అన్నాడా జర్నలిస్ట్.

వేటూరి 9 పాటలు పాడేరు. వాటన్నిటికీ కరెక్ట్‌గా చెప్పాడా జర్నలిస్ట్. పదవ పాట - 'జాతి భేదం సమసిపోదా జనులు సుఖ మందా' అనే పల్లవి గల పాట. దీని గురించి చెప్పలేక పందెం ఓడి పోయాడతను.



"పందెం సరే... అసలేమీ చెప్పలేవా?" అని అడిగారు వేటూరి. "ఒక్కటి మాత్రం చెప్పగలనండి... ఇది పాడింది నాగయ్య అని అనిపిస్తోంది" అని అన్నాడా జర్నలిస్ట్.

"ఎలా!?" అన్నారు వేటూరి.

"మీరు పాడుతున్నప్పుడు 'జా' అనే అక్షరాన్ని పలికిన తీరు, 'సుఖమందా' అనే పదంలో 'మందా' ని అటు 'మన్‌దా' అని కాకుండా ఇటు 'మమ్‌దా' అని కాకుండా ప్రత్యేకంగా పలికిన పద్ధతి- వీటన్నిటిని బట్టి నాగయ్యగారు పాడి ఉంటారనిపించింది" అని వివరించాడా జర్నలిస్ట్.

"కరెక్ట్... అది పాడింది నాగయ్యే! 'సంఘం' సినిమాలోని పాట అది! ఆ రోజుల్లో పాడుకుంటూ నటించేవారి పేర్లు నేపథ్యగాయనీ గాయకుల లిస్ట్‌లో వేసేవారు కాదు, అంచేత నాగయ్యపేరు టైటిల్స్‌లోగాని, పాటల పుస్తకంలోగాని లేదు. ఏది ఏమైనా నీ అబ్జర్వేషన్ బావుంది. ఇలాగే నిశితంగా ఆలోచిస్తూ కృషి చేసుకుంటూ సాగిపో... తప్పకుండా మంచి గుర్తింపు వస్తుంది నీకు" అంటూ ఆశీర్వదించారు వేటూరి.



ఓంకార నాదస్వరూపా భావరాగ తాళప్రదీపా
సాకి: నాట్యకలాపా నటరాజా నమో నమో
నటరాజ నమో నమో నమామి
ప: ఇలలో సాటిలేని భారతదేశం (2)
మా దేశం ఇలలో సాటిలేని భారతదేశం
కనులకు సుందరం - కళలకు మందిరం
మా దేశం సుందరం - కళలకు మందిరం
ఇలలో సాటిలోని భారతదేశం
చ1: పావన హిమశైలం - గౌరి కిరీటం ॥పావన॥
నిర్మల గంగానది - జీవ ప్రవాహం
దక్కను వజ్రాల పచ్చల హారం ॥దక్కను॥
మా కాశ్మీరం - రమ్యారామం ॥మా॥
ఇలలో సాటిలేని భారతదేశం
చ2: భగవద్గీత.... భగవద్గీత వేదనినాదం
గౌతమ బుద్ధుని జ్ఞానప్రదీపం ॥భగవద్గీత॥
రామకృష్ణ బోధలో అమృతసారం ॥రామ॥
దేశాల వెదజల్లే దివ్యప్రదేశం ॥దేశాల॥
ఇలలో సాటిలేని భారతదేశం
మా దేశం ఇలలో సాటిలోని భారతదేశం
చ3: కాళిదాస కావ్యం - జయదేవుని గానం ॥కాళి॥
అజంత ఎల్లోరా - అద్భుత శిల్పం
గాంధి రవీంద్రుల - ఘన సందేశం ॥గాంధి॥
ఖండ ఖండముల చాటే దేశం ॥ఖండ॥
ఇలలో సాటిలేని భారతదేశం మా దేశం॥ ఇలలో॥

ఈ పాటను సుశీల పాడగా వైజయంతిమాల అభినయించింది. సంగీతపరంగా, సాహిత్యపరంగా, గానపరంగా సినిమాలోగల పాటలన్నిటిలో పెద్దపీట వేయదగ్గపాట యిది. నిజానికి ఈ పాటను ఆ తరంలో కొందరు తప్ప చాలామంది మరిచిపోయారు. ఒక్కసారి తిరిగి ఈ పాటను మళ్ళీ వినడం జరిగితే అలా మరిచిపోయినందుకు బాధపడతారు కూడా! ఆగస్టు 15కి జనవరి 26కి జాతీయపతాకాన్ని ఎగురవేసే సమయాన ఈ పాటను ఆలపించి తీరాలని (ఆంధ్రప్రదేశ్‌లో) రూలు పెట్ట దగ్గంత మంచి, గొప్ప పాట యిది.

'ఇలలో సాటి లేని భారతదేశం' అంటూ రెండు రకాలుగా కంపోజ్ అయిన ట్యూన్ - 'మాదేశం' అంటూ ట్యూన్ పరంగా తీసుకున్న మలుపుకి టోన్ పరంగా జతచేసిన బేస్- 'భగవద్గీత...' అనే చరణానికి కళ్యాణి రాగంలో కలగలిసిన కమ్మదనం - చివర్న జోడించిన తిల్లానా ఇవన్నీఈ పాటకు అందంగా అమరిన ఆభరణాలు.



పెళ్ళీ.... పెళ్ళీ పెళ్ళీ పెళ్ళీ....
ఈడైనా దానితో జోడీగా హాయిగా ॥ఈడైనా॥
ఈలోకమందు సౌఖ్యాల పొంది అనందమొందగా
పెళ్ళీ... భలే మజా పెళ్ళీ.... ఆహాహా పెళ్ళీ....
పందిళ్ళకింద విందులు చేసే అత్తిల్లే స్వర్గం ఆనందమార్గం
భూలోక స్వర్గం ఆనందమార్గం
పందిళ్ళకింద విందులుచేసే అత్తిల్లే స్వర్గం ఆనందమార్గం
అమ్మాయికి అబ్బాయి అబ్బాయికి అమ్మాయి ॥అమ్మాయి॥
చేరిన సంసార జీవితం భలే భలే
చేరిన సంసార జీవితం సంఘంలో పూజితం
ఈ లోకమందు సౌఖ్యాల పొంది ఆనందమొందగా
పెళ్ళీ.... ఛంఛంఛం పెళ్ళీ.... డుండుండుం పెళ్ళీ
ప్రేమకి జాతి కీర్తి నీతి రీతి లేదయ్యోయ్
తెలుపు నలుపు లేదయ్యోయ్
మూడు ముళ్ళు వెయ్యయ్యోయ్
పెళ్ళీ... జిల్ జిల్ జిల్ పెళ్ళీ.... టకటకటక పెళ్ళీ
దేవుడు నన్నే చల్లగ చూస్తే
అప్పుడే నాకు అవుతుంది పెళ్ళీ నాకూ అవుతుంది పెళ్ళీ ॥దేవుడు॥
సరోజ గిరిజ వనజ జలజ మాలతి మాధవి మల్లిక మోహిని
ఎవతో ఓ భామిని ఆమే నీ కామిని
పట్నం పిల్లో పల్లెటూరి పిల్లో చిక్కిన రాజా చక్కిరకొట్టు
జణక్కు తకధిమి జణక్కు తకధిమి టికుటికుటికుడుండుం
వైవాహ కంకణం ప్రాప్తి బంధనం దైవ నిర్ణయం ॥వైవాహ॥
పెళ్ళీ.... తకుక్కు జన పెళ్ళీ... తదిగిణతోం పెళ్ళీ ॥ఈడైనా॥





ఈ పాటను పిఠాపురం నాగేశ్వరరావు పాడగా యస్. బాలచందర్ అభినయించారు. సన్నివేశపరంగా ఎన్.టి.ఆర్. కూడా చివర్న వచ్చి పాల్గొంటారు. పిఠాపురం నాగేశ్వరరావుకి లైఫ్ టైమ్ సాంగ్ ఇది. ఈ పాట విడుదలయిన దగ్గర్నుంచి ఆయన చనిపోయేవరకు ఎక్కడ కచ్చేరీ చేసినా, ఓ పదిమందితో కూర్చున్నా - ఈ పాటను పాడకుండా గాని, ప్రస్తావించకుండాగాని ఆయన బైటికి రాలేదు. అంతేకాదు - ఆ రోజుల్లో ఈ పాటను వెయ్యని పెళ్ళిపందిరి ఆంధ్రదేశంలో లేదు గాక లేదంటే అందులో ఆవగింజంత అతిశయోక్తి కూడా లేదు. ఎన్నిసార్లు విన్నా ఎన్ని తరాల తర్వాత విన్నా ఒకే రకం రసస్పర్శని కలిగించే గీతాలు కొన్నే ఉంటాయి. హుషారు గీతాల విషయానికొస్తే అభిరుచి మారిపోతూ ఉంటుంది కూడా! ఈ పాట మాత్రం ఓ మినహాయింపు. ఎప్పుడైనా వినండి... అదే ఊపు అదే హుషారు కలిగి తీరుతుంది.



ఈ పాటకు కొసమెరుపు ఏమిటంటే- ఈ పాటలో ముఖ్యపాత్రధారిగా అభినయించిన యస్. బాలచందర్ తన తర్వాత జీవితంలో ప్రసిద్ధ వైణికుడిగా మారడం! ఆయన వీణా వాదనను విన్నవారు - ఆయన కచ్చేరీలకు హాజరయినవారు - వెనక్కి తిరిగి 'సంఘం' చిత్రంలో ఆయన చేసిన పాత్ర పోషణకు, ఈ 'పెళ్ళీ' పాటకు అభినయించిన తీరుకి- ఒకింత ఆశ్చర్యానికి, మరింత ఆనందానికి, రవంత అరిగించుకోలేనితనానికి లోనవడం సహజం.

పైన ఉదహరించిన నాలుగు పాటలేకాక మిగిలిన 8 పాటలలో కూడా ఆడదంటే అలుసుకాదోయ్, జాతి భేదం సమసిపోదా, కరవాలమా నీ శూరత యిల చూపు బిరాన, నలుగురిలో నను నగుబాటు చేయుట న్యాయమ్ముగా తోచెనా, గుభీగభీమని జాతుల గోడలు కూలిసిరావోయి - పాటలు కూడా బావుంటాయి.

ఈ చిత్రాన్ని 'లడ్కీ' గా హిందీలో తీసినప్పుడు - నిదురించెడి భగవానుని ఉయ్యాల జోల అనే పాట ట్యూన్‌ని 'భగవాన్ తో ఆకాష్ పె సోతాహి రహేగా' పాటకి 'పెళ్ళీ...' పాట ట్యూన్‌ని ' షాదీ... షాదీ... షాదీ... కిస్మత్‌కి బాత్ హై మాలిక్ కె హాత్ హై / జీవన్ కా సాత్ హై' పాటకి వాడుకున్నారు. వీలయితే ఈ 'షాదీ' పాటను కూడా సంపాదించి వినగలిస్తే వినండి. కిషోర్ కుమార్ ఎన్ని ఛమక్కులు చేశాడో ఎన్ని గమ్మత్తులు చేశాడో... అసలు వాయిస్‌లో ఫ్లెక్సిబిలిటీ అంటే ఎలా ఉండాలో తెలుస్తుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే మంచి పాటకు చెవియొగ్గి వినేవారికి ఈ పాటలు ఓ అందమైన అనుభవం

## బొమ్మలాట



RamaKrishna





## 16-28 ఫిబ్రవరి 2002లో శ్రీ డి.వి.నరసరాజు రాసిన

# దాంపత్యానికి గీటురాయి కథకు వచ్చిన స్పందన

కాకినాడ సత్యంగారు "హాసం" గత సంచికలో (1-15 ఫిబ్రవరి) వేయింగ్ మిషన్ మీద తనకొచ్చిన కార్డు వెనకాల 'నీవు త్వరలో డి.వి.నరసరాజుగారి మరో కథ చదవబోతున్నావని వుంద'ని యథాలాపంగా వ్రాసిందానికి (నా ఉద్దేశంలో) ప్రస్తుత "హాసం" (16-28 ఫిబ్రవరి)లో మీ రచన 'దాంపత్యానికి గీటురాయి' కోరని వరం ఇచ్చే 'రూటే వేరయినా' దేవుడిచ్చిన బోనస్‌లా అనిపించింది.

లక్షణంగా పోట్లాడుకోవడం అన్నది దాంపత్యానికి గీటురాయి అని ఈ చిన్న కథలో మీదే అయిన శైలిలో చెప్పారు. రూములు ఖాళీలు లేవని చెప్పిన తరువాత కూడా ఆ జంటకు లక్షణంగా పోట్లాడుకోడానికి అవకాశమిచ్చి, వాళ్ళిద్దరూ దంపతులేనని తన గీటురాయిమీద రాసి చూసుకొని రూమిచ్చిన లాడ్జి యజమాని పాత్రలో పరకాయ ప్రవేశం చేసి కథను నడిపిన తీరు అద్వితీయం. అపురూపం.

సునిశిత హాస్యంతో మేళవించి ఈనాడు చాలా లాడ్జిలలో కనిపించే వాస్తవ పరిస్థితులను అద్భుతంగా చిత్రీకరించారు.

దంపతుల జంట లక్షణమైన పోట్లాటకు తోడుగా రామాయణంలోని బంగారు లేడి ఉదంతం (రాముడు - సీత పరంగా వ్రాసిన సంభాషణలు) హరి కథలో పిట్టకథలాగా గుక్క తిప్పుకోలేనంతగా నవ్వించింది. కాకినాడ సత్యం కోరిక తీరటంతోపాటు రాజుగారి పునరద్దర్శనం "హాసం"లో ఇంత త్వరగా అయినందుకు పాఠకులందరూ అదృష్టవంతులేననిపిస్తుంది.

-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్.

పాఠకుని లేఖకు స్పందించి మంచి కథ అందించిన మీకు హేట్స్ ఆఫ్ అనకుండా వుండలేం. రామాయణంలోని కీలక విషయాన్ని సున్నితంగా ప్రస్తావించడమే కాక, భార్యాభర్తలు అని నమ్మకం కలిగేందుకు లాడ్జి యజమాని పెట్టిన పరీక్ష, ఆ దంపతులు నెగ్గి రూమును పొంద గల్గిన వైనం - హాస్యంతో తొణికసలాడింది. అంతెందుకు, ఈ కథ "దాంపత్యానికి గీటురాయి" చదివిన నా లాయర్ మిత్రుడు రెడ్డిగారు (ఆయన కొద్దిగా సీరియస్‌గా వుంటారు లెండి) పడీపడీ నవ్వారంటే నమ్మండి. నేను ఒకటికి రెండు, మూడు సార్లు వెంట వెంటనే చదివా. నవ్వు బిగపట్టుకుందామంటే నా వల్ల కాలేదు. హాసరాజుగార్కి నమస్కరిస్తూ,

-నీలంరాజు రామ్‌బాబు, అద్దంకి.

16-28 'హాసం' సంచికలో మీరు వ్రాసిన "దాంపత్యానికి గీటురాయి" అనే కథను చదవగానే ఏదో ఒక విషయమై వాదోపవాదములాడుకొనే మా పక్కింటి దంపతులు గుర్తుకు వచ్చారు. వారిద్దరి అమ్మాయిలకు పెళ్ళిచేసి అత్తారింటికి పంపించినా వారు మాత్రం ఈ కీచులాట మాత్రం మానలేదు. వృద్ధాప్యానికి చేరువలో ఉన్న వారిని చూసినప్పుడల్లా నాకు అసలు ఇన్ని సంవత్సరాలు ఎలా కాపురం చేయగలిగారు అనే అనుమానం కలుగుతుంటుంది. ఇదే విషయం సదరు భర్తగారి వద్ద నేను ప్రస్తావించినప్పుడు ఆయన "పెళ్లయిన కొత్తల్లో కొన్నేళ్ళు బాగానే ఉంటుంది. ఆ తరువాత నుంచే ఈ కీచులాటలు మొదలవుతాయి. పెళ్లయితే నీకూ తెలుస్తుంది నాయనా!" అని "అసలు భార్యాభర్తలు ఏ పోట్లాటలు, గొడవలు లేకుండా సుఖంగా అన్యోన్యంగా ఉండాలంటే, భర్త చెవిటి వాడు, భార్య గుడ్డిది అయి ఉండాలి బాబూ" అన్నారు. నేను నవ్వుకుని ఊరుకున్నాను.

మీరు వ్రాసిన కథ చదివిన తరువాత చిరు కథానికతో సైతం మురిపించి, మైమరిపించి ఔరా అని అనిపించిన మీ కలానికి 'సలాం' చెప్పక తప్పదనిపించింది. పిట్ట (కథ) కొంచమైనా కూత (రాత) ఘనంగా ఉన్న ఈ హాస్యరచన ఎవరికీ చురకలు, మరకలు వేయకుండానే న'రసరాజు' గారి నరనమైన హాస్యాన్ని మరోసారి రుచి చూపించినందుకు "హాసం"కు కృతజ్ఞతలు.

కథాంతంలో లాడ్జి యజమాని "ఇప్పుడు మీరు నా కళ్ళముందే పోట్లాడుకోవడం చూసిన తరువాత మీరు అసలు సిసలైన భార్యాభర్తలని నాకు పూర్తి నమ్మకం కలిగింది. రండి, రూం యిస్తాను" అన్నప్పుడు నవ్వును ఆపుకోవటం నా వల్లే కాదు ఎవరి వల్లా కాదు. ఇలాంటి హాస్య రస పారిజాతాలు మరిన్ని మీ కలం నుండి వెలువడాలని ఆశిస్తూ.....

-షేక్ మహ్మద్ అలీ
నారాయణపురం, రాజమండ్రి.

కలహ కల్పితా! 'హాసం' పత్రికలో మీ కథ చదివిన తరువాత అప్పటి వరకు పోట్లాడుకోని దంపతుల మధ్య కూడా మీరు పోట్లాటలు తీసుకువచ్చి ఉంటారని నా అనుమానం. అందుకే మిమ్మల్ని అలా సంభోదించాను. గీటురాయిపై గీటుతోనే బంగారం తనని తాను నిరూపించుకొంటుంది. బంగారం లాంటి కాపురానికి గిల్లికజ్జాలే గీటు అని మీరు చెప్పిన తీరు చాలా బాగుంది. 'జీవితంలో అన్ని రసాలు పోయి నీరసం' మాత్రమే మిగిలిన వృద్ధులు కూడా భార్యతోను, లేక భర్తతోను చిలిపి తగవు వస్తే చాలు, ఎక్కడాలేని హుషారు కనిపిస్తుంది వాళ్ళలో. ఏదైనా కథ వ్రాయాలంటే టీవీ ఛానల్స్ దగ్గరకో ఇంగ్లీషు సినిమాలకో పరిగెట్టే కొంతమంది వర్ధమాన రచయితలకి మీ రచనలు మంచి స్ఫూర్తినిస్తాయి. కథ వ్రాయాలంటే చుట్టూ ప్రపంచంలోనే వెతకాలి అని మీ రచనల ద్వారా తెలుపుతున్నందుకు కృతజ్ఞతలు. ఇటువంటి కథలు మీరు ఇంకా ఎన్నో నాలాంటి వారి కొరకు వ్రాయాలని ఆకాంక్షిస్తూ....

-పి.సత్యం, కాకినాడ

మీ కథ "ఐడిల్ క్యూరియాసిటీ" చదివాక మీ కలం నుంచి అలాంటి కథ మరొకటి ఇప్పట్లో వస్తుందనుకోలేదు. వచ్చింది. విందు భోజనాల వద్ద పసందుగా ఉన్న కూర మరోమారు, ఇంకో మారు అడిగే 'భోక్త'లా ఎదురు చూసే నా బోటి 'హాస' ప్రియులకు. దాం'పత్యా'నికి గీటురాయి కథ పత్యానికి "కూడా" పనికొచ్చే కూరలాగా చాలా బాగుందనిపించింది. జోక్‌ని జోక్‌గా కాకుండా మంచి శిల్పి తన చాతుర్యం చేత మనోహరమైన శిల్పంగా మలచి రంగువేసి బట్టలు కడితే జీవకళ ఉట్టి పడుతుంది అనడానికి 'ఐడిల్ క్యూరియాసిటీ' మంచి ఉదాహరణ.

ఇలాగే దాంపత్యానికి గీటురాయి జోక్‌గా వచ్చినా. మీలాంటి వారి చేతి మీదుగా కథలా రూపుదిద్దుకొన్న తీరు అనితర సాధ్యం. మాలాంటి 'హాస' ప్రియులకు వదనాలకు దరహాసం అద్ది 'చింత'లను రవంత దూరం చేస్తున్న మీకు మా 'అట్ట' హాసం నుంచి 'మంద' హాసం వరకూ మీ ఆశీస్సులు కోరే.

-టి.వి.సత్యనారాయణ (త్యాగి)
హబ్సిగూడా, సికింద్రాబాద్

వందనములు... మీ 'దాంపత్యానికి గీటురాయి' కథ... కథా ఇది? నిత్యజీవిత సత్యం.... కాకపోతే మీ చాతుర్యంతో కథనంగా మలచి కథ అన్నారు అంతే! జీవితంలో భార్యాభర్తల అనుబంధాన్ని ఎంతలా స్టడీ చేస్తే ఈ కథ రాయగలరండి మీరు!! కానీ... కీచులాడుకోవడం, పోట్లాడు కోవడం కూడా ఉండని స్వేచ్ఛలేకపోతే అది భార్యాభర్తల బంధమెందుకవుతుంది మరి. తన మనిషి... తన చిరాకును భరించనీ భరించకపోనీ, కోపాన్ని, తాపాన్ని, విసుగును, ప్రేమ, కన్నీళ్ళు అలకలు, కీచులాటలు, పోట్లాటలు వాగ్వివాదాలు, ఇవన్నీ ఉంటేనే కదా జీవితం! అదే అన్నీ రుచుల్ని చవిచూసే దాంపత్య సంగీతం ఆలాపించే భార్య ప్లస్ భర్త అవుతారు. ఏమంటారు? నిజంగా మీరు చెప్పిన దాన్ని బట్టి రామాయణ గాథలు 'లేడి' విషయంలో అలాగే కీచులాట జరిగి ఉంటుందనిపిస్తోంది. అసలు పోట్లాట - కీచులాట లేకపోతే ఆ టైపు మాధుర్యం మిస్సైపోరూ ఏ జంట అయినా.... నిజమైన భార్యాభర్తల్ని కనిపెట్టే ఉపాయాన్ని లాడ్జీల వారికి అందించారు ఈ కథ ద్వారా!

-నేమాన సుభాష్‌చంద్రబోస్, శ్రీకాకుళం



# కార్టూన్లూ కమామీషూ

ఏడవటం గొప్పసంగతి కాదు. కాని మనసారా నవ్వటం, నలుగురినీ నవ్వించటం నిజంగా గొప్ప విషయమే! ఆ నలుగురినీ నవ్వించి, ఆనందింపచేసి, ఆలోచింపజేసే వివిధ ప్రక్రియల్లో కార్టూన్‌కళ విశిష్టమైందని నా అభిప్రాయం. A cartoon is worth thousands of articles. మహారచయితలు వందల పేజీల్లో చెప్పలేనిది, గొప్పవక్త గంటలకొద్దీ ఉపన్యాసం దంచి వివరించలేనిదీ, కార్టూనిస్టు చిన్న వ్యంగ్యచిత్రంద్వారా సూటిగా మెదడుకెక్కేలా చెపుతాడు. దేశంలో చాలామంది చదువురానివారు. వచ్చినవాళ్ళలో చాలామందికి చదవటానికి బద్ధకం- ఈ రెండువర్గాలకీ పనికొచ్చేది కార్టూన్! ఒక విషయం మీద లేదా వ్యవస్థమీద మనకుండే కోపం, ఏవగింపును ఈ కార్టూన్ అనే సాధనం ద్వారా పాఠకుడికి తెలియచెప్పగలుగుతాడు కార్టూనిస్టు. చేదుమాత్రలాంటి విషయాన్నైనా, హాస్యం, వ్యంగ్యం అనే చక్కెరపూత పూసి పాఠకుడిచేత మింగిస్తాడు. అయితే తన మనసులోని భావాన్ని చక్కని, చిక్కని గీతలతో హాస్యంగా గాని, విమర్శనాత్మకంగా గాని వ్యంగ్య చిత్రరూపంలో చెప్పటం తేలికైన సంగతి కాదు. అగ్గిపుల్లనుంచి అణుబాంబుదాకా, సబ్బుబిళ్ళనుంచి సమకాలీన రాజకీయాలదాకా, ఏ విషయంమీదైనా మంచి అవగాహన, చక్కని పరిశీలనాదృష్టి, కార్టూన్‌లో తగిన సన్నివేశరూపకల్పన, ఆ కల్పన కవసరమైన ఫోటో గ్రాఫిక్ కన్ను, క్లుప్తమైన క్యాప్షన్ రాయగల లేదా అసలు డైలాగేలేకుండా మూకీగా సన్నివేశాన్ని ఊహించగలనేర్పు, ఆకట్టుకునేలా బొమ్మలువేయగల చిత్రనైపుణ్యం, పాత్రలు వాళ్ళ ముఖాల హావభావచిత్రీకరణ... ఇంతెందుకు.. విమర్శకుడు, రచయిత, ఫోటోగ్రాఫర్, నటుడు, మేకప్‌మాన్, చిత్రకారుడు... ఇవన్నీ కార్టూనిస్ట్ అనే ఒకేవ్యక్తిలో సమ్మిళితమై అతను పండించిన కార్టూన్ సమపాళ్ళలో వండిన మంచి వంటకంలా రుచిగావుంటుంది. ఎందుకంటే, ఒక కార్టూన్‌కి కర్త, కర్మ, క్రియ పూర్తిగా కార్టూనిస్టే! కేవలం హాస్యప్రధానంగా నవ్వొచ్చేకార్టూన్లు కొన్ని మధ్యమధ్యలో గీసుకున్నా, తరచూ తానున్న ఈ సమాజంలోని మూఢాచారాలు అక్రమాలు దోపిడీ వగైరా అవకతవకలబూజుదులిపి రిపేరుచేసే మెకానిక్‌గా, రుగ్మతల్ని తొలగించి చికిత్స చేసి రోగాన్నికుదిర్చే డాక్టర్‌గా మారాలి- తన కార్టూన్లద్వారా! పలురంగాల్లోవున్న కుళ్ళుని బైటపెట్టి, చెడుని చీల్చిచెండాడి పట్టాలుతప్పిన ఈ సమాజపుబండి సరైనగాడిలో నడవటానికి దోహదపడాలి. విషయప్రాముఖ్యాన్నిబట్టి ఒక్కొకప్పుడు తేలు కుట్టినట్టు చురుక్కుమనిపించినా, కొండొకచో కొరడా ఝళిపించి భయపెట్టినా, చెంప ఛెళ్ళుమనిపించి గూబ్బగలకొట్టినా, అంతా సమాజ సంస్కరణకే! అయితే, కార్టూన్లు- మంచిని ఎగతాళి చెయ్యకూడదు, వెక్కిరించకూడదు. సామాజికప్రయోజనంవుండి చూసేవారిని ఆలోచింపజేయగలగాలి. నవ్వుతోపాటు నవ్వేమనిషి గుండెల్లో ఒక నిప్పురవ్వ రగిలించాలి. పురాణంగారన్నట్టు కార్టూన్లు- పేలని టపాకాయల్లాగా, నెమ్మకుపోయిన చిచ్చుబుడ్లలాగా ఉండకూడదు. మేఘాల ఫెళఫెళలాగా, ఏనుగు ఘీంకారంలాగా, ఝంఝుమారుతంలాగా, కుప్పించి ఎగసిన కృష్ణపరమాత్మ చేతిలోని చక్రధ్వనిలాగా ఉండాలి. అప్పుడే కార్టూనిస్ట్‌గా అవతారం ఎత్తినందుకు సార్థకత!

సబ్జెక్టులంటారా... సమాజంలో మనం నవ్వుకోవాల్సిన సంగతులు, సిగ్గుతో తలదించుకోవాల్సిన విషయాలు ఉన్నంతకాలం, టాపిక్‌లకి కొదవలేదు. ఎటొచ్చీ, ఆ టాపిక్‌ని మామూలువాళ్ళు చూడలేని యాంగిల్‌నుంచి చూడగలిగే శక్తి, దాన్లోని ఆయువుపట్టుని వెదికి పట్టుకోగల నైపుణ్యం కావాలి. కార్టూనిస్టు తన కార్టూన్లలో జుగుప్స, అశ్లీలాలకు తావివ్వకూడదు. తనకున్న మమకారాలూ, అభిమానాలూ, ఈర్ష్యా అసూయలూ పక్కనబెట్టి, ఓ జడ్జీలా నిజాయితీగా, నిష్పక్షపాతంగా వ్యవహరించాలి. ఎవరో భుజాలు తడుముకుంటారని, సామాజిక ప్రయోజనంవున్న ఒక మంచికార్టూన్ గీయటం మానుకుంటే పాఠకులు క్షమించరు. ఆ మాటకొస్తే అసలు ఉడుక్కునేవాళ్ళుంటేనే కార్టూనిస్టుకి గిరాకీ. అలాంటి ఎర్ర గురివిందలు కొన్నింటినైనా ఉడికిస్తేగాని, అందరినీ నవ్వించలేం! మంచికార్టూన్ పాఠకుడిని అలా గిలిగింతలుపెట్టి మనసారా నవ్వించి, హిప్నటైజ్ చేస్తుంది. అందుకే, కార్టూన్ సర్వరోగనివారిణి. అంతేకాదు, కత్తివేటుకన్నా, కలంపోటుకన్నా కార్టూన్‌గీటు దీటైనది, ఘాటైనది!

ఈ కళాపోషణలో పత్రికలపాత్ర చాలానేవుంది. నిజానికి పత్రికలు లేనిదే కార్టూన్లు లేవు. ఒక కార్టూన్ ప్రజలమధ్యకు వెళ్ళాలంటే పత్రికల సహకారం చాలా అవసరం. కార్టూన్లకి ఇంతవరకు లభించిన ఆదరణకి పత్రికలే కారణం. కాని ఆ ప్రాముఖ్యం అవసరానికన్న తక్కువగానే ఉందని చెప్పచ్చు. పత్రికల్లో కార్టూన్ల ప్రాముఖ్యత అందరికీ తెలుసు. కాని కథలమీద, నవలలమీద, ముఖ్యంగా సీరియల్స్‌మీద ఆధారపడుతున్న కొన్ని పత్రికలు కార్టూన్లని కొంతవరకు చిన్నచూపే చూస్తున్నాయనిపిస్తుంది. కార్టూన్ పప్పులో ఉప్పులాంటిది, పులుసులో కొత్తిమీర కరివేపాకులాంటిది. వాటికి అంతటి బ్రహ్మాండమైన రుచిని, ప్రత్యేకతను కల్పించేది ప్రాముఖ్యత అంతగాలేని

ఆ పదార్థాలే! కనుక పత్రికాధిపతులు, సంపాదకులు, కార్టూన్లనీ, కార్టూనిస్టులనీ మరింతగా ప్రోత్సహించి, మంచికార్టూన్లు ఎంచుకుని ప్రచురించి, కార్టూన్లు గీసేవాళ్ళనీ, చూసేవాళ్ళనీ ఉన్నతస్థాయికి తీసుకెళ్ళే ప్రయత్నం చేయాలి. కార్టూనిస్టులుకూడా, ఒక కార్టూన్ ప్రచురింపబడగానే చాలా పెద్దవాణ్ణయ్యానని భ్రమపడి ఊహాలోకాల్లో విహరించడం మానేసి, విస్తరించినకొద్దీ ఒదిగి తలవంచే వృక్షంలా భూమ్మీద నిలబడి చూస్తే సామాజికసమస్యలు, పరిష్కారమార్గాలు ఇంకొంత అవగతమయ్యి, వృత్తిలో మరింతగా కృషిచేయటానికి అవకాశం కలుగుతుంది.

## ఇక నాగురించి...

ఒకపక్క స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగం చేసుకుంటూనే, గత ముప్ఫైఏళ్ళకుపైగా హాబీగా ఈ కార్టూన్‌కళారంగంలో కృషిచేస్తున్న నాకు ఎన్నెన్నో తీపిగురుతులు! నాన్నగారివద్ద కవిత్వం నేర్చుకుని ఆ మాధుర్యాన్ని ఆస్వాదించినా, అప్పట్లో ఆంధ్రప్రభ వీక్లీ నిర్వహించిన లోకోక్తి చిత్రిక పోటీలో నా ఫస్ట్‌కార్టూన్‌కి ఫస్ట్ ప్రైజ్ రావడంతో ప్రారంభమైన నా వ్యంగ్య చిత్రరచనాయాత్రలో, తెలుగు, కన్నడ, తమిళ, హిందీ భాషల్లోని పేరున్న పత్రికన్నింటికీ కార్టూన్లువేసే అవకాశం కలిగింది. ఇంగ్లీష్‌లో ప్రముఖ పత్రికలు దాదాపు అన్నింటికీ వేశాను. ముఖ్యంగా ఆనాటి ప్రముఖ కార్టూన్ పత్రిక "శంకర్స్‌వీక్లీ"కి ఏడెనిమిదేళ్ళపాటు వేసినప్పుడు, పండిట్ నెహ్రూ అభిమానించే కార్టూన్ పితామహుడు శంకర్‌పిళ్ళయ్ నుంచి ముఖాముఖి సూచనలు, సలహాలు, శభాష్‌లు అందుకోవటం ఓ స్వీట్ మెమరీ! 'కారవాన్' (ఇప్పటి 'ఎలైవ్'), 'ఏమెన్స్‌ఇరా'లలో పాకెట్ కార్టూన్లతోపాటు 'హబ్బీ', 'రజిత' అనే రెండు ఫుల్‌పేజీ కలర్‌కార్టూన్‌ఫీచర్లు దశాబ్దంపైగా రెగ్యులర్‌గా గీయడం మరో మధురానుభూతి. ప్రఖ్యాత కార్టూనిస్ట్ అబూ అబ్రహాం ఎడిట్‌చేయగా ప్రపంచవ్యాప్తంగా సర్క్యులేట్ అయిన పెంగ్విన్‌బుక్ 'ఇండియన్ కార్టూన్స్'లో దేశంలోని ప్రముఖ కార్టూనిస్టుల సరసన ఆంధ్రప్రదేశ్‌నుంచి ఒక్క నాకుమాత్రం ఒకింతచోటు దొరికింది.

ఈ ప్రయాణంలో కొన్ని వర్క్స్ నన్ను ఎంతో ఇన్‌స్పైర్ చేశాయి. వేమన పద్యాలను జోడిస్తూ ఏడాదికిపైగా ప్రతివారం నాగార్జున ఫైనాన్స్‌కోసం స్వాతి, ఆంధ్రజ్యోతి వారపత్రికల్లో పబ్లిసిటీకార్టూన్లు గీశాను. మిడాస్ (మెన్స్‌వేర్)కు దక్కన్ క్రానికల్‌లో గీసిన యాడ్‌కార్టూన్లు బాగా పాపులర్ అయ్యాయప్పట్లో! స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా తెలుగుపంచాంగం కేలండర్‌కు, హౌజ్‌జర్నల్‌కి పదేళ్ళపాటు కార్టూన్లు వేశాను. ఏ.పి.ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ (సోషల్ ఫారెస్ట్రీ)కి చేసిన రకరకాల కార్టూన్‌విన్యాసాలు, ఆంధ్రప్రదేశ్ టెలికమ్యూనికేషన్స్‌కు, చిన్నమొత్తాల పొదుపుసంస్థకు వేసిన కార్టూన్ పుస్తకాలు, నాగార్జున సిమెంట్‌కు పబ్లిసిటీకార్టూన్లు, విష్ణుసిమెంట్‌కు వేసిన 'సామెతజెప్పినట్టు...' కార్టూన్లు, వగైరా మంచిపేరు తెచ్చిపెట్టాయి. శాటిలైట్ బేసిడ్ ఇంటరాక్టివ్ నెట్‌వర్క్ లెక్చర్‌కోసం 'స్ట్రెస్ మేనేజ్‌మెంట్' మీద నేను గీసిన కలర్‌కార్టూన్లు అహమదాబాద్ ఇస్రో స్టూడియోస్ ద్వారా ప్రసారం అయ్యాయి. నా కార్టూన్లను చూపిస్తూ హైదరాబాద్ దూరదర్శన్, జెమిని టీవీలు నా ఇంటర్వ్యూ ప్రసారం చేయడం, 1986లో ప్రొఫెసర్ మధు దండవతే ఆధ్వర్యంలో పార్లమెంటుసభ్యులతో కూడిన స్టడీగ్రూప్ రాక సందర్భంగా 'బ్యాంకింగ్' మీద వేసిన మల్టీకలర్ కార్టూన్లషోను వారు తిలకించి ప్రత్యేకంగా మెచ్చుకోవడం, అంతర్జాతీయంగా బల్గేరియా, బెల్జియం, ఇటలీ, స్విట్జర్లాండ్, జపాన్ వగైరా దేశాలు ఏటా నిర్వహించే ఇంటర్నేషనల్ కార్టూన్ ఫెస్టివల్స్‌కి నేను పంపిన ఎంట్రీలు అక్కడ గుర్తింపు పొంది వారి సువనీర్లలో ప్రచురింపబడటం, కార్టూనిస్టుగా నాకు లభించిన కొన్ని ప్రోత్సాహాలు! ఉద్యోగం చేసుకుంటూ హాబీగా గీసేటప్పుడు ఫ్రీలాన్సర్‌లా కాక కొన్ని పరిధులుంటాయి. తగినంత సాధనచేసే అవకాశంకూడా ఉండదు. మిగతా కళల్లాగే ఈ కళకూడా అనంతం. ఎంతకాలమైనా ఓ విద్యార్థిలా కృషి చేసుకుంటూ పోవటమే నా కర్తవ్యం!

-ఎమ్.ఎస్. రామకృష్ణ
10-10 పావని ఎస్.బి.ఐ. కాలని
కొత్తపేట, సరూర్‌నగర్,
హైదరాబాద్ - 500 035




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. సతతము (సంఘం...భారతవీర కుమారిని)
   ఎ) ఎల్లప్పుడూ  బి) బాధపెట్టునది
   సి) గుంపు  డి) అన్నీ
2. సుందరాంగ (సంఘం...సుందరాంగ)
   ఎ) నచ్చినవాడు  బి) ప్రియుడు
   సి) స్నేహితుడు  డి) అందమైన శరీరము కలవాడు
3. మురిపెము (సంఘం....సుందరాంగ)
   ఎ) అలక  బి) నవ్వు
   సి) సంతోషము  డి) చుంబనము
4. పూజితము (సంఘం...పెళ్ళి)
   ఎ) పూజచేయునది  బి) పూజించబడునది
   సి) పూవులనుండి తీసినది  డి) గెలిచినది
5. భామిని( సంఘం..పెళ్ళి)
   ఎ) సులభంగా కోపంవచ్చే స్త్రీ  బి)రాత్రి
   సి) నర్తకి  డి) భార్య
6. వల్లభుడు (బ్రహ్మచారి...రవీనా)
   ఎ) రాజు  బి) జమీందారు
   సి) హితుడు  డి) ప్రియుడు
7. ప్రతిమ (బ్రహ్మచారి...నకిరేకల్లు)
   ఎ) అన్నిచోట్లా లభించునది  బి) విగ్రహం
   సి) ప్రతిబింబము  డి) స్త్రీ
8. కొమ్మ (బ్రహ్మచారి....నకిరేకల్లు)
   ఎ) లేఖ  బి) స్త్రీ  సి)తేమ  డి) ఆవాసము
9. వృథ (బ్రహ్మచారి...భామా ప్రేమకోసం)
   ఎ) ఉపయోగములేని  బి)పెద్దకథ
   సి) దుఃఖం  డి)ముసలితనము
10. మోడువారు ( సవ్వడి...తెగుతున్న బంధం)
   ఎ) మొద్దుబారు  బి) ఎండిపోవు
   సి) నశించిపోవు  డి) మరచిపోవు

**జవాబులు**

1) a 2) d 3) c
4) b 5) a 6) d
7) b 8) b 9) c
10) a


...అన్నట్టు.. బ్యాంక్‌లో
మీ అకౌంట్సూ, ఫిక్స్‌డ్ డిపాజిట్సూ,
సేఫ్ డిపాజిట్ లాకర్సూ, వగైరా
మీ ఆవిడ పేర
నామినేషన్
చేసొచ్చారా?!
Ramakrishna.


అంత దూరం నించి వచ్చాబ్బిందని
మీ దగ్గర అఆఇఈలు నేర్చు
కోడానికొచ్చాడు - కళ్ళు పరీక్ష
చేయించుకోడానికి!!
Ramakrishna.


చూడుమయ్యా! గా ఇష్టుమూర్తి భూమ్యాకాశాల
రెండూ ఆక్రమణం జేస్తే, గాయన్ని అవతారమూర్తి అంటూ
పూజల్ జేస్తరు! అదే నేను, జర్ర ఓ వందెకరాల భూమి
ఆక్రమణం జేస్తినని, బుద్ధిలేనోళ్ళు కేసు పెట్టిండ్రు!
కలికాలం!!
వామనావతారం
Ramakrishna.


మా బాస్ నాకేదో పండుగ-
బహుమానం ఇస్తున్నట్లు.
ఏమిటనడిగితే, ఇంటికెళ్లే
సరికి నీకే తెలుస్తుందిలే-పో.
అన్నాడు!
నిన్ను డిస్మిస్ చేస్తున్నా - మేనేజర్
Ramakrishna.


Ramakrishna.


ముప్పైయేళ్ళుగా ఆఫీస్‌లో రోజూ
మధ్యాహ్నం లంచ్ ఇలాగే చేస్తున్నా.
ఇవాళ రిటైరయ్యానని ఆ అలవాటు
ఒక్కసారిగా మార్చుకోవాలంటే
ఎలా?
Ramakrishna.


పట్టుమని పదినిమిషాలు కూడ
సీట్లో కూచోడు. చూశ్వాసి
మేనేజరే ఈ పన్జేశాడు!
Ramakrishna.


Ramakrishna.


అందరు ఆడువాళ్ళలాగే
భర్తతో ఏకాంతంగా గడపాలని
నాకూ ఉంటుంది! కాని, ఏం చేసేది?
ఈ జన్మకి నాకా అదృష్టం
లేదు!!


యూజే ఐవజే హావింగ్ పెయిన్ విత్
ఫీవర్, ఐవజే నాట్ కమ్ ఆఫీస్ ఎస్టర్డే!
ప్లీజ్ శాంక్షన్ గివ్ లీవ్!! హబ్బా! చూడమ్మా -
నువ్వు దూరదర్శన్‌లో ప్రాంతీయభాషాచిత్రాల
సబ్‌టైటిల్స్ చూసి నేర్చుకున్న ఇంగ్లీషు
నా మీద ప్రయోగించకు!


చూశావయినా సుపుత్రా! ఆ సేఫ్ కూడా ఈ
టూత్‌పేస్ట్ ట్యూబులాంటిదే! దీన్లోనుంచి
పేస్ట్‌ని బయటకు నొక్కటం తేలికే! కాని
ఇసుమంతైనా మళ్లీ లోపలికెక్కించటం కష్టం!


గుడ్‌న్యూస్ గురూజీ! ఇక్కడ మన పార్టీ
ఓటమికి ప్రతిపక్షాలే కారణమేమోనని
భయపడ్డాం కదా! అదేమీ కాదట - మనం
నడిపిన అసమ్మతి, ముఠా తగాదాల వల్లే
మన పార్టీ అతిఘోరంగా ఓడిపోయింది!!
అభ్యర్థి
ఓటమి






రోజీ అంటే నువ్వేనా చిట్టితల్లీ! రామ్మా!
నీ గురించి
మావారు రోజూ
'నిద్రలో' ఎన్నో
సంగతులు
చెపుతుం
టారు!!


ఇప్పటికిది మూడో టేబుల్!
ఆపరేషన్ చేసేప్పుడు
మరీ అంత లోతుగా
కోయొద్దని
చెప్పానా?


మనం చేపట్టిన ఈ కార్యక్రమానికి తన వంత సహకారంగా గౌరవనీయులైన ముఖ్యఅతిథి గారిని తను ఇవ్వదల్చుకున్న ఉపన్యాసాన్ని ఉపసంహరించుకోవలసిందిగా కోరుతున్నాను!
వాతావరణ కాలుష్యం అరికట్టండి!


చూశావామ్మా, తండ్రికి తగ్గ కొడుకని పించుకున్నాను. నాన్నగారిని పార్టీలోనుంచి బహిష్కరించారు కదా! నేను పరీక్షే కాపీ కొడుతుంటే పట్టుకుని, నన్ను కూడా ఎగ్జామ్స్ నుంచి బహిష్కరించారు!


లాకప్‌లో పడేసి ఖైదీల్ని చితకబాదటానికైతే బోల్డు ఓపికుంటుంది! నేను కాస్త పప్పు రుబ్బిపెట్టమంటే నీరసం నటిస్తారేం?!


ఆఫీసుకొస్తుంటే దార్లో యాక్సిడెంటై కాలికి దెబ్బతగిలింది సార్. అందుకే లేటయింది!
సర్లేవోయ్! ఏదో "కుంటి"సాకు!


"సదవగాహన" అంటేనా?! ఉదాహరణకి - దూరదర్శన్ లో మంచిప్రోగ్రాములున్నప్పుడు మనింటో కరెంటుండదు. కరెంట్ ఉన్నప్పుడు టీవీలో పరమచెత్త, కంపుప్రోగ్రాంలొస్తాయి. ఇదో ఈ రెండుశాఖల మధ్య ఈ సమన్వయం ఉండదే - అదన్నమాట!


సెంట్రల్
హెయిర్ - కటింగ్ సెలూన్


ఓర్నాయనో, ఈయన్నెవరో రౌడీమూక కత్తుల్తో కసకసా పొడిచిపోయారు దేవుడో!!
అబ్బా, అల్లరి చెయ్యకే - అవి కత్తిపోట్లు కాదు! ఆబిడ్స్‌లో రోడ్డుమీద వెళ్తుంటే ఎవడో మూర్ఖుడు పాన్ నమిలి తుపుక్కున మీద ఉమ్మేశాడు!!




పో నాన్నా! ఆంటీ దగ్గరికెళ్లి గుడ్‌మోర్నింగ్ చెప్పి ఓ ముద్దిచ్చిరా- వెళ్లు!
ఏమో నాకు భయం మమ్మీ! నిన్న డాడీకిచ్చినట్టు నాక్కూడా చెంపమీద లాగి ఓటిచ్చుకుంటే!


మరీ నిర్లక్ష్యమండీ! నేను ఒంట్లో జ్వరంగా ఉందని మందు కోసమొస్తే చూడండి, చేతికి కట్టు కట్టారు!
నాది మరీ అన్యాయం! నాకే జబ్బూ లేదు! పోస్ట్‌మన్‌ని - ఉత్తరాలిచ్చి పోదామని వచ్చాను!


ఇదెక్కడి బాదస్తమే! నీది వృశ్చికరాశి అయితే మాత్రం?!
......


అదేమిటే? పొద్దుటే ఇంటికొచ్చిన పక్కింటావిడతో గిల్లి తగాదా పెట్టుకున్నావ్?
ష్! మీకేం తెలీదు, మీరూరుకోండి! రేపు వాళ్లమ్మాయి బర్త్‌డే. పిలిస్తే ఏదైనా ప్రెజంటేషన్ పట్టుకెళ్లాలి, ఓ పాతిక రూపాయలు క్షవరం - అందుకు!!


టీవీల్లో బొమ్మ వంకరగా వస్తుంటే ఇన్నాళ్లనుంచీ అలాగే చూడకపోతే, వెంటనే రిపేరు చేయించుకోకూడదూ?!


మరి నే నెప్పుడు డబ్బులడిగినా పైసా లేదంటూ పీనాసి మాటలు పలుకుతారేం?!


ఇల్లిల్లూ తిరిగి సరుకులమ్మే ఆ ఉద్యోగం మాని వేరే ఉద్యోగమేదైనా చూసుకోండీ!


ఈ కొత్త అనౌన్సర్లతో ఇదే తంటా! అంతరాయానికి చింతిస్తున్నాం అని నోటితో చెప్తే సరిపోతుంది తల్లీ - అలా నిజంగా చింతిస్తూ కూర్చోనక్కర్లే!


పగిలిపోతే పోయిందిలేరా వెధవ అద్దం -
ఏడవకు. ఇంచక్కా కళాయి పెట్టిన అద్దంలా
మీ నాన బట్టతల ఉందిగా!!
Ramakrishna


Ramakrishna


ఈనెల జీతం
బ్యాంక్‌లో దాచారా, లేక
మీ అమ్మగారికిచ్చారా?
Ramakrishna


మా వారు బస్ కండక్టర్ కదు, పిన్నీ. ఉత్తరం ముక్క
రాయాలన్నా ఇలా ఊపితే కాని
రాత కుదరదు!
Ramakrishna


నీల్లో క్లాస్ లెక్కచేయటానికే ఇంతసేపు పడితే
రాబోయే క్లాసుల్లో ఇంకేం చేస్తావ్ డాడీ!!
ముందుముందు
పబ్లిక్ ఎగ్జామ్స్
కూడా!!
Ramakrishna


మా సర్కారి దవాఖానలో
సర్జన్‌గా ఛార్జ్ తీసుకునే ముందు
మీరీయన దగ్గర ఓ నెల్రోజులు
స్పెషల్ ట్రైనింగ్ తీసుకుని
రావాల్సార్!!
కటాకట్ మాంసం దుకాణం
Ramakrishna


ఓం కేశవాయనమః
గోవిందాయనమః ఓ.... ఒసేవ్
నీరజా...ఆ బాయిలర్లో నీళ్ళు మరిగిపోతున్నయ్,
తిప్పుకో... ఓం... డాడీ షేవ్ చేసుకుంటారేమో
కాసిన్ని కలియ్... మాధవాయనమః ఓం త్రివి...
పాలవాడొచ్చినట్టుంది తలుపుకొడుతున్నాడు, చూడర్రా
సుధీరూ... ఓం...పొవ్వు ఎక్కువపోయి
మను...హృషీకేశాయ... ...
Ramakrishna


మిసెస్ అవతారం
Ramakrishna
పాపం ఆ అమ్మాయి నడిరోడ్డు మీద మూర్ఛపోయి గిలగిలా కొట్టుకుంటుంటే అంతా అలా చూస్తూ వెళ్ళిపోతారేమిటండయ్యా!
ఏమోనమ్మా! అంతా అదేదో ఛానల్‌వాళ్ళ 'షో' ప్రోగ్రాం షూటింగ్ అనుకుంటున్నారు!


హలో-డాక్టర్ గారా?! మా వాడు టెలిఫోన్ మింగేశాడు - అర్జంటుగా రండి! హలో! వినబడుతోందా?!
Ramakrishna


మమ్మీ-నానమ్మ ప్రతిరోజూ ఆ భగవద్గీత చదూతుందెందుకు? తనక్కూడా ఆ సబ్జెక్ట్‌లో ఎగ్జామ్స్ ఉంటాయా?!
Ramakrishna


జుట్టు మరీ పొట్టిగా ఐనట్టుందోయ్ - కొంచెం పొడుగు చెయ్యి!
Ramakrishna


కాఫీ తక్కువిచ్చానని చెప్పరాదూ? మళ్ళీ ఆ వ్యంగ్యమెందుకూ?
Ramakrishna


అఖిల భారత డాక్టర్ల మహాసభ
Ramakrishna


డాక్టర్ సవ్యసాచి
VAT 69
సోడా
Ramakrishna


మిసెస్ అవతారం
Ramakrishna
మీ మగాళ్ళంతా ఇంతే! ఏ విషయం చెప్పినా ఒక చెవితో విని, రెండో చెవితో వదిలేస్తారు!
మా వాళ్ళే నయం! మీ ఆడాళ్ళకు ఏ విషయమైనా చెపితే రెండు చెవుల్తో విని, నోటితో వదిలేస్తారు!!


ఇదివరట్లో ఎంచక్కా "స్వీటీ", "మై షుగర్" అనే పిలిచేవారు. ఎటొచ్చీ ఈ మాయదారి డయాబిటిస్ వచ్చిందగ్గర్నుండీ ఆ పిలుపు కాస్తా "ఏమేవ్", "ఒసేవ్", "నిన్నే" లోకి దిగిపోయింది!!


క్రాపింగు - కనబడ్డానికి వీలుగా చెయమన్నారా, వినబడ్డానికి వీలుగానా!


POSTAL DEPT.


పొద్దున ఏడునుంచి తొమ్మిదిన్నర దాకా హైదరాబాద్ ఏ, బి, వివిధ్ భారతి, విజయవాడ, కడప, బ్రేక్‌ఫాస్ట్ టీవీ, టెలీస్కూల్ అన్నీ వింటాను!
అన్నీ ఒకేసారే! అదెలా?
మేం ఉండేది ఫ్లాట్స్‌లో కదా!


ఇందుకే ఈ డాక్టర్ సంబంధం వద్దన్నది! శోభనం గదిలో రొమాంటిక్‌గా ఉంటుంది కదాని కన్నుగీటా, దగ్గరగా వచ్చి ఒకసారి కళ్ళు పరీక్షించి, నరాల బలహీనత బాగా ఉంది. ఈ మందులు వాడు అంటూ ప్రిస్క్రిప్షన్ రాసిచ్చి గదిలోంచి బైటకెళ్ళిపోయారు!


మా ఆవిడకి మంచి రిస్ట్ వాచీలటు చూపెట్టండి!


మేం తీసిన సినిమాకు సంబంధించిన ఈ కోర్టు కేసులో నేనింత వరకు చెప్పిన కథ, దాని మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం అంతా మా లాయర్ గారే!
కొంప ముంచావ్ గదయ్యా ప్రొడ్యూసరా!


కొత్త మంత్రిగారా?! కొంప మునిగింది గురూ! ఆయన్నే మనం అప్పటి అల్లర్లప్పుడు లాఠీఛార్జీలో చితకబాది గూండా నిరోధక చట్టం కింద బొక్కలో తోసింది!!


యోగానందం లేదూ, రామానందం లేదు! రేపు వాడేదైనా ఎమ్మెల్లే ఐతే అసెంబ్లీలో చివరి వరసల్లో కూచోవాల్సొస్తుంది. "అ"కారంతో మొదలయ్యే పేరేదైనా పెట్టండి!


ప్రారంభోత్సవం
సిగరెట్ కంపెనీ


అయ్యో, ఇదేమన్యాయమండీ? పద్మనాభంనుంచీ పదివేలు పుచ్చుకున్నప్పుడూ పట్టుబడలేదు! ఈశ్వరయ్య దగ్గర ఇరవై వేలు ఈజీగానే తీసుకున్నారు! ఆఖరికి ముష్టి అయిదు వందల లంచానికా పట్టుబడిపోయారు?!
నీ అమ్మ కడుపు కాల, నువ్వు నోరు మూసుకోవే!


హెయిర్ కటింగ్ సెలూన్
గౌ॥ మంత్రిగారిచే
ప్రారంభోత్సవం


పేరంటాల్లో ఆఫీసర్ భార్యనని గొప్పచెప్పుకోడం కోసం నన్ను ప్రమోషన్ తీసుకున్నదాకా సతాయించావ్! ఇప్పుడు చూడు - ఇంటో కూడా ఈ గాడిద
చాకిరితో ఎలా చస్తున్నానో?


నే తెమ్మన్నది ఆఫీస్ రికార్డులు - సినిమా రికార్డులు కాదు


రెండు రోజులు, స్క్రూడ్రైవర్ కన్పించటంలేదా? మీ ఆస్పత్రి అలవాటు ప్రకారం ఇందాక రిపేరు చేసేప్పుడు కారు బోయ్‌నెట్లో పెట్టి మూతేసి ఉంటారు!
డా॥ కైలాసుధ
MBBS

